

# పోస్ట్‌మార్టమ్ - సైన్స్ & అంతుపట్టని వ్యాధులు


రచన :

**డా|| జి. సమరం, M.B.B.S.,**

వాసవ్య నర్సింగ్ హోమ్, బెంజి సర్కిల్,

విజయవాడ - 6.



ప్రథమ ముద్రణ : సెప్టెంబర్ - 1991

ముద్రణ :

అనూరాధా ప్రింటర్స్,

విజయవాడ - 520 001.

**వెల : 20-00**

ప్రచురణ :

నవభారత్ బుక్ హౌస్

ఏలూరురోడ్ * విజయవాడ-2



# పోస్ట్‌మార్టమ్ సైన్స్ &

## అంతుపట్టని వ్యాధులు

డా॥ జి సమరం

ఇంటిల్లిపాదికీ ఉపయోగపడే

# డా॥ సమరం

## ఇతర రచనలు

---

1. సెక్స్ - సైన్స్ 1వ భాగము
2. సెక్స్ - సైన్స్ 2వ ”
3. సెక్స్ - సైన్స్ 3వ ”
4. సెక్స్ - సైన్స్ 4వ ”
5. సెక్స్ - సైన్స్ 5వ ”
6. సైన్స్ - సెన్స్
7. నిత్యజీవితంలో జెనిటిక్స్
8. కుటుంబనియంత్రణ–పద్ధతులు
9. మనస్తత్వము - సైన్స్
10. మీరు - మీ ఆరోగ్యం
11. పిల్లలు - ఆరోగ్యం
12. పోస్ట్‌మార్టమ్ - సైన్స్

# డా॥ సమరం

## ఆధునిక వైద్య విజ్ఞాన గ్రంథావళి

---

1. జీర్ణకోశం - వ్యాధులు
2. కీళ్ళ నొప్పులు
3. మెదడు - వ్యాధులు
4. మూత్రపిండాలు - వ్యాధులు
5. చెవి, ముక్కు - వ్యాధులు
6. నోటి జబ్బులు
7. మెడ గొంతు-వ్యాధులు
8. చర్మ వ్యాధులు
9. ఊపిరి తిత్తులు-వ్యాధులు
10. కంటి జబ్బులు
11. గుండె జబ్బులు
12. కాలేయము-వ్యాధులు

# ఇందు. . .

## పోస్టుమార్టమ్ - సైన్స్



## పోస్టుమార్టమ్‌లో వెలువడిన నిజాలు

## అంతుపట్టని వ్యాధులు

తెలుసుకోవచ్చు. ఈనాడు ఫోరెన్సిక్ మెడిసెన్ (పోస్టుమార్టం సైన్స్) ఎంతో పురోగతిసాధించింది. ఆధునిక విజ్ఞానం, లేటెస్టు టెక్నాలజీతో మరణ రహస్యాలని ఛేదించడం సులభం అవుతుంది.

మరణానికి కారణాలు, మరణం వల్ల శవంలో కలిగే మార్పులు, వాటిని శాస్త్రీయంగా తెలుసుకునే పద్ధతులు వివరించేదే—పోస్టుమార్టం సైన్స్ (మెడికల్ జ్యూరిస్ ప్రుడెన్స్)

పోస్టుమార్టం ఒక పెద్ద సైన్స్. దానిని తెలుసుకోవడం ఒక పెద్ద థ్రిల్.



## 2. శవం ఎవరైనదీ గుర్తించడమెలా ?

శవం తెలిసిన వ్యక్తి కావచ్చు, కాకపోవచ్చు. ఏదైనా పోస్టుమార్టం సమయంలో వ్యక్తి ఆనవాలు (ఐడెంటిటీ) కోసం కొన్ని ముఖ్యమైన విషయాలని రికార్డు చేస్తారు. కొన్ని సమయాల్లో శవం పూర్తిగా కుళ్ళిపోయి-ఆడా? మగా? వయస్సు ఎంత? ఏ ప్రాంతం వ్యక్తి? ఏ మతస్తుడు?— ఇలాంటి ప్రశ్నలు తలెత్తుతాయి.

శవం ఆనవాలు (ఐడెంటిఫికేషన్) తెలుసుకోవడం కోసం ఈ క్రింది విషయాలని పరిశీలిస్తారు.

1. స్త్రీయా, పురుషుడా ?
2. వయస్సు

3. జాతి, మతం
4. పోలికలు
5. శరీరం రంగు
6. వెంట్రుకలు
7. అంగవైకల్యాలు (పుట్టుకతో కలిగినవి-తరువాత కలిగినవి)
8. వేలి ముద్రలు
9. పచ్చ (పొడిపించుకొన్న పచ్చ బొమ్మలు, పేర్లు)
10. దంతాలు
11. వృత్తిరీత్యా శరీరం మీద ఏర్పడిన తేడాలు
12. దుస్తులు, ఆభరణాలు
13. ఇతర ఆనవాళ్ళు

శవం కుళ్ళిపోయిన కొద్దీ ఆనవాళ్ళు చాలా వరకు తగ్గిపోతాయి.

ఆడా-మగా? :-

ఒక్కొక్క-సారి ఆడా మగా కాకుండా కొజ్జాలు కూడా కావచ్చు. దానిని గమనించడమవుతుంది.

సెక్సుని నిర్ధారించడానికి మర్మావయవాలను గమనిస్తారు. పురుషాంగం, వృషణాలు, ప్రోస్టేటు గ్రంధి పురుష సెక్సుని నిర్ధారిస్తారు. శరీర నిర్మాణం, విశాలమైనఛాతీ, గడ్డాలు-మీసాలు, తలమీద వెంట్రుకలు, గొంతుదగ్గర పెద్దదిగా కనబడే స్వరపేటిక, పెరగని వక్షోజాలు, మర్మావయాల

దగ్గర ప్రత్యేకంగా కనబడే వెంట్రుకలు పురుష సెక్సుని నిర్ధారిస్తాయి.

స్త్రీ సెక్సు నిర్ధారణలో గర్భాశయం, అండవాహికలు, ఓవరిస్ ఋజువు చూపిస్తాయి. పిరుదులు ఛాతీ కంటే వెడల్పుగా ఉంటాయి (పురుషులలో పిరుదులకంటే ఛాతీ వెడల్పుగా ఉంటుంది.) ముఖం మీద వెంట్రుకలు ఉండవు. కాన్పైన స్త్రీకి పొట్టమీద చారలుంటాయి.

స్త్రీలలో ఎముకలు చిన్నవిగా, బరువు తక్కువగా ఉంటాయి. ప్రక్క ఎముకలు పలచగా మగవారికంటె ఎక్కువ గుండ్రముగా ఉంటాయి.

ఛాతీ ఎముక (స్టెర్నమ్) పురుషులలో పెద్దదిగానూ, స్త్రీలలో చిన్నదిగానూ, ఉంటుంది. అంతేకాకుండా పురుషులలో స్టెర్నమ్ మాన్యుబ్రియంకి డబుల్ ఉంటుంది. స్త్రీలలో డబుల్ ఉండదు.

బస్థి ఎముక నిర్మాణంలో స్త్రీ పురుష తేడా ఉంటుంది. శాక్రమ్ పురుషులలో కంటే స్త్రీలలో ఎక్కువ వెడల్పుగానూ, కర్వ్డ్ గానూ ఉంటుంది.

దవడ ఎముక నిర్మాణంలో కూడా తేడా ఉంటుంది. యాంగిల్ ఆఫ్ మాండిబుల్ స్త్రీలలో లోపలికి ఉంటే పురుషులలో బయటకు ఉంటుంది.

వయస్సు :-

ఎత్తు, బరువు వయస్సుని కొంత నిర్ధారిస్తుంది. నోటిలో ఉన్న పళ్ళు వయస్సుని నిర్ధారిస్తాయి. ఎముకలలో ఎదుగు

దలకి కారణమయ్యే కేంద్రాలు వయస్సుని తెలియ జేస్తాయి.

వయస్సుని బట్టి దంతాలు :-

| | | | |
|---|---|---|---|
| 12 మాసాలకి | 8 పళ్ళు | | |
| 15 మాసాలకి | 12 పళ్ళు | | |
| 18 మాసాలకి | 16 పళ్ళు | | |
| 24 మాసాలకి | 20 పళ్ళు | | |
| 9 సంవత్సరాలకి | 12 శాశ్వత | దంతాలు | ఉంటాయి. |
| 10 సంవత్సరాలకి | 20 " | " | " |
| 12 సంవత్సరాలకి | 24 లేక 28 | " | " |
| 16 సంవత్సరాలకి | 32 " | " | " |

పాల దంతాలు 20 ఉంటాయి. క్రిందిదవడ ఎముకలకి ఒక్కొక్కవైపు 5 చొప్పున దంతాలు ఉంటాయి.

శాశ్వత దంతాలు 32 ఉంటాయి. క్రింది దవడ, పై దవడ ఎముకలకి ఒక్కొక్క వైపు 8 చొప్పున దంతాలు ఉంటాయి. విసురుడు దంతాలనే మూడవ దంతం లేదా జ్ఞాన దంతం అంటారు. ఇవి 17-25 సంవత్సరాలలో వస్తాయి. కొందరిలో ఇంకా ఆలశ్యం కావచ్చు.

వయస్సు — మెడికోలీగల్ ప్రాధాన్యత:-

6 మాసాలు :- 6మాసాలు గర్భస్థ శిశువుకి బ్రతక గలిగే అవకాశం ఉంటుంది. ఈ వయస్సులో అబార్షన్ చేస్తే భ్రూణహత్య క్రింద వస్తుంది.

7 సంవత్సరాలు:- 7 సంవత్సరాలకంటె తక్కువ

వయస్సు ఉన్నవారిని నేరస్తులుగా భావించడం ఉండదు.

7-12 వయస్సులో ఎత్తుకు పోవడం ఎక్కువ.

14 సంవత్సరాల లోపు వారికి ఉరిశిక్ష విధించరు.

16 సంవత్సరాలు నిండనిదే బోర్స్టల్ స్కూలుకి పంపకూడదు. ఇంతకంటే తక్కువ వయస్సు ఉన్నవారిని రిఫర్మేటరీకి పంపాలి.

18 సంవత్సరాల వయస్సు స్త్రీలకి మైనారిటీ తీరి వివాహానికి అర్హత వస్తుంది.

21 సంవత్సరాలు నిండిన పురుషులకి మైనారిటీ తీరి వివాహానికి అర్హులవుతారు.

వెంట్రుకలు :-

స్త్రీలలో 13-14 సంవత్సరాల వయస్సుకే మర్మావయాల దగ్గర రోమాలు వస్తాయి. పురుషులలో 14-15 సంవత్సరాల వయస్సుకి మర్మావయాల దగ్గర రోమాలు వస్తాయి. చంకలలో ఒక సంవత్సరం ఆలశ్యంగా స్త్రీ-పురుషులలో వెంట్రుకలు వస్తాయి. మర్మావయాల దగ్గరే ముందు వెంట్రుకలు వస్తాయి.

గడ్డాలు-మీసాలు 15-17 సంవత్సరాల వయస్సులో వస్తాయి.

ఆడపిల్లకి 13-14 సంవత్సరాలకి బహిస్టులు మొదలవుతాయి.

సాధారణంగా 45-50 సంవత్సరాలకి తల వెంట్రుకలు తెల్లబడతాయి.

40 సంవత్సరాలకి ముఖం మీద ముడతలు ఏర్పడ తాయి.

మరణించిన తరువాత వెంట్రుకలు ఎదగడం ఉండదు. కొందరికి మరణించిన తరువాత వెంట్రుకలు ఎదిగినట్లు కనబడ తాయి. దానికి కారణం చర్మంలో నీరు ఎండిపోయి వెంట్రుకల కుదుళ్ళు బయటపడును.

బ్రతికి ఉండగా వెంట్రుకలు నెలకి ఒకటి నుంచి రెండు అంగుళాలు పొడవు ఎదుగుతాయి రోజుకి అరమిల్లీ మీటరు చొప్పున పొడవు అవుతాయి.

వేలిముద్రలు :-

వేలి ముద్రలు ఒకరికొకరివి కలవడం బహు అరుదు. ఒక వ్యక్తి వేలి ముద్ర మరొక వ్యక్తి వేలి ముద్రపోలి ఉండటం 64 వేల మిలియన్లు మందికి ఒకరికి ఉంటుంది.

వేలి ముద్రలు లాగానే కాలి వ్రేలు ముద్రలు పెదాల ముద్రలు, దంతాల ముద్రలు కూడా. వేలిముద్రలు బట్టి ఆ ముద్ర ఆ వ్యక్తిదేనా, కాదా అనేది స్పష్టంగా నిర్ధారణ చేయవచ్చు. చనిపోయిన వ్యక్తి వేలిముద్ర తీసుకొని అంతకు ముందు ఆ వ్యక్తి వేలి ముద్రతో సరిచూచి అతనిదీ-ఇతనదీ ఓకటి అవునా కాదా, అతనూ- ఇతనూ ఓకటి అవునా, కాదా అనేది నిర్ధారించవచ్చు.

జాతి - మతం :-

దుస్తులు, వేషధారణ, తల మీద వెంట్రుకలు, జంధ్యం, బొట్టు, నగలు, మెడలో తాళిబొట్టు, స్త్రీ

మొదలైనవాటిని బట్టి ఏ మతస్తులైనదీ, ఏ దేశస్తులైనదీ తెలుసుకోవడానికి కొంత వీలుకుదురుతుంది.

వృత్తిరీత్యా ఏర్పడిన తేడాలు :-

చేసే వృత్తిబట్టి చేతులు, కాళ్ళు శరీరంలోని ఇతర భాగాలు దళసరిగా మారడం, ఒకొప్పుడు మచ్చలు ఏర్పడటం ఉంటుంది. వాటిబట్టి కూడా ఆ వ్యక్తి ఏవృత్తిచేసేవాడో తెలుసుకోవడానికి వీలవుతుంది.



# 3. ప్రాణం - మరణం

ప్రాణం ఉన్న వ్యక్తికి రక్తప్రసారం, శ్వాసక్రియ, హృదయస్పందన, నాడి కంటిపాప రియాక్షన్, అవయవాల కదలిక_ ఇలా అనేక లక్షణాలు ఉంటాయి

మరణించిన వ్యక్తిలో హృదయస్పందన ఉండదు. నాడి తగలదు. శ్వాసక్రియ ఉండదు. కంటిపాపలో, చర్మం లో మార్పు కనబడుతుంది. శరీరం చల్లబడుతుంది. మొదట కండరాలు వదులై కాలు చేయినిలబడితే నిలబడటం ఉండదు.

మృత్యువు తెచ్చే మార్పులు :

కడావెరిక్ లివిడిటీ (పోస్టుమార్టమ్ స్టెయిన్స్) :-

మరణం తరువాత శరీరం కదలకుండా ఉండిపోవడంతో శరీరంలోని చిన్న చిన్న రక్తనాళాలు రక్తంతో నిండి వుంటాయి. మరణించిన 3-4 గంటల్లో రక్తం ద్రవంగా

మారిపోతుంది. దాని ఫలితంగా రక్తం శరీరం దిగువభాగంలోకి చేరి చిన్న చిన్న రక్తనాళాల్లోకి చేరుతుంది. ఇలా చేరిన రక్తం ఊదారంగులో చర్మం మీద మచ్చలు కలుగజేస్తుంది. శవం వెల్లకిలా ఉంటే నడుము క్రింద ఈ మచ్చలు ఏర్పడతాయి బోర్లాపడుకోబెట్టి ఉంటే పొట్టమీద, ఛాతీమీద, ఇతర ఫ్రంట్ పోర్షన్స్‌లో మచ్చలులాగా వస్తాయి. ఈ మచ్చలు మరణించిన 2–3 గంటల్లో కనబడటం మొదలై 4–5 గంటలకి స్పష్టంగా తయారవుతాయి.

రైగర్ మోర్టిస్ :–

చనిపోగానే కండరాలన్నీ వదులై నిదానంగా కండరాలన్నీ స్టిఫ్ అవుతాయి. శరీరం కట్టెలాగా అవుతుంది.

దశలవారీగా శవం కుళ్ళడం (ప్యూట్రిఫాక్షన్) :–

మరణం సంభవించిన 6–12 గంటల్లో రంగులో మార్పు వస్తుంది. కంటి గుడ్లు మెత్తబడతాయి.

24–48 గంటల తరువాత శరీరం నుంచి కుళ్ళిన వాసన వెలువడుతుంది. పురుగులు కూడా మొదలవుతాయి. శవం ఉబ్బుతుంది.

36–48 గంటల నుండి శరీరం మీద బొబ్బలు వచ్చి కాలిన బొబ్బలుగా కనబడతాయి.

3–5 రోజులకి శరీరంలోని ఏ భాగానికాభాగం వేరు అవడం మొదలవుతుంది.

మరణంలో రకాలు

సెంకోప్ — గుండె ఆగడం

ఎన్‌ఫిక్సియా — శ్వాస ఆగిపోవడం

కోమా — మెదడు పని ఆగిపోవడం

మరణించిన కారణం బట్టి శరీరంలో మార్పులు కనబడతాయి. ఈ వివరాలు వివరంగా వేరుగా ఇవ్వబడ్డాయి.



## 4. గాయాలు - ప్రాణాపాయం

కొన్ని గాయాలు ప్రాణాపాయాన్ని కలిగిస్తాయి. అందుకని మెడికోలీగల్‌గా 'గాయానికి' ప్రాధాన్యత ఉంది. ఎవరైనా ఒక వ్యక్తిని గాయపరిస్తే, ఆ వ్యక్తి మరణిస్తే, ఆ గాయమే వ్యక్తి మరణానికి కారణమా, కాదా అనేది తేల్చవలసి ఉంది. అందుకనే గాయాలని వివిధ రకాలుగా వర్గీకరించడమైంది.

1. సింపుల్ గాయం (స్లైట్ వుండ్)
2. పెద్దగాయం (సివియర్ వుండ్)
3. ప్రమాదకరమైన గాయం (డేంజరస్ వుండ్)
4. ప్రాణాపాయ గాయం [గ్రీవస్‌వుండ్]

సింపుల్ గాయం :-

ఈ తరగతికి చెందిన గాయాలు వ్యక్తిని పనికి రాకుండా చేయవు. అతను రోజూవారీ చేసుకునే పనికి

2. బొప్పి కట్టడం [బ్రూయిజ్ లేదా కంట్యూజన్]
3. తెగిన గాయం [ఇన్సైజడ్ వుండ్]
4. చిలిగిన గాయం [లాసిరేటెడ్ వుండ్]
5. కన్నంపడ్డ గాయం [పంచర్డు వుండ్]
6. తుపాకి బుల్లెట్ గాయం [గన్ షాట్ వుండ్]
7. పైకి గాయంకనబడకుండా దేహంలోపల భాగాలు దెబ్బతినటం [ఇంటర్నల్ ఆర్గన్స్ ఇంజ్యూరీ]
8. కాలిన గాయలు
9. కరెంటు వల్ల, పిడుగువల్ల కలిగిన గాయాలు

ఈ గాయాలు కలిగినప్పుడు మెడికో లీగల్‌గా వీటిని పరిశీలించడం ఉంటుంది. ఈ గాయాలు ప్రమాదవశాత్తు కలిగినవా, ఎవరి మట్టుకు వారు కలిగించుకున్నవా, ఇతరులు గాయపరచినవా, కృత్రిమంగా కలిగించుకున్నవా, ఆత్మ హత్యా ప్రయత్నం వల్ల కలిగినవా అని నిర్ధారించవలసి ఉంటుంది.

గాయం ఆకారం, కలిగిన ప్రదేశం తీరు, దెబ్బ ప్రమాదవశాత్తు కలిగిందా, స్వయంగా చేసుకున్నదా, ఇం కొకరు చేసిందా అనేది కొంతవరకు నిర్ధారించవచ్చు.

గాయాలవల్ల ప్రాణాపాయం ఎలా కలుగుతుంది:-

1. అధిక రక్తస్రావం
2. షాక్
3. శరీరంలోని ముఖ్య భాగాలు గాయపడటం

రక్తస్రావం శరీరం లోపల జరగవచ్చు. లేదా శరీరం

నుంచి కారిపోవచ్చు. ఏ విధంగా జరిగినా ప్రాణంపోతుంది. శరీరంలో ఉండే రక్తంలో సగం గానీ మూడింట రెండు వంతులు పోయినా ప్రాణం పోతుంది. నిదానంగా రక్తస్రావం జరగడంకంటే అకస్మాత్తుగా రక్తం ఒకేసారి పోవడం వల్ల ప్రాణాపాయం కలగడం మరింత ఎక్కువ.

మధ్య వయస్సులు కంటె చిన్నపిల్లలు–వృద్ధులు రక్తస్రావం వల్ల తేలికగా మృతి చెందుతారు. స్త్రీలు కాన్పు సమయంలో అయ్యే అధిక రక్తస్రావాన్ని తప్పించుకోగలుగుతారు.

పెరికార్డియంలోకి గాని, శ్వాసనాళంలోకి గాని కొద్ది పాటి రక్తం చేరినా ప్రాణాపాయం తేలికగా కలుగుతుంది. అలాగే మెదుల్లాలోకి రక్తస్రావం ఏమాత్రంజరిగినా ప్రాణాపాయం తేలికగా కలుగుతుంది. అందుకని రక్తంస్రావం ఎక్కడ జరిగిందీ, ఎంత జరిగిందీ అనేది ప్రధానం.

షాక్ వెంటనే కలగవచ్చు. నిదానంగా కొన్ని గంటల తరువాత కలగవచ్చు. షాక్ అధిక రక్తస్రావం వల్ల కలగవచ్చు, లేదా దెబ్బ తగలడం వల్ల కలగవచ్చు.

పొట్టమీద పిడికిలితో ఒక గుద్దుగుద్దినా, టెస్టికల్స్‌ని గట్టిగా తన్నినా, యోనిమార్గంలోకి బలవంతంగా ఏదైనా దూర్చినా షాక్ కలిగి వెంటనే ప్రాణం పోవచ్చు. తలకి బలంగా దెబ్బ తగిలినా తక్షణమే ప్రాణం పోవచ్చు. ఇవన్నీ నరాలకి సంబంధించిన షాక్ పరిస్థితులు.

### ఆకారం బట్టి గాయం తగిలిన కాలం నిర్ణయం :-

మామూలు గాయం 24 గంటల్లో పైన పెచ్చు కడు
తుంది. బొప్పి కట్టిన గాయం 12–24 గంటల్లో రంగుమారు
తుంది. మారిన రంగును బట్టి బొప్పికట్టి ఎన్ని గంటలైందీ
నిర్ధారణ అవుతుంది. మామూలు గాయాలలో 24 గంటల్లో
ఇన్ఫ్లమేటరీ లక్షణాలు స్థిరపడతాయి. గాయం ఒక వారం
గడిస్తే గ్రాన్యులేషన్ టిస్యూ ఏర్పడుతుంది. పళ్ళు రాల
గొట్టబడితే 24 గంటలలో రక్తంకారడం ఆగిపోతుంది.
వారంరోజులలో పన్ను గుంట నిండిపోతుంది. ఇలాగే శరీ
రానికి కలిగిన గాయం ప్రాణం ఉండగా జరిగిందా, ప్రాణం
పోయిన తరువాత జరిగిందా నిర్ధారణ చేయవచ్చు. మరణా
నికి ముందు గాయమైతే రక్తంకారిన బిళ్ళలు ఉంటాయి.
మరణం తరువాత ఎవరైనాగాయం చేసి చంపారని ఆరోపణ
చేస్తే గాయమైన చోట చుట్టూతా కణుస్సులో రక్తం చేరిన
లక్షణాలు కనబడవు. బ్రతికి ఉండగా గాయమైతే గాయం
దగ్గర రక్తం గడ్డకట్టి ఉంటుంది. తరువాతైతే రక్తం గడ్డ
కట్టడం ఉండదు. రక్తం నీరై కారుతూ ఉంటుంది. రక్తం
బ్లూగా ఉంటుంది. ఇలా అనేక ఆధారాలతో గాయాలెప్పు
డైనదీ చెప్పవచ్చు.



# 5. ఆకలి చావుకీ - అనారోగ్యం చావుకీ తేడా !

వ్యక్తి బ్రతకడానికి ఆహారం, నీరు కావాలి. ఏ వ్యక్తి అయినా ఆహారం, నీరు రెండూ తీసుకోవడం మానేస్తే 10_15 రోజులలో మరణించి తీరుతాడు. ఆహారం తీసుకోకుండా కేవలం మంచినీళ్ళు తీసుకుంటే 30_40 రోజులు బ్రతుకుతాడు. కొందరు 60 రోజులు వరకు బ్రతుకుతారు.

ఆహారం తీసుకోనప్పుడు 36_48 గంటలలో ఆకలి అనిపించడం ఉండదు. దాహంఎక్కువ వేస్తుంది పైకడుపులో నొప్పి ఎక్కువ అనిపిస్తుంది. ఆ నొప్పి వున్న చోట గట్టిగా అదిమిపెడితే ఆ నొప్పికూడా పోతుంది. ఆహారంతీసుకోవడం మానివేసిన 4_5 రోజులు నుంచి చర్మం క్రింద క్రొవ్వు కరగడం మొదలవుతుంది. మనిషి నీరసించిపోవడం మొదలవుతుంది.

ఆహారలేమి లక్షణాలు :_

బుగ్గలు గుంటలవుతాయి. కళ్ళల్లో వెలుగు ఉండదు. కనుపాప పెద్దది అవుతుంది. కళ్ళు తెల్లబడతాయి. చెక్కిళ్ళ ఎముకలు బయటపడతాయి. మెడ దగ్గర కండరాలు స్పష్టముగా తేలుతాయి. ఛాతీ ఎముకలు బయటపడతాయి. ఛాతీ ఎముక మధ్య కండ తగ్గి గుండ్రంగా కనబడుతుంది. పొట్ట లోతుగా అవుతుంది. కాళ్ళు-చేతులు కండరాలు సన్నబడతాయి. ఎముకలు స్పష్టంగా బయటపడతాయి. వెంట్రుకలు ఎండిపోతాయి. వాటిలో మెరుపు తగ్గిపోతుంది.

చర్మం ముడతలు పడుతుంది. ఎండి పోతుంది. పెదవులు, నాలుక ఎండిపోతాయి. గొంతు చాలా నీరసంగా తయారవుతుంది. శరీరం వేడి తగ్గిపోతుంది. మొదట విరోచనం అవదు. మరణం దగ్గర దగ్గరపడిన తరువాత నీళ్ళవిరోచనాలుగా అవుతాయి. మూత్రం చాలాతక్కువ అవుతుంది కాని చిక్కగా, ఎర్రగా ఉంటుంది. త్వరత్వరగా బరువు తగ్గిపోతుంది. 40 శాతం బరువు తగ్గిపోయే సరికి మరణం ప్రాప్తిస్తుంది.

పండ్లచిగుళ్ళు పుళ్ళుగా మారుతాయి. లాలాజలం జిగురుగా మారుతుంది. నోరు ఎండిపోతుంది. స్పృహ మామూలుగానే ఉంటుంది. కాని కొన్ని భ్రమలు భ్రాంతులు కలుగుతాయి.

నాడి చాలా బలహీనంగా ఉంటుంది. శరీరానికి కాస్త నీరు చేరుతుంది. నీరు చేరటానికి ప్రోటీన్లలోపం కారణం కావచ్చు.

పోస్టుమార్టంలో కనబడే మార్పులు:-

ఆహారం లేక మరణించిన వ్యక్తి శరీరం పూర్తిగా శుష్కించి ఉంటుంది. కళ్ళు గుంటలై వుంటాయి. బుగ్గలు లోపలికి పోయి ఉంటాయి. నాలుక ఎండిపోయి ఉంటుంది. పైన తెల్లగా పాచి పేరుకుని ఉంటుంది. చర్మం ఎండిపోయి ఉంటుంది. చివరి దశలో కదలలేక పడుకొని ఉండిపోవడంతో బెడ్ సోర్స్ పడతాయి. కండరాలు క్షీణించిపోతాయి. మెత్తగా తయారవుతాయి. కండరాలకు సహజంగా ఉండే కలర్ పోతుంది.

మెదడు సాధారణంగా నార్మల్‌గా ఉంటుంది. మెదడు పై పొరలు రక్తంతో ఎర్రగా ఉంటాయి. గుండె కండరాలు సన్నబడతాయి, మెత్తబడతాయి. శ్వాసకోశాలు కృశించి ఉంటాయి. జీర్ణాశయము చిన్న దవుతుంది.

చిన్న ప్రేగులో పసర చేరి ఉంటుంది. పెద్ద ప్రేగు సన్నగా పల్చగా తయారవుతుంది. మూత్రపిండాలు, కాలేయం, స్ప్లీన్, పాన్క్రియస్ చిన్నవిగా మారతాయి. పసరు తిత్తిలోని పసరు నల్లగా మారుతుంది. మూత్రకోశంలో అసలు మూత్రం లేకుండా అవుతుంది.

ఆకలి చావు సంభవిస్తే పై లక్షణాలు స్పష్టంగా తెలుస్తాయి. కేన్సర్, టి.బి, కండరాల జబ్బు, సుగర్ జబ్బు, పెరిషియస్ ఎనీమియా, క్రానిక్ డయేరియా వల్ల మరణం సంభవిస్తే శరీరంలో వేరేమార్పులు కలుగుతాయి. ❋

## 6. అతి చలికి మరణం

అతి చలికి గురై మరణించడం చాలా వరకు ప్రమాదవశాత్తు సంభవించేవే. బాగా త్రాగి ఒళ్ళు తెలియకుండా ఆరుబయట పడి ఉండటం, స్ట్రోకు వచ్చి పడిపోవడం వంటివి ఇందుకు కారణం. అయితే కొన్ని కేసులలో చలిలో చంపేయడం ఉంటుంది. ముఖ్యంగా చంటిపిల్లలని వద్దనుకున్నవ్వాడు చలిలో పారేసి ఆ చలికి చంపేయడం ఉంటుంది.

అతి శీతలానికి గురైనప్పుడు శరీర ఉష్ణోగ్రత నార్మల్ కంటే 15-20 డిగ్రీల ఫారన్‌హీట్‌కి తగ్గిపోతుంది. తత్ఫలితంగా మరణం సంభవిస్తుంది. అరుదుగా కొన్ని కేసులలో 25 డిగ్రీల కంటే తగ్గినా మరణం సంభవించదు.

అతి శీతలాన్ని మధ్యవయస్కులు, యువకులు బాగా తట్టుకోగలరు. వృద్ధులు, పిల్లలు తట్టుకోలేరు.

అతి శీతలానికి గురైనప్పుడు అతి అలసట, శరీరంలో విష పరిణామాలు సంభవిస్తాయి. ఫలితంగా మరణం సంభవిస్తుంది.

మంచుకి గురైనప్పుడు చలి మనిషిని కొరికివేస్తుంది. శరీరం మీద చలి పుండ్లు పడతాయి. కళ్ళు, ముక్కు, చెవులు చలితో కొరకబడతాయి.

చలి వల్ల ప్రాణవాయువు టిస్యూలకి అందదు. ఎర్ర కణాల మీద ఉండే హీమగ్లోబిన్ చలివల్ల ప్రాణవాయువుని తీసుకొని శరీరానికి సరఫరా చేయలేకపోతుంది. గుండెకూడా తక్కువ సార్లు కొట్టుకుంటుంది. నిదానంగా ప్రాణంపోతుంది.

పోస్ట్‌మార్టంలో చర్మం పాలిపోతుంది. అక్కడక్కడ ఎర్రటి మచ్చలు కనబడతాయి. మెదడులో రక్తాధిక్యత పెరుగుతుంది. మెదడులోని ఖాళీ స్థలాలు నీరుతో నిండిపోతాయి. గుండె రక్తంతో ఉబ్బిపోయి ఉంటుంది. ❋

## 7. అధిక ఉష్ణోగ్రత వల్ల మరణం

ఎండ వేడికి ఎక్కువ గురైనా, వేడి ఎక్కువ ఉండే చోట ఉన్నా హీట్ స్ట్రోక్‌కి లోనవడం జరుగుతుంది.

అనారోగ్యంగా ఉన్నవారు, అతిగా శారీరక శ్రమ చేసేవారు, అతిగా మద్యం సేవించేవారు, పిల్లలు, వృద్ధులు గుండెజబ్బు, మధుమేహం ఉన్నవారు తేలికగా హీట్ స్ట్రోక్‌కి గురి అవుతారు.

అత్యధిక వేడికి గురై మరణించినప్పుడు రైగర్ మోర్టిస్ త్వరితంగా ఏర్పడుతుంది. పోస్ట్‌మార్టం లివిడిటీ కూడా త్వరగా కనబడుతుంది. మెదడు, దానిపైన పొరలు రక్తాధిక్యంతో ఉబ్బుతాయి. శరీరంలో భాగాలు కూడా ఎర్రబడి ఉబ్బుతాయి. కుడివైపు గుండె నల్లటి రక్తంతో నిండిపోతుంది. ఎడమ వైపు గుండె గదులు ఖాళీగా ఉంటాయి.



## 8. ఒళ్ళు కాలగా మరణం

మంటలవల్ల, ఎలక్ట్రికల్ స్పార్క్‌వల్ల, పిడుగుల వల్ల ఏర్పడిన మెరుపులవల్ల ఒళ్ళు కాలి మరణం సంభవిస్తుంది. ఇటువంటి గాయాలని 'బర్న్స్' అంటారు. ఒంటి మీద వేడి నూనె, వేడి నీళ్ళు, వేడి ద్రవాలు పడి కూడా కాలుతుంది. ఇలా కాలిన గాయాలని 'స్కాల్డ్స్' అంటారు.

బర్న్స్ కలిగినవాటిని బట్టి 6 తరగతులుగా (సిక్స్ డిగ్రీస్‌గా) విభజిస్తారు. మెడికో లీగల్‌గా కాలిన గాయాలని మూడు తరగతులుగా నిర్ణయిస్తారు.

ఫస్ట్‌డిగ్రీ బర్న్స్—కేవలం ఒళ్ళు కందుతుంది.
సెకండ్ డిగ్రీ బర్న్స్—ఒంటిమీద బొబ్బలు వస్తాయి
థర్డుడిగ్రీ బర్న్స్—కాలిన భాగంలోని టిస్యూలు మాడిపోతాయి. వాటిలో జీవం ఉండదు.

కెమికల్ బర్న్స్:- కెమికల్స్‌వల్ల శరీరం కాలుతుంది

ఒళ్ళు కాలడం వల్ల షాక్ కలుగుతుంది. కోమా ఏర్పడుతుంది. పొగ వల్ల ప్రాణవాయువు అందక ఉక్కిరిబిక్కిరి అవుతారు.

బర్న్స్ వల్ల షాక్ కలగగా 24-48 గంటలలో మరణం సంభవిస్తుంది. సాధారణంగా ఒళ్ళు కాలిన వాళ్ళు మొదటివారంలో 54 శాతం మంది మరణిస్తారు. ఒక వారం రోజులపాటు తట్టుకో గలిగితే ప్రాణాపాయ స్థితినుండి బయట పడవచ్చు.

శరీరం సగంగాని, మూడింట రెండు వంతులుగాని కాలితే ప్రాణం పోతుంది. పిల్లల్లో 1/8 శరీరం కాలినా మరణం సంభవిస్తుంది. సివియర్ డిగ్రీ బర్న్స్ అయినప్పుడు 1/3 శరీరం కాలినా మరణం సంభవిస్తుంది.

ఒళ్ళు కాలినప్పుడు చిన్న పిల్లలలో మరణం సంభవించడం ఎక్కువ. పెద్దవాళ్ళలో తక్కువ.

ఛాతీ, ముఖం, తల కాలితే ప్రాణాపాయం ఎక్కువ. చేతులు, కాళ్ళు కాలితే ప్రాణాపాయం తక్కువ.

లోతుగా ఒళ్ళు కాలితే, ఎక్కువ వేడి తగిలితే, ఎక్కువ సేపు వేడికి గురైతే ప్రాణాపాయం ఎక్కువ.

ఒళ్ళు కాలగానే చికిత్స మొదలైతే షాక్ నుండి కోలుకోవడానికి ఆస్కారం ఉంది. ఆలశ్యమైనకొద్దీ షాక్ వల్ల ప్రాణాపాయం ఎక్కువ.



## 9. గాలి ఆడక మరణం

గాలి ఆడక మరణం నాలుగు పరిస్థితులలో సంభవిస్తుంది. ఇటువంటి మరణాన్ని "డెత్ ఫ్రం ఎస్ఫిక్సియా" అంటారు.

గాలి ఆడక సంభవించే మరణాలు :-

1) ఉరి

2) పీక నులిమి వేయడం, పీక నొక్కడం

3) గాలి ఆడకుండా చేయడం

4) నీళ్ళలో మునిగిపోవడం

ఉరి :-

పీకకు ఉరిపడ్డప్పుడు గాలి అందదు. మెదడుకి రక్తం సరఫరా అవ్వదు. ప్రాణవాయువు అందదు. మెదడు నుంచి రక్తం గుండెను చేరదు. ఫలితంగా మరణంసంభవిస్తుంది.

జైళ్ళల్లో తీసే ఉరి వల్ల క్షణంలో ప్రాణంపోతుంది.

మామూలుగా ఉరి పోసుకున్నప్పుడు ప్రాణం పోవడానికి 5 నుంచి 8 నిమిషాలు పడుతుంది.

పీక నులమడం, నొక్కి వేయడం :—

వీటి వల్ల గాలి ఆడక ప్రాణాపాయం కలుగుతుంది. ఇటువంటి కేసుల్లో పీక నొక్కిన పరిస్థితి పోస్టుమార్టంలో స్పష్టంగా కనబడుతుంది.

గాలి ఆడకుండా చేయడం :—

ముక్కు, నోరు మూసేసి గాలి అందకుండా చేసినప్పుడు మరణం సంభవిస్తుంది. ఛాతీ గట్టిగా నొక్కి వేస్తే కూడా శ్వాస ఆడక ప్రాణం పోతుంది. పోస్టుమార్టంలో ఈ పరిస్థితి తెలుస్తుంది.

నీళ్ళల్లో మునక :—

నీళ్ళల్లో మునిగినప్పుడు గాలి ఆడక ప్రాణం పోతుంది. శ్వాసకోశాల్లోకి కూడా నీరు చేరుతుంది.

ఊపిరి ఆడక ప్రాణం పోయే వివిధ పరిస్థితులు పోస్టుమార్టంలో కనబడే మార్పులు వేరేచోట వివరంగా చర్చించడమైనది.



## 10. విషపదార్థాల వల్ల మరణం

విషపదార్థాలు శరీరంలోకి చేరిన తరువాత వాటి దుష్ఫలితాలని వివిధ రూపాలలో చూపిస్తాయి. వివిధ ముఖ్య అంగాలని నష్టం చేస్తాయి. ఫలితంగా ప్రాణాపాయం కలుగుతుంది.

విషపదార్థాలని అవి వ్యవహరించే తీరు బట్టి వివిధ తరగతులుగా వర్గీకరించబడ్డాయి.

1. కరోజివ్స్:- ఇవి రసాయనిక పదార్థాలు. ఇవి తమ రసాయనిక గుణం వల్ల నేరుగా టిస్యూలని నాశనం చేస్తాయి. కరోజివ్ పాయిజన్స్‌లో యాసిడ్స్ (ఆమ్లాలు), ఆల్కలీస్ (క్షారాలు) వస్తాయి.

2. ఇర్రిటెంట్స్:- ఇవి టిస్యూలని గాయపరచి వాటి పనికి ఆటంకం కలిగిస్తాయి. టిస్యూలు పని చేయకుండా అవుతాయి. అక్కడ వాపు, వేడి, నొప్పి వంటివి కలుగుతాయి. వైద్య పరిభాషలో చెప్పాలంటే ఇది ఇరిటేషను, ఇన్‌ఫ్లమేషను కలిగిస్తాయి.

ఇరిటెంట్స్‌లో ఇనార్గానిక్ ఇరిటెంట్స్, ఆర్గానిక్ ఇరిటెంట్స్ అని రెండు రకాలు ఉంటాయి.

ఇనార్గానిక్ ఇరిటెంట్స్‌లో ఐడిన్, క్లోరిన్, బ్రోమిన్ వంటి నాన్‌మెటల్స్, ఆర్సనిక్, యాంటిమొనీ మెర్క్యూరీ, లెడ్, కాపర్, జింక్, గోల్డ్, సిల్వర్ వంటి మెటల్స్ ఉంటాయి.

ఆర్గానిక్ ఇరిటెంట్స్‌లో వెజిటబుల్స్, ఆముదపు గింజలు, క్రోటన్ ఆయిల్, ఎర్గాట్, బిత్ర, పాము విషం, క్రిమికీటకాల కాట్లు, తేలు విషం వంటివి వస్తాయి.

గ్లాసు పౌటరు, వజ్రాల పొడి, ఎండిన స్పాంజి వంటివి కూడా ఇరిటెంట్స్ కోవకి చెందినవే.

న్యూరోపాయిజన్స్:- ఇవి నరాలని దెబ్బతీస్తాయి. ఇవి

విషపదార్థాలని అవి వ్యవహరించే తీరు బట్ట వివిధ తరగతులుగా వర్గీకరించబడ్డాయి.

1. కరోజివ్స్:- ఇవి రసాయనిక పదార్థాలు. ఇవి తమ రసాయనిక గుణం వల్ల నేరుగా టిస్యూలని నాశనం చేస్తాయి. కరోజివ్ పాయిజన్స్లల యాసిడ్స్ (ఆమ్లాలు), ఆల్కలీస్ (క్షారాలు) వస్తాయి.

2. ఇర్రిటెంట్స్:- ఇవి టిస్యూలని గాయపరచి వాటి పనికి ఆటంకం కలిగిస్తాయి. టిస్యూలు పని చేయకుండా అవుతాయి. అక్కడ వాపు, వేడి, నొప్పి వంటివి కలుగుతాయి. వైద్య పరిభాషలో చెప్పాలంటే ఇది ఇరిటేషను, ఇనప్లమేషను కలిగిస్తాయి.

ఇరిటెంట్స్లో ఇనార్గానిక్ ఇరిటెంట్స్, ఆర్గానిక్ ఇరిటెంట్స్ అని రెండు రకాలు ఉంటాయి.

ఇనార్గానిక్ ఇరిటెంట్స్లో ఐడిన్, క్లోరిన్, బ్రోమిన్ వంటి నాన్ మెటల్స్, ఆర్సనిక్, యాంటిమొనీ మెర్క్యూరీ, లెడ్, కాపర్, జింక్, గోల్డ్, సిల్వర్ వంటి మెటల్స్ ఉంటాయి.

ఆర్గానిక్ ఇరిటెంట్స్లో వెజిటబుల్స్, ఆముదపు గింజలు, క్రోటన్ ఆయిల్, ఎర్గాట్, బిత్ర, పామువిషం, క్రిమికీటకాల కాట్లు, తేలు విషం వంటివి వస్తాయి.

గ్లాసు పౌడరు, వజ్రాల పౌడి, ఎండిన స్పాంజి వంటివి కూడా ఇరిటెంట్స్ కోవకి చెందినవే.

న్యూరోపాయిజన్స్:- ఇవి నరాలని దెబ్బతీస్తాయి. ఇవి

మెదడు మీద పనిచేసినప్పుడు మెదడులోని నరాలు దెబ్బతిని కోమా వస్తుంది.

గార్డినాల్, నల్లమందు వంటి మత్తు మందులు, క్లోరోఫారం, కొకైన్ వంటి ఎనస్థీయా మందులు, ఆల్కహాలు, ఈథర్, కార్బాలిక్ యాసిడ్ వంటివి, ఉమ్మెత్త, బెలడోనా వంటివి న్యూరోటాక్సిన్స్ క్రింద వస్తాయి.

నక్సవామికా వెన్నుపూసలో నాడీమండలాన్ని నష్ట పరుస్తుంది.

డిజాక్సిన్, ఓలెండర్ వంటివి గుండెను నష్టపరుస్తాయి.

అనేక రసాయనిక వాయువులు నాడీ మండలాన్ని, శ్వాసకోశాల్ని, గుండెను దెబ్బతీసి ప్రాణాపాయం కలిగిస్తాయి.

విషపదార్థాలు శరీరంలోకి చేరే మార్గం :-

నోటిద్వారా, గాలిపీల్చడం, చరం ద్వారా, ఇంజక్షను, మలద్వారం, యోనిమార్గం, పుండు నుంచి, వెన్నుపూస నుంచి ఈ విషపదార్థాలు శరీరంలోకి చేరుతాయి.

ఈ విషపదార్థాలు మూత్రం, విరోచనం, పసరు, పాలు, చమట, ఉమ్మిలోకి చేరుతాయి. ఆ రకంగా అవి విసర్జింపబడతాయి.

విష పదార్థాల దుష్ప్రభావం :-

విషప్రభావం కలిగినప్పుడు వ్యక్తి షాక్‌కిలోనవుతాడు శరీరంలోని కండరాలు బిగుసుకుంటాయి.

ఫిట్సు వంటి కలుగుతాయి.

మూత్రపిండాలు పని చేయడం మానివేస్తాయి.

మెదడుకు రక్త సరఫరా తగ్గి మగత వస్తుంది.

వికారం, వాంతులు ఉంటాయి.

విషపదార్థాలు కొద్ది పాటిగానే శరీరంలోకి చేరి నప్పుడు చాలావాటి విషయం· దుష్ఫలితాలు తక్కువ ఉంటాయి. మోతాదు ఎక్కువలో ఉంటే వెంటనే ప్రాణా పాయం కలగవచ్చు, లేదా నిదానంగా కలగవచ్చు.

విషప్రభావం :-

విషం శరీరంలోకి చేరడం యాదృచ్ఛికంగా జరగ వచ్చు. లేదా ఎవరైనా విష ప్రభావానికి కారణం కావచ్చు. కొన్ని వృత్తుల్లో పనిచేస్తున్నప్పుడు, కొన్ని పరి శ్రమలనుంచి అకస్మాత్తుగా విషవాయువులు విడుదలైనప్పుడు విష ప్రభావానికి లోనవవచ్చు.

విష ప్రభావానికి గురైనట్లు తెలియడమెలా ?

వ్యక్తి ఆరోగ్యంలో తేడా రావడం- సాధారణంగా ఏదైనా తాగిన తరువాత, తిన్న తరువాత తేడా కనబడు తుంది. కొందరికి వెంటనే తేడా కనబడితే మరి కొందరికి కాస్త ఆలశ్యంగా తేడా కనబడవచ్చు.

కరోజివ్ పాయిజన్సు వల్ల ఒంటిమీద కాలినట్లు కన బడుతుంది.

ఇరిటెంట్సు వల్ల ప్రేగులకి కష్టం పడుతుంది. గొంతు పుండు అవుతుంది.

న్యూరోటాక్సిన్సు వల్ల కోమా వస్తుంది. లేదా వ్యక్తి

మగతగా ఉంటాడు. నరాల కంట్రోలు తప్పుతుంది.

కార్డియాక్ పాయిజన్సు వల్ల గుండె నిదానంగా, అస్తవ్యస్తంగా కొట్టుకుంటుంది.

వ్యక్తి విష ప్రభావానికి గురైనప్పుడు :-

ముందు విషాన్ని తీసివేయడం, దాని ప్రభావాన్ని తగ్గించడం అవసరం. నోటిద్వారా విషపదార్థాలని తీసుకున్నప్పుడు స్టమక్ వాషింగ్ ట్యూబ్ వేసి స్వచ్ఛమైన నీరుతో కడుపు కడిగివేయాలి.

యాసిడ్స వంటి కరోజివ్ పాయిజన్సు తీసుకున్నప్పుడు కడుపు పుండుగా మారి ట్యూబ్ వేయగా కన్నం పడి మరింత హాని కలుగుతుంది.

చార్‌కోల్ పౌడర్ నీళ్ళల్లో కలిపి త్రాగించాలి. కోడిగుడ్డు తెల్లసొన ఇవ్వాలి. వెన్న, మీగడ ఇవ్వవచ్చు. వీటి వల్ల విషం శరీరంలోకి చేరడం కొంత ఆగుతుంది.

రసాయనిక పదార్థాలు సేవించినట్లయితే వాటికి విరుగుడుగా వాటి వ్యతిరేక రసాయనకాలని ఇవ్వాలి. యాసిడ్స తీసుకున్నట్లయితే క్షారగుణం కలవాటిని ఇవ్వాలి.

స్ట్రాంగ్ ఆల్కలీస్ తీసుకుంటే డైల్యూటుయాసిడ్స ఇవ్వాలి.

పోస్టుమార్టంలో విషప్రభావం :-

విష పదార్థం తీసుకోవడం వల్ల లోపల ఎర్రగా పుండుగా కనబడుతుంది. లోపల కోసేసినట్లు, తినేసినట్లు ఉంటుంది. పుండ్లు, కన్నాలు ఉంటాయి. ప్రేగు లోపల

ఎర్రగా ఉండటమే కాకుండా ఇతర రంగులు కూడా ఏర్పడ తాయి.

తీసుకున్నది ఏ విషమో తెలుసుకోవడానికి కడుపులో ఉన్న పదార్థాలను రసాయనక పరీక్షకి పంపాలి. మూత్రం, విరోచనం, పసరు కూడా రసాయనక పరీక్షలకి పంపాలి. ఎందుకంటే రక్తంలోకి చేరిన విషం వీటిద్వారా విర్జింప బడుతుంది. గుండె, మూత్రపిండాలు, జీర్ణకోశం కూడా పరీక్షకి పంపాలి. వ్యక్తి బ్రతికి ఉండగా చేసుకున్న వాంతిని కూడా రసాయనక పరీక్షకి పంపాలి.



# పోస్టుమార్టంలో వెలువడిన నిజాలు

## 1. బూడిద బయట పెట్టిన మరణ రహస్యం

అదొక మహానగరం. అక్కడ రోజూ ఎన్నో హత్యలు, ఆత్మహత్యలు జరుగుతూ వుంటాయి. కొన్ని మరణాలు మిస్టరీగా మిగిలిపోతూ వుంటాయి.

డాక్టర్ అన్వేష్ ఫోరెనసిక్ మెడిసిన్ ప్రొఫెసరు.

కాలేజీలో వైద్య విద్యార్థులకి మరణ కారణం తెలుసుకోవడ మెలాగో చెప్పడమే కాకుండా హత్యలు, ఆత్మహత్యలు, యాక్సిడెంట్సు వల్ల ప్రాణాలు కోల్పోయిన వారి దేహాలని కోసి ఎందుకు మరణించిందీ, ఎలా మరణించిందీ వివరించి చెప్పవలసిన విధి అతనిది.

డాక్టర్ అన్వేష్ అంతకుముందే ఒక వింత మరణం తాలూకు శవాన్ని పోస్టుమార్టం చేసి వచ్చి తన ఛాంబర్లో రిలాక్స్ అవుతున్నాడు.

ఇంతలో "మే ఐ కమిన్" అని మర్యాదగా అడిగాడు ఒక పోలీస్ ఆఫీసరు.

డాక్టర్ అన్వేష్ "కమ్ ఇన్" అన్నాడు. తన దగ్గరికి పోలీసు ఆఫీసర్లు ఎందుకు వస్తారో అతనికి తెలుసు. అయినా "ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"పెద్ద సమస్య వచ్చి పడింది" అన్నాడా పోలీసు ఆఫీసరు

"ఏమిటి" అన్నట్లు ప్రశ్నార్థకంగా పోలీసు ఆఫీసరు కళ్ళల్లోకి చూశాడు డాక్టర్ అన్వేష్.

టోపీ తీసి తల ఒకసారి గోక్కుని "ఒక ఆడది వాంతులు - విరోచనాలతో చనిపోయిందట" అన్నాడా పోలీసు ఆఫీసరు.

"అయితే"

"ట్రబుల్ అంతా ఇక్కడే వచ్చింది. ఆ అమ్మాయి తల్లి దండ్రులు కూడా వచ్చారు అత్తమామలు, తల్లి తండ్రుల సమక్షంలోనే ఆమె దహనం జరిగిపోయింది" అని ఒక్క క్షణం ఆగాడా పోలీసు ఆఫీసరు.

విషయం అంతటితో అవలేదని డాక్టర్ అన్వేష్‌కి తెలుసు. "ఆ తరువాత" అన్నాడు ఇంకా ఏం జరిగిందో చెప్పమని.

శవదహనం జరుగుతూ వుండగా ఆ అమ్మాయి మేన మామ పోలీసు స్టేషన్‌కు పరుగెట్టుకొని వచ్చి "ఆ అమ్మాయి రోగం వల్ల చావలేదు, మందు పెట్టి చంపారని నా అను మానం. వెంటనే వచ్చి కాలగా మిగిలిన శవాన్ని అయినా పరీక్ష చేసి మరణ రహస్యాన్ని బయట పెట్టాలి" అని ఎంతో

ఆదుర్దాగా అడిగాడు. నేను వెంటనే ఇద్దరు కానిస్టేబుల్స్‌ని తీసుకొని అతనితో పాటు స్మశానానికి వెళ్ళాము. కాని ఏం లాభం! ఈ లోపలే ఆమె పూర్తిగా బూడిదైపోయింది. ఇక ఏం చేయాలో తోచక నాతో వచ్చిన ఇద్దరు కానిస్టేబుల్స్‌ని అక్కడ కాపలా వుంచి మీ దగ్గరికి వచ్చాను. ఈ ఫిర్యాదు విషయంలో మీ సహకారం కావాలి" అని మౌనంగా నిల బడిపోయాడు

అక్కడ వున్నది శవం కాదు, భూడిద! మరణ రహస్యం ఎంత వరకు తెలుస్తుందో! కాని మెడికల్ ప్రొఫె సర్‌గా ఇలాంటి సంఘటన విషయంలో కూడా తన అభి ప్రాయం చెప్పవలసిన బాధ్యత డాక్టర్ అన్వేష్‌కి వుంది.

వెంటనే లేచి పోలీసు ఆఫీసరుని అనుసరించాడు. కొద్దిసేపట్లో స్మశానానికి చేరుకున్నాడు. ఆమె చావుకు సాక్ష్యంగా బూడిద గుట్ట కనబడింది.

పోస్టుమార్టం అంటే కేవలం శవాన్ని కోసి పరీక్షిం చడమే కాదు, చావుకి సంబంధించిన పరిసరాలని, పరిస్థితులని కూడా పరీక్షించడం పోస్టు మార్టం చేసే డాక్టరు విధి.

అయితే ఎందరు అలా తమ విధి నిర్వర్తిస్తారోగాని డాక్టర్ అన్వేష్ మాత్రం చావుకు కారణం తేలే వరకు శవాన్ని గాని, శవం తాలూకు బూడిదగాని వదిలిపెట్టడు.

అందుకనే ఆ చితాభస్మం మొత్తాన్ని జాగ్రత్తగా బుట్టల్లోకి ఎత్తమని ఆర్డరు వేసి చనిపోయిన వ్యక్తి పరిస రాలని, పరిస్థితులని పరిశీలించసాగాడు.

"కోడలుకి ఏమైంది" అని ఆమె అత్త మామలని అడిగాడు డాక్టర్ అన్వేష్

"ఏముంది కలరా వచ్చినట్లు వాంతులు, నీళ్ళ విరోచనాలు అయిపోయాయి" అన్నారు అత్త మామలు.

ఇంతకు మించి డాక్టర్ అన్వేష్ వాళ్ళ నుంచి ఏమీ తెలుసుకోలేక పోయాడు. కాని మరణ రహస్యం తెలుసుకోవాలి. బూడిదంతా గాలించాడు. అందులో కాలగా మిగిలిన చిన్న చిన్న బొమికె ముక్కలు తప్ప మరేమీ కనిపించలేదు.

గుట్టడు బూడిదగా మారిన ఆమె,"నేనెలా మరణించానో నిజం తేల్చి అందరికీ చెప్పు" అని డాక్టర్ అన్వేష్‌ని అభ్యర్థిస్తోంది.

శవం కోసి ఎవరైనా చెబుతారు. కాలి బూడిదై పోయిన శరీరం నుంచి మరణరహస్యం చెప్పడంలోనే వుంది గొప్పదనం. అందుకే డాక్టర్ అన్వేష్ దృఢసంకల్పంతో గుట్ట నుంచి గుప్పెడు బూడిద తీసుకున్నాడు. సరాసరి కెమికల్ ఎనాలిసిస్ లాబొరేటరీలోకి వెళ్ళాడు.

కొంత సమయం గడిచాక...

అలసిపోయిన కళ్ళతో డాక్టర్ అన్వేష్ ఫోరెన్సిక్ మెడిసిన్‌కి సంబంధించిన కెమికల్ ఎనాలిసిస్ లేబొరేటరీలో నుంచి బయటకు వచ్చాడు.

ఏం తేల్చాడో, ఏం చెబుతాడో అన్న ఆసక్తితో లేబొరేటరీ బయట కొందరు వైద్య విద్యార్థులు, ఇతరులు

వేచి వున్నారు. విషయం తెలుసుకోవాలనే తహతహ వారిలో వుంది.

"ఆమె రోగంతో మరణించలేదు, విషం ఇచ్చి చంపారు" తాను కనుగొన్న రహస్యాన్ని డాక్టర్ అన్వేష్ ఒక్క ముక్కలో డిక్లేర్ చేశాడు.

"ఇది హత్యా!" విన్నవారంతా స్టన్ అయ్యారు.

ముఖ్యంగా జూనియర్ వైద్య విద్యార్థులు తమ ప్రొఫెసరుగారి మాటకి అవాక్కు అయిపోయారు. అందులో ఒకడు "మరణానికి కారణం ఎటువంటి విషం అయివుంటుంది" అని ఎంతో కుతూహలంతో అడిగాడు.

"మరణానికి కారణం- ఆర్సెనిక్ విషం" టక్కున జవాబిచ్చాడు డాక్టర్ అన్వేష్.

"ఎలా నిర్ధారించారు? కలరా వల్ల పోయిందని అత్తమామలు అంటున్నారుగా" అన్నాడు మరొకడు అనుమానం తీరక.

"మైడియర్ బాయ్స్! ఆర్సెనిక్ విషం దుష్ఫలితాలు కూడా కలరా లాగానే కనబడతాయి. దీనిలో కూడా వాంతులు, విరోచనాలు విపరీతంగా అయిపోతాయి. కలరా అనుకొని దీనికి వైద్యం చేస్తే చివరికి ప్రాణం పోతుంది. ఆర్సెనిక్ విషం పంచదారలాగ కనబడుతుంది. దీనికి రుచి, వాసన, రంగు వుండవు. మరిగే నీళ్ళల్లో, పాలల్లో, అన్నంలో దేనిలో వేసినా తేడా తెలియకుండా కలిసి పోతుంది. ప్రాణం తీయడానికి ఒక చెంచాడు ఆర్సెనిక్ పౌడరు చాలు.

ఆర్సెనిక్ విషం వల్ల ప్రాణం పోయిందని ఇతరులు తెలుసుకోలేకపోవచ్చు. కానీ పోస్టుమార్టంచేసిన డాక్టర్ మాత్రం తెలుసుకోగలడు. శవం బూడిదైపోయినా ఆ బూడిదలో ఈ విష పదార్థం ఆర్సెనిక్ ఆక్సైడ్ రూపంలో వుంటుంది. మామూలుగా మనిషి శరీరంలో ఆర్సెనిక్ పదార్థం వుండదు. అందుకని ఒకవేళ శవం కాలిపోయినా బూడిదలో ఎక్కువ మోతాదులో ఈ విషంకనబడితే మరణం దానివల్లనే సంభవించినట్లే కదా" అన్నాడు డాక్టరు అన్వేష్.

అప్రసన్నట్టు వాళ్ళు తలలు ఊపారు.

కాని డాక్టర్ అన్వేష్ ఈ కేసులో ఆర్సెనిక్ విషాన్ని ఎలా కనుగొన్నాడో తెలుసుకోవాలనే కుతూహలం వాళ్ళ ముఖాల్లో వ్యక్తమైంది.

అది గమనించిన డాక్టర్ అన్వేష్ "నేను ఈ కేసులో ఆర్సెనిక్ విషాన్ని ఎలా కనిపెట్టాననేకదా మీ అనుమానం. నేను త్రీ స్టెప్స్‌గా శవం తాలూకు బూడిదని ఎనాలిసిస్ చేశాను.

ఒకటి- బూడిదని పాయిజన్ కోసం కెమికల్ ఎనాలిసిస్ చేయడం. అలా బూడిదని రసాయనిక పరీక్ష చేసుకుంటూ పోతూవుంటే ఆర్సెనిక్ విషం అందులో వున్నట్టు తేలింది.

ఇక రెండవ స్టెప్ - స్పెక్ట్రోస్కోపిక్ ఎగ్జామినేషన్. ఈ పరీక్ష ద్వారా ఆర్సెనిక్, సీసం, పాదరసం, రాగి

మొదలైన లోహపదార్థాలు ఖచ్చితంగా కనిపెట్టవచ్చు. ఇవి ఏవైనా శరీరంలోకి ఎక్కువ శాతంలో చేరితే ప్రాణం పోతుంది. ఈ లోహ పదార్థాలు వేటితో కలిసిపోయినా స్పెక్ట్రో స్కోపిక్ ఎగ్జామినేషన్ ద్వారా దేనికి దానిని స్పష్టంగా గుర్తించవచ్చు. ఎందుకంటే ఈ లోహ పదార్థాలకి ప్రతీ ఒక్క దానికీ ప్రత్యేక వేవ్ లెంగ్త్ వుంటుంది. స్పెక్ట్రో స్కోప్‌తో పరీక్ష చేస్తే అవి తమ ప్రత్యేక కలర్ బ్యాండ్స్‌ని చూపిస్తాయి. ఇది నూటికి నూరుపాళ్ళు నిర్ధారణ అయ్యే పరీక్షని వేరే చెప్పనవసరం లేదు కదా. ఈ శవం తాలూకు బూడిదని పరీక్ష చేస్తే ఆర్సెనిక్ లోహానికి సంబంధించిన బ్యాండ్స్ స్పష్టంగా కనబడ్డాయి.

మూడవ స్టెప్ - "న్యూట్రాన్ యాక్టివేటింగ్ ఎనాలిసిస్" ఈ పరీక్ష ద్వారా శవం తాలూకు బూడిదలో ఎంత హెచ్చు మోతాదులో ఆర్సెనిక్ విషం వున్నదీ తేలింది.

"ఇదీ ప్రోసెస్" అన్నాడు డాక్టర్ అన్వేష్.

"పోస్టుమార్టం ఇంతటితో అయిపోయిందనుకున్నారా" అని డాక్టర్ అన్వేష్ అంటూ - "పోస్టుమార్టం అంటే కేవలం శవాన్ని కోసి చూడటం, బూడిదను పరీక్ష చేసి చూడడమే కాదు, మరణానికి సంబంధించిన పరిస్థితుల్ని, పరిసరాల్ని కూడా పరిశీలించాలి. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని మరణ కారణాన్ని నిర్ధారించాలి" అన్నాడు. లోపలికి వస్తూ యిది విన్న పోలీసు ఆఫీసర్ డాక్టర్ అన్వేష్‌తో కరచాలనం చేసి "ఆ అమ్మాయి వాళ్ళ అమ్మకి రాసిన

ఉత్తరం" అని ఓ కవరు అందించాడు.

అందులో ఇలా ఉంది - "అమ్మా ధన దాహంతో అత్తమామలు పెట్టే బాధలు భరించలేకుండా వున్నాను. త్వరగా వచ్చి నన్ను మీరు తీసుకుని వెళ్ళకపోతే ఈ రాక్షసులు నా ప్రాణం తీసినా ఆశ్చర్యపోనక్కరలేదు"

ఇది చూసిన వారెవరూ ఇంకేం మాట్లాడలేదు.

డాక్టర్ అన్వేష్ పోస్టుమార్టం రిపోర్టులో తన అభిప్రాయాన్ని రాసేందుకు పెన్ను తీశాడు. ❋

## 2. హత్యని ఆత్మహత్యగా చిత్రిస్తే నిజమవుతుందా?

ఎప్పటిలాగానే తెల్లవారింది.

కాని జ్యోతి బ్రతుకు ఎల్లప్పటికీ చీకటి అయింది.

ఉదయం లేచి చూసేసరికి జ్యోతి తన పడక గదిలో ఉరిపోసుకుని సీలింగ్ ఫ్యాన్‌కి వ్రేలాడుతూ కనబడింది.

అందరి గుండెలు అదిరిపోయాయి. ఎవరూ ఊహించని విషయమది. జ్యోతి గొప్పింటివారి బిడ్డ. అయినా ఏ బాధ వచ్చిందని ఉరిపోసుకుంది? ఎవరికీ అంతుబట్టని విషయమిది. జ్యోతి ఆత్మహత్య విషయం వాడవాడలా క్షణాలలో వ్యాపించింది.

అయినా వారికి ఏ ఆలోచనా తోచడంలేదు. జ్యోతి ఎందుకిలా చేసిందన్న ఆలోచన తప్ప మరొకటి లేదు వారికి.

ఉరిపోసుకుని ప్రత్యక్షంగా కనబడుతూ వుంటే మరో భావం ఎలా వస్తుంది?

అయిందేదో అయిపోయింది త్వరగా శ్మశానానికి తీసుకుపోవడం మంచిదనిపించింది. అందుకు బంధువులు ఏర్పాట్లు కూడా చేయనారంభించారు.

ఇంతలో పోలీసులు అక్కడికి చేరారు.

ఆత్మహత్యే అయినా పోస్టుమార్టం చేయడం మామూలు అన్నారు.

శ్మశానానికి తీసుకుని వెళ్ళాలనుకున్న జ్యోతి శవాన్ని పోస్టుమార్టం కొరకు మార్చురీకి తీసుకుని వెళ్లారు.

డాక్టర్ అన్వేష్ దగ్గరికి వచ్చింది కేసు.

అతను జ్యోతి మృత దేహాన్ని పరీక్షగా చూశాడు. మంచి శరీర ఛాయేమో నీలంగా మారిన పెదవులు, బుగ్గలు, గోళ్లు స్పష్టంగా కనబడుతున్నాయి. ఊపిరాడక ప్రాణం పోతే ఈ లక్షణాలు సహజమే కదా! జోతి ఒంటిమీద చీర లేదు. బహుశా ఆ చీరే ఆమె ఉరిపోసుకోడానికి ఉపయోగించినట్లుంది.

డాక్టర్ అన్వేష్ జ్యోతి శవాన్ని నిశితంగా పరిశీలిస్తున్నాడు. ఆమె తల యెలా వుంది, చేతులు ఏ పొజీషన్‌లో వున్నాయి, పొట్ట యెలా వుంది, ఒంటిపైని దుస్తులు ఎలా వున్నాయి, ఇలాగే ఇతరవన్నీ. ఎందుకంటే వీటి నుంచి కూడా పోస్టుమార్టం నిర్ణయం ఇవ్వడానికి కొన్ని క్లూలు దొరకుతాయి.

మెడకి ఉరి వేసుకున్న చీర ముడిని దీక్షగా పరిశీలించాడు.

ఉరి ముడి వెనుకకి వుంది.

ఆ ఉరి ముడిని మరొకసారి జాగ్రత్తగా పరిశీలించాడు. ఉరివేసుకున్న చీరని తీసి ప్రక్కన పెట్టి జాగ్రత్తగా మెడ వైపు చూశాడు.

ఉరి వేసుకుని ప్రాణం తీసుకున్నప్పుడు క్రింద దవడకి రెండువైపులా, కంఠం దగ్గరా ఉరి ఒరుసుకునిపోయి చర్మం కమిలిపోయినట్లు మచ్చలు కనబడాలి. అటువంటి వేమీ స్పష్టంగా కనబడటం లేదు. డాక్టర్ అన్వేష్ ఈ విషయాన్ని కూడా నోట్ చేశాడు.

మెడ దగ్గర పైకి కనబడేలా ఏమైనా గాయాలున్నాయేమో చూశాడు. అవేమీ కనబడటం లేదు. ఛాతీ ఎముకల్ని, కడుపులోని ఎత్తు పల్లాల్ని చూశాడు. అన్నీ మామూలుగానే వున్నాయి.

మర్మావయవాలని పరీక్ష చేశాడు. అక్కడేమయినా గాయాలు గానీ, వీర్యం చుక్కలు గానీ వున్నాయేమో చూశాడు. వయస్సులో వున్న స్త్రీ అనుమానాస్పదస్థితిలో మరణించినప్పుడు సెక్సు నేరం జరిగి వుండడం సహజం. అందుకని పోస్టుమార్టం చేసే డాక్టరు ఈ విషయంలో పరిశీలించకపోవడం వుండదు.

డాక్టర్ అన్వేష్‌కి పైకి ప్రత్యేకంగా క్లూలు ఏమీ లభ్యం కాలేదు.

కంఠం పై భాగం నుంచి పోస్టుమార్టం మొదలు పెట్టాడు.

నాలుక గొంతు వెనుకకి, గాలి గొట్టానికి అడ్డం పడి కనబడింది.

ఇంకా క్రిందకి కోసి చూశాడు. కంఠం లోపలి రక్త నాళాలు చిట్లి వున్నాయి. కండరాలు నలిగి వున్నాయి. హాయాడ్ బోన్ విరిగి కనబడింది.

మెడ దగ్గర ఇంకా క్రిందికి కోశాడు. దీక్షగా పరిశీలించాడు.

థైరాయిడ్ గ్లాండు గానీ, మరొకటి గానీ ఏమీ నలగలేదు.

తరువాత ఛాతీని కోసి చూశాడు.

విచిత్రం... పైకి కనిపించలేదు గాని ఛాతీకి రెండు ప్రక్కలా అయిదారు ప్రక్కటెముకలు విరిగి వున్నాయి. ఎవరో మీద కూర్చుంటే తప్ప ఇలా ఏలా జరుగుతుందనే అనుమానం కలిగింది.

కడుపులోపల లివర్, గాల్‌బ్లాడర్, స్ప్లీన్, మూత్ర పిండములు, జీర్ణాశయం, గర్భకోశం మామూలుగానే కనిపించాయి.

పోస్టుమార్టం పూర్తి అయింది.

డాక్టర్ అన్వేష్‌కి ఇది ఆత్మహత్యగా అనిపించడంలేదు.

ఇది హత్యే అని అభిప్రాయం కలిగిం దతనికి.

ఎందుకంటే...

1) ఉరి పోసుకున్నట్లయితే మెడ దగ్గర, క్రింద దవడ దగ్గర ఉరి పోసుకున్న తాడు గాని, గుడ్డ గాని నొక్కుకు పోయిన మచ్చలు కనబడతాయి. ఆ అచ్చుకి ఒక ప్రత్యేకత వుంది. ఉరి పోసుకున్నట్లయితే మెడ ముందు భాగాన ఉరితాడు అచ్చు కనబడుతుంది చనిపోయిన తరువాత చాలసేపటికి ఉరికి వ్రేలాడేస్తే అలా అచ్చు ఏర్పడదు. అంతేకాకుండా యెవరైనా ఉరి పోసుకుని ఆత్మహత్య చేసుకున్నప్పుడు ఉరితాడు ముడి సాధారణంగా మెడకి కుడి ప్రక్కకి వుంటుంది. చంపేసి ఉరితాడు బిగించి వ్రేలాడేస్తే ఆ ముడి సాధారణంగా మెడ వెనుకకి వుంటుంది.

2) ఉరితాడు బిగుసుకున్నపుడు క్రింది భాగంలో టిస్యూ తెల్లగా కనబడుతుంది.

3) ఉరి పోసుకున్నపుడు సాధారణంగా మెడ దగ్గర వుండే రక్తనాళాలు, కండరాలు నలగడం వుంటుంది.

4) నోటి అంచుల నుంచి చొంగ చారలు కట్టి కనబడుతుంది.

5) సాధారణంగా ముఖం పాలిపోయి ఉబ్బి కనబడుతుంది.

6) హయాడ్ బోన్ విరగడం అరుదు.

7) ఛాతీ ఎముకలు విరగడం కాని, కడుపులోని భాగాలు దెబ్బతినడం గాని ఉండవు.

పోస్టుమార్టం పరీక్షలో తద్భిన్నంగా కనడినందుకు డాక్టర్ అన్వేష్‌కి ఆశ్చర్యం కలిగించింది.

అందరూ ఆత్మహత్య అనుకున్నది— హత్యగా తోస్తోంది. ఎవరో ముందు ఆమెను గొంతు నులిమి చంపేసి, తరువాత ఉరివేసి ఆత్మహత్యగా చిత్రీకరించారనే అనుమానం కలిగింది.

కానీ, అంత తేలికగా యెలా చేయగలిగారా అని డాక్టర్ అన్వేష్‌కి ఆశ్చర్యం కలిగింది.

పూర్తి స్పృహలో ఉన్నప్పుడు గొంతు నులిమి చంపడం అంత తేలిక కాదే! ఒకవేళ అలా చంపగలిగినా ఆ దుర్మార్గుడితో ప్రాణరక్షణ కోసం పోరాడిన గాయాలు ఒంటి మీద కనబడాలి గదా!

ఏమో— ముందుగా మత్తు ఇంజక్షను ఇచ్చేసో, మత్తు బిళ్ళలు వేసో చాలవరకు శక్తిహీనంగా చేయవచ్చు కదా.

ఆ ఆలోచన రాగానే డాక్టర్ అన్వేషు జ్యోతి శవం నుంచి రక్తం కెమికల్ ఎనాలిసిస్ నిమిత్తం తీసుకున్నాడు. వెంటనే కెమికల్ ఎనాలిసిస్ చేశాడు.

అనుమానించినట్లే అందులో ఎక్కువ మోతాదులో మత్తు మందు కనబడింది.

అయితే, అంతటితో సరిపోలేదే!

గొంతు నులిమి చంపినట్లు ఆధారం ఏది?

పైకి ఫింగర్ ప్రింట్స్ ఏమీ లేవుగా!

ఫింగర్ ప్రింట్లు లేనప్పుడు జ్యోతే మత్తు మందు బిళ్ళలు మింగి ఆత్మహత్య చేసుకుందని అంటే ఇంతటి

హత్య ఆత్మహత్యగానే మిగిలిపోదా?

ఫైనల్ టెస్టుగా మోడదగ్గర మోడర్న్ టెక్నాలజీ ఉపయోగించి మైక్రో ఫోటోగ్రఫీ తీశాడు.

ఫెంటాస్టిక్ !!

చేతి వ్రేళ్ళ గుర్తులు అందులో ఎంతో స్పష్టంగా కన బడ్డాయి.

అంతే! పోస్టు మార్టం చేయడంలో జ్యోతి ఆత్మ హత్య కథ విచిత్రమైన మలుపు తిరిగింది.

పోలీసు జాగిలాలు వెంటనే రంగంలోకి దిగాయి.



## 3. శవం ప్రసవిస్తుందా ?

నిండు చూలాలైన జానకి ఆకస్మికంగా మరణించింది.

జానకికి అంతకు ముందు ఏ జబ్బు లేదు. ఆకస్మికంగా ఆమె మరణించడం అనుమానానికి దారి తీసింది.

తన కూతురు పచ్చగా వుండటం చూసి ఓర్వలేని వాళ్ళెవరో చేతబడి చేసి వుంటారని జానకి తల్లి నెత్తి నోరు బాదుకుంటూ ఏడవ నారంభించింది.

"అవును, చేతబడే అయి ఉంటుంది. లేకపోతే వున్న ట్టుండి ఎలా చనిపోతుంది" అన్నాడు తండ్రి.

ఇంతలో భూతవైద్యుడు రానే వచ్చాడు. జానకమ్మ

ముఖంలోకి తీక్షణంగా చూశాడు. "ఇది చేతబడి వల్లచావే. అనుమానం లేదు" అన్నాడు. పెద్దముగ్గు వేసి, పసుపు కుంకుమ చల్లి కళేబరాన్ని అందులో పడుకోబెట్టి మంత్రాలు వల్లించి, వెయ్యి రూపాయలు వసూలు చేసి, "విరుగుడు చేశాను. మీ అమ్మాయి బతుకుతుంది" అని చెప్పి వెళ్ళాడు.

కూతురు నిద్ర నుంచి లేచినట్లు కోలుకుంటుందన్న ఆశతో ఆమె వంకే చూస్తూ అమ్మా, నాన్న కూర్చున్నారు.

రెండు గంటలు గడిచాయి.

మరణించిన జానకమ్మ పొట్ట ఎత్తు తగ్గడం మొదలైంది.

ఏదో ఆశతో జానకమ్మ వైపు చూస్తున్నారు. అంతే జానకమ్మ గర్భంలో వున్న బిడ్డ భూమి మీదకి వచ్చిపడింది.

అంతే... "మా జానకి తల్లి ప్రసవించింది. అంటే చేతబడి విరుగుడైంది" సంతోషంతో గెంతేసింది తల్లి.

"శవం ప్రసవించడం నేనెక్కడా చూడలేదు, విన లేదు. అంచేత మా అమ్మడుకి చేతబడి విరుగుడు అయింది. ఇక కళ్ళు తెరుస్తుంది" అనేఆశతో వెంటనే అనేశాడు తండ్రి.

కాని, పుట్టిన బిడ్డకు ప్రాణం లేదు.

"బిడ్డకి ప్రాణంలేకపోతేపోనీ, జానకమ్మకితిరిగి ప్రాణం వస్తే అదే పదివేలు" అంది తల్లి జానకి పొట్ట నిమురుతూ.

రెండు రోజులు గడిచిపోయాయి. శవం కుళ్ళి కంపు కొట్టటం మొదలైంది. ఈలోపు చేతబడి ఎవరు చేసి వుంటారా అని ఆలోచించిన జానకి అమ్మా నాన్నకి ఎదురింటి వెంకమ్మ పేరు తోచింది. వెంకమ్మకు పిల్లలు లేరు.

'ఇంకేం! తనకి పిల్లల్లేరన్న కుళ్ళుతో నిండు గర్భిణి జానకికి వెంకమ్మ చేతబడి చేయించి వుంటుంది' అని అనుకున్నారు. వెంకమ్మ పళ్ళు రాలిపోయాయి దెబ్బలతో ఒళ్ళు హూనం అయిపోయింది.

అంతే, పోలీసులు రంగలోకి దిగారు. వాళ్ళిద్దరినీ కటకటాల వెనుకకి త్రోసి, దుర్గంధం విరజిమ్ముతున్న జానకి మృత దేహాన్ని పోస్ట్‌మార్టం కొరకు తీసుకుపోయారు.

జనంలో పెద్ద సంచలనం చెలరేగింది. ఇంత జరిగినా చిత్రంగా జానకమ్మ తల్లి దండ్రుల మీాదనే మళ్ళీ సానుభూతి పెరిగింది. చేతబడి కాకపోతే శవం ప్రసవించడమేమిటని జనం ముక్కు మీాద వ్రేలు వేసుకున్నారు. కొందరు చేతబడి కాదు, 'మరేదో' పిండి వుంటుందని అన్నారు.

ఆ 'మరేదో' తేల్చవలసిన పని డాక్టర్ అన్వేషిది అయింది. నిజానికి జానకిది ప్రమాదవశాత్తు సంభవించిన మరణమో, మరేదైనా కనిపించని వ్యాధి వల్ల సంభవించిన మృత్యువో, అదీ కాకుంటే హత్యే అయి వుండాలి.

ఎందుకంటే శవానికి కాన్పు అయితే ప్రాణం వున్నట్లు కాదు. గర్భిణీ స్త్రీ మరణిస్తే అరగంట నుంచి అరవై గంటలలోగా గర్భం నుంచి బిడ్డ బయటపడటం సహజం.

సాధారణంగా మరణించిన రెండు మూడు గంటలకి శరీరంలోని కండరాలు గట్టిగా బిగదీసుకుపోతాయి. ఈ రకంగా శవంలోని కండరాలు బిగదీసుకుని పోవడాన్ని "రైగర్ మోర్టిస్" అంటారు. ఈ రైగర్ మోర్టిస్ అరు

దుగా కొందరిలో మరణించిన కొద్ది నిమిషాల్లోనే ఏర్పడ వచ్చు. గర్భకోశం కూడా కండరాలతోనే నిర్మితమై వుంటుంది కనుక తక్కిన కండరాలు లాగానే ఇది కూడా మరణం సంభవించిన కొంత సమయానికి బిగదీసుకుంటుంది. ఇలా గర్భకోశం కండరాలు బిగదీసుకుని పోవడంతో గర్భంలో బిడ్డ వున్నట్టయితే ప్రసవ మార్గం నుండి బయటకు త్రోసి వేయబడుతుంది. కాని అప్పటికే గర్భంలో శిశువుకి ప్రాణం పోయి వుంటుంది.

ఒక వేళ రైగర్ మోర్టిస్ తగినంత కలగక, కండ రాలు తగినంత బిగదీసుకుని పోవడం జరగక గర్భస్థ శిశువు శవంనుంచి బయటకి వెంటనే రాకపోయినా తరువాత అయినా వచ్చి తీరుతుంది. ఎలాగంటే శవాన్ని అలాగే వుంచేసినట్ల యితే ఇరవైనాలుగు గంటలకి శవం కుళ్ళడం మొదలవుతుంది. శవం కుళ్ళడం మొదలవడంతో కండరాల బిగుతు సడలిపో తుంది. దీనికి తోడు కడుపులోను, శరీరంలోను ఇతర భాగాల్లో బాక్టీరియా చేరి గ్యాస్ తయారయ్యేటట్టు చేస్తాయి. అదే గర్భిణీ అయ్యేటట్టయితే కడుపులోనే గ్యాస్ చేరడం కాక, గర్భకోశంలో కూడా గ్యాస్ అమితంగా చేరిపోతుంది. వీటి రెండిటి వత్తిడితో గర్భస్థ శిశువు బయటకు నెట్టి వేయబడుతుంది.

ఇదండి, ...... శవం ప్రసవించడంలోని మర్మం.

కాని,జానకమ్మ తల్లిదండ్రులకి ఆమె ఆకస్మికమరణమే ఒక పెద్ద మిస్టరీ.

పోస్టుమార్టం చేస్తున్న డాక్టర్ అన్వేష్ కత్తి ఒక భాగం నుంచి మరొక భాగానికి కదులుతూ మరణ రహస్యాన్ని తెలుసుకోడానికి అన్వేషణ సాగిస్తోంది. అలా ముందుకు సాగిన కత్తి జానకమ్మ గుండె దగ్గర ఆగింది.

అంతే మిస్టరీగా వున్న జానకమ్మ మృతికి కారణం బయటపడిపోయింది.

జానకమ్మ మరణానికి కారణం సడన్‌గా హార్ట్ ఎటాక్ రావడం.

మూడు రోజుల క్రిందట మరణించిన జానకి, కుళ్ళి కంపు కొడుతున్న శవమై మూర్ఖనమ్మకానికి చిహ్నంగా తునాముకలై నేల మీద పడివుంది - నిస్సహాయంగా.



## 4. మరణించింది ఎప్పుడో శవం చెబుతుందా ?

ఒకటి కాదు, రెండు కాదు, ఒకే రాత్రి ఆరు హత్యలు. అందులోనూ అందరూ ఒంటరిగా వున్నవాళ్లే.

ఈ వింత హత్యల వార్త దావానలంలా పట్టణమంతా క్షణాలలో వ్యాపించింది.

అందులోనూ ఒకరు ఏ.సి. రూంలో మరణించి కన బడితే, మరొకరు ఫుట్‌పాత్ మీద. అలాగే ఒకరు పడక గదిలో పడివుంటే, ఇంకొకరు వంటగదిలో. ఇలా ఒక్కొక్కరు

ఒక్కొక్క చోట. అయినా అందరూ ఒంటరిగా వుంటున్న వాళ్ళే.

ఈ వింత మరణాలతో పట్టణమంతా అట్టుడికి పోయినట్లు వుంది.

ఒక ప్రక్క పోలీసు కుక్కలు హంతకులు ఆచూకీ కనుగొనడానికి ప్రయత్నిస్తూవుంటే మరొక ప్రక్క డాక్టర్ అన్వేష్ పోస్టుమార్టం చేస్తూ వుంటే ఒక్కొక్క చాపు నుంచి వెనుక వున్న మిస్టరీ బయటపడుతూంది.

ఎందుకంటే...

జనం అనుకుంటున్నట్టు అవన్నీ హత్యలు కాదు. వారిలో కొందరు పొటాషియం సైనైడ్ వంటి విషం తీసుకుని ఆత్మహత్య చేసుకున్నవారూ వున్నారు.

అంతేకాదు, పోలీసులు చెబుతున్నట్టుగా అవన్నీ రాత్రికి రాత్రి జరిగిన మరణాలు కావు. కొందరు మరణించి రెండు రోజులు కూడా అయింది.

డాక్టర్ అన్వేష్‌కి ఇది చెప్పడం ఎలా సాధ్యమైందో!

ఏముంది, శవం స్థితిని బట్టి మరణించి ఎన్ని గంటలయినదీ చెప్పొచ్చు.

ఏ వ్యక్తయినా మరణించిన తరువాత అతని శరీరంలో రకరకాల మార్పులు కలుగుతాయి. పైగా ఆ మార్పులు క్రమ పద్ధతిలో కలుగుతాయి అలా క్రమ పద్ధతిలో కలిగే మార్పుల బట్టి చనిపోయి ఎన్ని గంటలయినదీ చెప్పవచ్చు. అయితే చనిపోయిన వ్యక్తి వయస్సు బట్టి, అతను ఉండే

ప్రదేశపు శీతోష్ణస్థితిని బట్టి, శవం నీళ్ళల్లో మునిగి ఉందా, బయట ఉందా అనేదానిబట్టి శవంలో ఆయా మార్పులు ఆలశ్యంగానూ, త్వరగానూ కలుగుతూ ఉంటాయి. అందు కని చనిపోయి ఎన్ని గంటలయినదీ చెప్పేటప్పుడు ఈ పరి స్థితులని కూడా దృష్టిలో ఉంచుకోవడ మవుతుంది.

1] తగ్గుతున్న శరీరం వేడి :- సాధారణంగా మనిషి చనిపోయిన తరువాత ఒళ్ళు చల్లబడటం మొదలవుతుంది. ఒక్క యెండాకాలంలో తప్ప తక్కిన రోజుల్లో మన శరీ రంలో ఉండే వేడికంటె బయట వేడి తక్కువగా ఉంటుంది. మనిషి మరణించిన తరువాత మెదడులో ఉండే హీట్ రెగ్యు లేషన్ సెంటర్ పని చేయదు కనుక బయట ఉండే టెంప రేచర్ లెవెల్‌కి శరీరం వేడి తగ్గిపోతుంది. ప్రతి గంటకి రెండున్నర డిగ్రీల ఫారన్‌హీట్ చొప్పున శరీరం వేడి తగ్గు తుంది. ఈ రకంగా బయట ఉన్న వేడికి సమానంగా శరీ రం చల్లబడటానికి 6 నుంచి 12 గంటలు పడుతుంది. మల ద్వారం ద్వారా ఒక ప్రత్యేక థర్మామీటరు లోపలికిపెట్టి శరీరం వేడి యెంత ఉన్నదీ తెలుసుకోవచ్చు. బ్రతికి ఉం డగా శరీరం వేడి 98.4 డిగ్రీలు ఉంటుంది. కనుక తగ్గిన శరీ రం వేడి బట్టి లెక్కకట్టి చనిపోయి యెన్ని గంటలయినదీ ఉజ్జాయింపుగా చెప్పవచ్చు. చనిపోయిన సమయంలో జ్వర తీవ్రతతో బాధపడిన వారిలోనూ, గాలి ఆడని గదులలో శవం ఉండిపోయినప్పుడూ ఒళ్ళు చల్లబడటం ఆలశ్యం అవు తుంది. ఇందుకు విరుద్ధంగా పసిపిల్లలు, వృద్ధులు, రోగులు

శరీరంలోని వేడి తక్కిన వారిలో కంటే త్వరగా తగ్గుతుంది.

2] పోస్టుమార్టమ్ స్టెయిన్స్ :- మనిషి చనిపోయిన తరువాత అయిదారు గంటల వరకు రక్తం గడ్డ కట్టదు. అందుకని శవాన్ని ఏ పొజిషన్‌లో ఉంచితే ఆ పొజిషన్‌లో క్రింది భాగంలోకి రక్తం వచ్చి చిన్న చిన్న రక్తనాళాల్లో నిండిపోతుంది. అలా రక్తం చేరిన ఆయా స్థలాల్లో చర్మం ఎర్ర ఎర్రగా మచ్చలుగా కనబడుతుంది. మనిషి చనిపోయిన 2-3 గంటలు తరువాతే ఈ మచ్చలు కనబడతాయి. అంతే కాకుండా ఈ మచ్చలు మరణించిన 5-6 గంటల్లోపు శవం పొజిషన్ మార్చినట్టయితే అంతకు ముందు కనబడినచోట మాయమై క్రింది భాగంలో కనబడతాయి. దానికి కారణం రక్తనాళాల్లోని రక్తం శవం పొజిషన్ మార్చగానే క్రింది భాగంలోకి చేరడమే.

అయితే, చనిపోయి అయిదారు గంటలు గడిస్తే రక్తం గడ్డ కట్టేసి మచ్చలు (పోస్టుమార్టమ్ స్టెయిన్స్) స్థానంమారడం జరగదు. ఈ రకంగా శవం పొజిషను మార్చడం ద్వారా మచ్చలు (స్టెయిన్స్) కూడా మారడం, మారక పోవడం బట్టి చనిపోయి 5-6 గంటల్లోపు అయిందా, ఎక్కువైందా చెప్పవచ్చు. ఈ పోస్టుమార్టమ్ మచ్చలు రంగుల బట్టి కూడా కొన్ని విషయాలు చెప్పవచ్చు. మచ్చలు నీలం, ఊదా కలగలిపిన రంగులో కనబడితే గాలి ఆడక మరణం సంభవించిందనీ, పింక్ కలర్‌లో కనబడితే కార్బన్‌మోనాక్సైడు, పొటాషియం సైనైడ్, పాము విషం వల్ల మరణం

కలిగిందనీ చెప్పవచ్చు.

3] ప్రైమరీ రిలాక్సేషన్ :- మనిషి మరణించగానే శరీరంలోని కండరాలన్నీ పట్టు సడలిపోతాయి. ఉదాహరణకి క్రింది దవడ యెముక పట్టు సడలి నోరు తెరుచుకున్నట్టు అవుతుంది ఈ రకంగా చనిపోగానే శరీరంలోని కండరాలు, కీళ్ళు అన్నీ పట్టు సడలి వదులు అయిపోవటాన్ని ప్రైమరీ రిలాక్సేషన్ అంటారు. ఈ ప్రైమరీ రిలాక్సేషన్ స్థితి చనిపోయిన 3 నుంచి 6 గంటలు వుంటుంది. తరువాతకండరాలు, కీళ్ళు బిగదీసుకుని పోతాయి. పోస్టుమార్టం స్టెయిన్స్ ఇంకా కనబడకుండా, కండరాలు అన్నీ వదులుగా వుంటే మరణించి రెండు-మూడు గంటలలోపు అయి వుంటుందని చెప్పవచ్చు. చనిపోయిన మూడు గంటలకే కండరాలు బిగదీసుకునిపోయి శవం కట్టెలాగా తయారైనా పోస్టుమార్టం స్టెయిన్స్ శవం పొజిషన్ మార్చడంతో అవి కూడా పొజిషన్ మారుతూ వుంటే మరణించి అయిదారు గంటలలోపే అయి వుంటుందని చెప్పవచ్చు.

4] రిగర్ మార్టిస్:- చనిపోయిన తరువాత శరీరంలోని కండరాలు, కీళ్ళు గట్టిగా బిగదీసుకునిపోయి కట్టెలాగా తయారవడాన్ని రిగర్ మార్టిస్ అంటారు. సాధారణంగా ఇలా కండరాలు బిగదీసుకుపోవడం చనిపోయిన 2-3 గంటలలో మొదలై నిదానంగా రెండు గంటల్లో పూర్తవుతుంది. మొదట ముఖంలోని కండరాలు బిగదీసుకుంటాయి. దానితో క్రింది దవడ గట్టి పడిపోతుంది. నోరు తెరవాలన్నా రాదు. అటుపిమ్మట మెడ కండరాలు, వెన్నెముక కండరాలు బిగ

దీసుకునిపోతాయి. ఈ రకంగా రెండు గంటలలో అన్నీ గట్టి పడిపోతాయి. శరీరమంతా కట్టెగా మారిపోతే చనిపోయి ఆరు నుంచి ఎనిమిది గంటలు అయిపోయిందని చెప్పవచ్చు. ఇలా బిగదీసుకుని పోయిన కండరాలు ఇరవై, ఇరవైనాలుగు గంటలుగడిచేసరికి తిరిగి పట్టు సడలిపోతాయి. మళ్ళీ ఏ కండరానికి ఆ కండరం, ఏ కీలుకాకీలు వదులుఅయిపోతాయి. అంతేకాకుండా కండరాలు మెత్తబడిపోతాయి. అయితే శవం ఎ.సి. రూంలోవున్నప్పుడు, చల్లని ప్రదేశంలో వున్న ప్పుడు కండరాలు అన్నీ వదులు అవడానికి నలభై ఎనిమిది గంటలు పట్టవచ్చు. రిగర్ మార్టిస్ మొదట కనబడిన భాగా లలో ముందు బిగుతు సడలిపోతే, ఆలస్యంగా బిగుసుకున్నవి ఆలశ్యంగానే బిగుతు సడలుతాయి. శరీరం క్రింది భాగాలలో ఇంకా కండరాలు, కీళ్ళు బిగదీసుకుని వుండి ముఖంలోనూ, మెడ దగ్గర కండరాలు మెత్తబడిపోయిన దానిబట్టికూడా చనిపోయి అప్పటికి ఎన్ని గంటలైనదీ ఉజ్జాయింపుగా చెప్ప వచ్చు.

5] ప్యూట్రిఫాక్షన్:— మనిషి చనిపోయిన తరువాత బాక్టీరియా క్రిములు చేరిపోయి శరీరం కుళ్ళిపోయేటట్లు చేస్తాయి. ఇలా కుళ్ళిపోయే పరిస్థితినే ప్యూట్రిఫాక్షన్ అంటారు. రిగర్ మార్టిస్ పూర్తిగా తొలగకుండానే శరీర భాగాలలో ప్యూట్రిఫాక్షన్ మొదలవుతుంది. దీన్నిబట్టి కూడా మరణించి ఎన్ని గంటలలైనదీ చెప్పవచ్చు. మరణిం చిన ఆరునుంచి పన్నెండుగంటలలో పొట్టమీద కుడివైపున

చర్మంలో పచ్చగా రంగుమారి కనబడుతుంది. ఈ రకంరంగు మార్పు ప్యూట్రిఫాక్షన్ ఫలితమే అయినా మరణ కాలం కనుక్కోడానికి తోడ్పడుతుంది. అలాగే చనిపోయిన ఆరు నుంచి పన్నెండు గంటల తరువాత కంటిగుడ్లు వ్రేలు పెట్టి నొక్కితే మెత్తగా కనిపిస్తాయి. అంతకు ముందు అవి గట్టిగా వుంటాయి. ఇరవై నాలుగు-నలభై గంటలలో శవం కుళ్ళి వాసనకొట్టడం మొదలవుతుంది. అలాగే మరణించి 36-48 గంటలకి ఒంటిమీద కాలిన బొబ్బలు లాగా తేలుతాయి. శవం నుంచి 4నుంచి 5రోజులకు పురుగులు బయటకి వస్తాయి. చనిపోయిన 5 నుంచి 10 రోజులలో శరీర భాగాలు దేనికవి ఊడిపోతాయి.

పోస్టుమార్టం రూంలో డాక్టర్ అన్వేష్ చేతిలో కత్తి పరపర కోసుకుంటూ పోతూంది. దానితో పాటు అతని కళ్ళు కూడా ప్రతీ శవాన్ని పైనుంచి క్రిందిదాకా నిశితంగా పరిశీలిస్తున్నాయి. ప్రక్కనే వున్న అసిస్టెంట్ ఏ శవం ఎక్కడ నుంచి వచ్చింది, ఎటువంటి పరిస్థితులలో మరణం సంభవించింది పోలీసు రికార్డు చూస్తూ వివరిస్తున్నాడు.

డాక్టర్ అన్వేష్ అన్వేషణతో మిస్టరీ మరణాలలోని చిక్కుముడి ఒక్కొక్కటి విచ్చుకుంటూ పోతూంది.

ఒకే రోజులో ఆరు మిస్టరీ మరణాలు అనుకున్నవి పైమరీ రిలాక్సేషన్, పోస్టుమార్టం స్టెయిన్స్, రిగర్ మార్టిస్, ప్యూట్రిఫాక్షన్ ఫైండింగ్స్‌తో ఒక్కొక్కటి ఒక్కొక్క రోజువని తేలిపోయింది.



## 5. శవం బుగ్గ మీద లిప్‌స్టిక్ క్లూ ఇచ్చిందా?

బదరీనాథ్ పెద్ద బిజినెస్ మాగ్నెట్.

అతను తలచుకుంటే ఎవరినైనా కొనేయగలడు, ఎవరినైనా పైకి పంపేయగలడు.

అటువంటి బదరీనాథ్ గెస్ట్‌హౌస్‌లో మరణించి నేల మీద పడి వున్నాడు.

ఒంటిమీద సరిగా బట్టలు కూడా లేవు. ప్రక్కనే ఫారెన్ విస్కీ బాటిల్స్, బ్రాందీ బాటిల్స్ పడి వున్నాయి.

ఎవరైనా విరోధులు అతన్ని చంపారా అని అనుమానించడానికి ఒంటిమీద గాయాలేమీ లేవు.

బాగా తాగాడేమో ముఖం ఉబ్బి వుంది.

ఫుల్‌గా తాగేయబట్టే ప్రాణం పోయి వుంటుందని అందరూ అనుకున్నారు. అందులోనూ అతని అలవాటు అందరికీ తెలిసినదే.

బిజినెస్ మాగ్నెట్ బదరీనాథ్ మరణం నగరంలో ఎంతో సంచలనం కలిగించింది.

చివరికి శవాన్ని పోస్టుమార్టం కొరకు తరలించారు.

సంచలన మరణాలకు గురైన మృతదేహాలన్నీ డాక్టర్ అన్వేష్ దగ్గరికే చేరుతాయి.

డాక్టర్ అన్వేష్ శవాన్ని పై నుంచి క్రింది దాకా పరీక్షగా చూశాడు.

ప్రత్యేకంగా క్లూ ఏమీ దొరకలేదు.

అతిగా తాగడం వల్ల మరణించాడేమోనని శవం నుంచి పరీక్ష నిమిత్తం రక్తం తీసుకున్నాడు. రక్తంలో ఆల్కహాలు శాతం ఎంత వున్నదీ లెక్క కట్టాడు.

రక్తంలో ఆల్కహాలు వుంది గాని, ప్రాణం తీసేటంత మోతాదులో మాత్రం లేదు.

మరి చావుకి కారణం ఏమై వుంటుంది?

పుర్రె కోసి చూశాడు... మెదడులో రక్తనాళాలు చిట్లాయేమోనని. మెదడులో ఏమీ తేడా కనబడలేదు.

గొంతు దగ్గర చూశాడు. అక్కడంతా నార్మల్. ఛాతీ కోసి చూశాడు. శ్వాస కోశాలు మామూలుగా వున్నాయి. గుండె కూడా మామూలుగానే వుంది. గుండె పోటు లక్షణాలేమీ లేవు.

కడుపు కోసి చూశాడు. కడుపులో కూడా అంతా మామూలుగానే వుంది.

ముఖ్యమైనవన్నీ మామూలుగానే వున్నాయి. మరి మృత్యువు ఎలా సంభవించింది?

ఏబూ పాలుపోక వృషణాల వైపు దృష్టి మరల్చాడు. పైకి మామూలుగానే కనబడ్డాయి. అయినా బీజకోశం కోసి చూశాడు.

ఆశ్చర్యం!

రెండు వృషణాలూ నలిగి వున్నాయి. రక్తనాళాలు చిట్లి వున్నాయి.

డాక్టర్ అన్వేష్ ఒక వృషణాన్ని నిలువుగా కోసి చూశాడు. లోపల టిస్యూ అంతా నలిగిపోయి వుంది. డాక్టర్ అన్వేష్‌కి బదరీనాథ్ మరణ రహస్యం కొంత స్ఫురించింది.

ఇంకా వివరంగా తక్కిన భాగాలు పరీక్ష చేసి చూశాడు.

అంతకుమించి వేరే క్లూలు ఏమీ దొరకలేదు.

వృషణాల పరిస్థితి చూసిన తరువాత అది మామూలు మరణం కాదు, హత్య అనే నిర్ధారణకి వచ్చాడు. ఎవరో అతని వృషణాలను బలంగా నొక్కేసి వుంటారు. అంతే... ఆ నొప్పి భరించలేక షాక్ కలిగి ప్రాణం పోయివుంటుంది. అందులోనూ తాగి వున్నాడేమో హంతకునితో పెనుగులాడలేకపోయి వుంటాడు. దానితో హంతకునికి హత్య అతి తేలిక అయిపోయి వుంటుంది.

అయితే హత్య చేసింది ఆడా? మగా?

ఎవరికీ అంతుపట్టని విధంగా ఇంత నైపుణ్యంగా హత్య ఎవరు చేసి వుంటారా అనే ఆలోచన కలిగింది డాక్టర్ అన్వేష్‌కి. అందులోనూ అది హత్య అని నిర్ధారించాలంటే ఇంకా కొన్ని ఆధారాలు వుంటే మంచిది కదా!

హత్యకి సంబంధించిన ఆధారాల కోసం వేయి కళ్ళతో శవం శరీరం మీద వెతకనారంభించాడు.

అలా వెతుకుతూ వుండగా...

శవం బుగ్గమీద కనబడీ కనబడని లిప్‌స్టిక్ అచ్చు కనబడింది.

భూతద్దం తీసుకున్నాడు.

అతను అనుకొన్నట్లే అది ఒక లిప్‌స్టిక్ వేసుకున్న పెదవి ముద్ర!

ఇక అనుమానం లేదు... హత్యా సమయానికి ఆ గదిలో ఒక స్త్రీ అతనితో వుంది.

డాక్టర్ అన్వేష్ ఎడ్వాన్స్‌డ్ టెక్నాలజీని ఉపయోగించి బుగ్గమీద పడిన పెదవి ముద్రని ఫోటో తీసుకున్నాడు.

డాక్టర్ అన్వేష్ పోస్టుమార్టం రిపోర్టు ఇస్తూ అది హత్య అని ఎలా తేలిందో చెబుతూ, హత్య చేసింది ఒక స్త్రీ అని క్లూ ఇచ్చాడు. నేర పరిశోధనలో హత్య చేసిన వ్యక్తిని తేలికగా పట్టుకోవడానికి తాను తీసిన పెదవి ఇంప్రెషన్ ఫోటో అందజేశాడు.

హంతకురాలిని పట్టుకోవడానికి పోలీసులు వెంటనే రంగంలోకి దిగారు. బదరీనాథ్‌కి పరిచయం వున్న స్త్రీలని ఒక్కొక్కరినీ పరీక్ష చేస్తూ చివరికి అసలు హంతకురాలిని పట్టివేశారు.

ఇది ఎలా సాధ్యమైంది ?

వేలిముద్రలు ఒకరివి మరొకరితో ఎలా పోలివుండవో, అదే విధంగా పెదవికి సంబంధించిన రేఖలు కూడా.

వేలులో ఎలా గీతలు, గుంటలు వుంటాయో అదే విధంగా పెదవిలో కూడా వుంటాయి.

వేలి ముద్రలు ఒకరివి మరొకరితో పోలి వుండవనే విషయం తెలిసినదే. ఒక వేళ ఏ ఒక్క వ్యక్తిదైనా మరొక

వ్యక్తి వేలిముద్రతో పోలి వుండాలంటే ఇప్పుడున్న ప్రపంచ జనాభాకి ముప్పయి రెట్లు అధికంగా వుండాలి. అంత ఎక్కువమంది అయినప్పుడు ఎవరో ఒకరి వేలి ముద్ర మరొకరితో పోలి వుండడం జరగవచ్చు. పెదవి ముద్ర విషయంలో కూడా యిదే సూత్రం వర్తిస్తుంది.

డాక్టిలోగ్రఫీ, పోరాస్కోపీ ద్వారా వేలి ముద్రలని, పెదవి ముద్రలని ఫలానా వ్యక్తివేనని నిర్ధారణ చేయడం జరుగుతుంది. నేర నిర్ధారణలో వీటి పాత్ర గణనీయమైనది.



## 6. శవం మైనం బొమ్మగా మారడం సాధ్యమా ?

ఊరిబయట మంచినీటి బావి వుంది. కాని అదిమనుష్యులకి అవసరం లేకుండా పోయింది. అందుకనే ఎవరూ దాని వైపు తొంగి చూడడం కూడా లేదు. అటువంటి బావిలో అనుకోకుండా శవం తేలుతూ కనబడింది.

ఊరిలో జనమంతా బావి దగ్గర గుమికూడారు. శవాన్ని బయటకు తీశారు.

విచిత్రం, నీట మునిగినా శవం శవంలాగానే వుంది. ఏమాత్రం కుళ్ళిపోలేదు సరికదా, అచ్చం మైనం బొమ్మలా వుంది. రూపురేఖలు కూడా చెక్కు చెదరకుండా వున్నాయి.

శవం ఆడా, మగా అనే అనుమానానికి కూడా

ఆస్కారం లేదు. ఆ శవం స్త్రీదే నని చూడగానే తెలిసి పోతూంది.

ఇంకా విచిత్రం ఏమిటంటే...

శవం గొంతు దగ్గర కత్తితో పొడిచిన గాటు, కత్తితో పీకను కోసిన మార్కు స్పష్టంగా కనపడుతున్నాయి.

ఇది చూసిన కొందరు ఈ శవం రెండు మూడు రోజుల్లో జరిగిన హత్య అయి వుంటుందని అన్నారు.

మరికొందరు, "మీకేమైనా పిచ్చా, అసలు ఇది శవం ఎలా అవుతుంది ? మైనం బొమ్మ. ముట్టుకుని చూడండి మైనం లాగా నున్నగా, జిడ్డుగా వుంది" అన్నారు.

అది నిజంగానే బొమ్మా? మృతదేహమా?

ఆ వింత శవాన్ని చూడడానికి జనం గుంపులు గుంపులుగా రావడం మొదలు కాకముందే పోలీసులూ వచ్చారు.

ఆ 'వింత' శవాన్ని పరీక్ష నిమిత్తం ఫోరెన్సిక్ మెడిసిన్ ప్రొఫెసరు డాక్టరు అన్వేష్ దగ్గరికి తరలించారు.

డాక్టర్ అన్వేష్ పోస్టుమార్టం చేశాడు.

గొంతు దగ్గర కత్తి గాయం స్పష్టంగా వుంది. పీక దగ్గర రక్త నాళాలు, కండరాలు, గాలి గొట్టం తెగిపోయి వున్నాయి.

పుర్రె లోపల మెదడు టిస్యూ నీరై పోయి వుంది. కాని, ఊపిరితిత్తులు ముడుచుకుపోయి ముద్దలా తయారైనాయి.

కడుపులో లివర్ ఒక క్రొవ్వు ముద్దలా తయారైంది. ప్రేగులు వున్నాయి కాని, ముడుచుకునిపోయి ముద్దలా వున్నాయి. మూత్రపిండాలు కుచించుకునిపోయి చిన్నవిగా తయారైనాయి. మూత్రకోశం కూడా మిగిలే వుంది. అందులో మూత్రం కూడా వుంది.

డాక్టర్ అన్వేష్ కుడి డొక్కలో వున్న రెండు కత్తి పోట్లు పరిశీలించి ఎటువంటి కత్తితో పొడిచినవో, ఎంత లోతుకి కత్తి దిగిందో స్పష్టంగా చెప్పగలిగాడు.

పోస్టుమార్టం మొత్తం పూర్తిచేసిన తరువాత ఆ శవం ఆరు నెలల నాటిదని తేల్చివేశాడు.

ఆరు నెలలనాటి శవం ఏమిటి? నీట మునిగినా కుళ్లిపోకుండా వుండడమేమిటి? అది ఎందరికో ఆశ్చర్యం కలిగింది.

నిజమే. అది ఆశ్చర్యకర విషయమే.

అయినా కొన్ని సమయాలలో కొన్ని శవాలు నీట మునిగినా కుళ్లిపోకుండా మైనం బొమ్మలా మారిపోతాయి. దీనినే "ఎడిపోసియర్ ఫార్మేషన్" అంటారు కొన్ని శవాలలో నీట మునిగిన తరువాత చర్మం క్రింద వున్న క్రొవ్వు, నీటిలో వున్న కాల్షియం కలిసి ఎడిపోసియర్ ఫార్మేషన్ జరుగుతుంది. ఎడిపోసియర్ ఫార్మేషన జరగడం వల్ల శవం కుళ్లకుండా యథాస్థితిలో వుండిపోతుంది శరీరం లోపలి భాగాలు చెడిపోకుండా అలాగే వుంటాయి.

ఎడిపోసియర్ జరగడమనేది చర్మం క్రింద వుండే

క్రొవ్వులో ముందు ప్రారంభమైనా అది తరువాత చర్మం తోను, శరీరం లోపల కూడా జరుగుతుంది. అందుకని శరీరం ఆకారం, అందులోని అంగాలు యథాప్రకారం వుంటాయి. కొన్ని శవాల్లో ఈ ఎడిపోసియర్ ఫార్మేషన్ శరీరంలో కొంతవరకే జరిగితే, మరికొన్ని శవాల్లో మొత్తం జరుగుతుంది. ఎడిపోసియర్ ఫార్మేషన్ జరిగిన తరువాత ఎటువంటి బాక్టీరియా క్రిములూ శరీరాన్ని కుళ్లేటట్టు చేయలేవు. శవాల్లో బాక్టీరియా చేరి కుళ్లేటట్టు చేయకముందే ఎడిపోసియర్ ఫార్మేషన్ మొదలవుతుంది. శరీరంలో వున్న క్రొవ్వు హైడ్రోజినైజేషన్ వల్ల పామ్టిక్, స్టీరిక్, హైడ్రోస్టీరిక్ యాసిడ్స్‌గా మారి ఎడిపోసియర్ అవుతుంది.

మైనం బొమ్మలా మారిన శవం దాదాపు 20 సంవత్సరాలు చెక్కుచెదరకుండా అలాగే వుంటుంది. చాకు తీసుకుని శవాన్ని కోస్తే సబ్బుని కోసినట్లు మెత్తగా తెగుతుంది. శవం మైనం లాగా మారుతుంది కనుక 200 డిగ్రీల ఫారన్‌హీట్ వేడి దగ్గర కొవ్వొత్తిలా కరిగిపోతుంది.

శవం ఎడిపోసియార్ ఫార్మేషన్ నీట మునిగినప్పుడే కాకుండా తేమ వున్న నేలలోగాని, సున్నం ఎక్కువ వున్న నేలలోగాని పాతిపెట్టినప్పుడు కూడా జరుగుతుంది.

ఇంకా విచిత్రమేమిటంటే ఎడిపోసియర్ ఫార్మేషన్‌కి శవం నీటిలోనే మునిగి వుండ నవసరంలేదు. వాతావరణంలో తేమ ఎక్కువ వుండి వేడి అనిపిస్తున్న పరిస్థితులలో ఆరుబయట వున్నా జరగవచ్చు. ఇలా జరగడానికి కారణం కొన్ని

రకాల బాక్టీరియల్ ఎంజైమ్స్, వాతావరణంలోని తేమ శరీరంలోని క్రొవ్వుతో కలిసి మార్పు తేవటమే.

ఎడిపోసియర్ ఫార్మేషన్ కలిగి శవం కుళ్ళిపోకుండా మైనం బొమ్మలా తయారవడం శీతల దేశాల్లో ఎక్కువ. శీతల దేశాల్లో శవం త్వరగా కుళ్ళేట్టు చేయడానికి బాక్టీరియా క్రిములకి శీతల వాతావరణం అనుకూలంగా లేకపోవడం ముఖ్యకారణం. శవంలో ఎడిపోసియర్ ఫార్మేషన్ అయిదు నుంచి పదిహేను రోజుల్లో జరగవచ్చు. లేదా సంవత్సరం పట్టవచ్చు. ప్యూట్రిఫాక్షన్ బాక్టీరియాకి శవంలో ముందుగానే చోటు దొరకనప్పుడే ఇది సాధ్యమవుతుంది.

శవం ఎడిపోసియర్‌గా మారినప్పుడు ఎన్ని సంవత్సరాలు గడచినా అది హత్యో, సహజమరణమో చెప్పవచ్చు. ఎడిపోసియర్‌గా మారిన శవాన్ని బయట పెట్టినా కుళ్ళిపోకుండా సంవత్సరాల తరబడి వుంటుంది.



# 7. చెత్తకుండీలో దొరికిన పసిబిడ్డ శవం ప్రాణంతో పుట్టినదేనా ?

అదొక మున్సిపాలిటీ చెత్తకుండీ.

ఇంకా తెల్లారకముందే ఊరకుక్కకి ఆకలి వేసినట్లుంది. ఎంగిలి మెతుకుల కోసం చెత్తకుండీ మీదపడింది.

విస్తరాకుల కోసం వెతుకుతున్న ఊరకుక్క నోటికి ఓ చిగురుటాకు తగిలింది.

ఒక్కసారిగా దానిని నోటితో కరుచుకుని చెత్తకుండీ నుంచి రోడ్డు మీదికి దూకింది.

అనుకోకుండా అటు పక్కనుంచి వెళుతున్న హనుమయ్య కుక్క నోటిలో వున్న దాన్ని చూసి నిర్ఘాంత పోయాడు.

ఛయ్, ఛయ్ అని కర్ర విదిలించేసరికల్లా నోట కరచుకున్న చిగురుటాకుని వదిలేసి పారిపోయింది కుక్క.

ఆ చిగురుటాకు మరేమీ కాదు. ఓ పసికూన మృత దేహం. పుట్టి ఎన్నో గంటలు అయినట్టు లేదు. లేత గులాబీ రేకులా కనబడుతున్న శరీర వర్ణం! అక్కడక్కడ రక్తపు చారలు! బొడ్డు తాడు కూడా పచ్చిగా వుంది!

పసికూన మృతదేహాన్ని చూసి షాక్ తిన్న హనుమయ్య అలాగే నిలబడిపోయాడు. ఇంతలో ఇంకో నలుగురు అక్కడికి చేరనే చేరారు. కొద్దిసేపట్లో అక్కడ ఒక పెద్ద గుంపు తయారైంది.

“ఏ కసాయితల్లో ఇంత ఘోరం చేసింది” అని ముక్కు మీద వేలేసుకుంది ఓ స్త్రీ.

“ఏ పాపిష్టిదో ఈ పని చేసివుంటుంది” అంది మరొక స్త్రీ.

“ఇంకెవర్లే. సుబ్బులు కూతురే ఈ పాపిష్టి పని చేసి వుంటుంది” అనేసింది అంకమ్మ.

"ఎంతయినా ఇంత ఘోరమా? దాన్ని పోలీసులకి పట్టించాలి" అంది ఎంతో కష్టంగా వెంకమ్మ.

వెంకమ్మ నోటి నుంచి ఆ మాటరాగానే నలుగురూ "అవునవును, పోలీసులకు పట్టించాలి. అప్పుడు గాని అసలు విషయం తేలదు" అన్నారు.

పోలీసులు రానే వచ్చారు. మృతదేహం చుట్టూ చేరిన గుంపుని "పొండి...పొండి" అంటూ చెదరగొట్టారు.

ఎస్.ఐ. ఆంజనేయులు పోస్టుమార్టంకి ఏర్పాట్లు చేశాడు.

అంకమ్మ పిర్యాదు మేరకు పోలీసులు సుబ్బులు ఇంటికి వెళ్ళారు. సుబ్బులు నోరు మొత్తుకుంటూ తానుగానీ, తన కూతురు గానీ ఏ పాపం చేయలేదనీ, తమకి ఏమీ తెలియదని పోలీసులతో చెప్పుకుంది. "చెప్పేదేదో స్టేషను కాడ చెప్పుకొందురు రండి" అని వాళ్ళిద్దరిని పోలీసులు స్టేషన్ కి తీసుకుపోయారు.

సుబ్బులు కూతురుకి నిజంగా కాన్పు అయిందా లేదా తెల్సుకోవడానికి సర్కారు వారి ఆసుపత్రిలోని లేడీ డాక్టర్ దగ్గరికి పరీక్ష నిమిత్తం పంపారు. పరీక్ష చేసిన డాక్టరు ఆమె పచ్చి బాలింతరాలని తేల్చి వేసింది. కాన్పు అయిన మూడు వారాల వ్యవధిలో అయితే ఎప్పుడు ప్రసవం జరిగిందీ కొద్ది గంటల ఉజ్జాయింపుతో స్పష్టంగా చెప్పవచ్చు.

సుబ్బులు కూతురికి గర్భకోశం కడుపుపైన నుంచి చేతితో అతి తేలికగా తగులుతుంది. జననేంద్రియ మార్గం

నుంచి ఇంకా కొంత రక్తస్రావం వుంది. కాన్పు వల్ల ప్రసవ ద్వారం చీరుకుపోయిన లక్షణాలు కనబడుతున్నాయి. ఇవన్నీ సుబ్బులికి కాన్పు అయిన దానికి సాక్ష్యాలు.

అసలు కాన్పు అయిన స్త్రీ మొదటి మూడు నాలుగు రోజులు నీరసంగా కనబడుతుంది. కళ్ళు లోతుగా వుండి నీరసంగా వుంటుంది. ఇది ఇలా ఉండగా కాన్పు అవగానే గర్భాశయం చిన్నది అయిపోదు. కొద్ది గంటల వరకు బొడ్డుకి కాస్త దిగువున చేతికి తగులుతూ ఉంటుంది. ఆ తరువాత కూడా రెండు మూడు రోజులు క్రికెట్ బాల్‌లాగ అంత పరిమాణంలోనూ పొత్తికడుపు దగ్గర చేతికి గట్టిగా తగులుతుంది. రోజు రోజుకీ 1 సెంటీమీటరు చొప్పున పరిమాణం తగ్గుతూ 12-14 రోజుల్లో మామూలు సైజుకి వచ్చేస్తుంది. కాన్పు అయిన తరువాత వారం రోజుల వరకు యోని మార్గం వదులుగా ఉంటుంది కాన్పువల్ల చీరుకు పోయిన భాగాలు వారం రోజుల్లో కోలుకుంటాయి. ప్రసవంతో తెరుచుకునే గర్భాశయ కంఠం మొదటి రెండ్రోజులు బాగా వదులుగా, తరువాత వారం రోజుల వరకు కొంచెం వదులుగా ఉంటుంది. తరువాత అది మూసుకుని పోతుంది. కాన్పు అయిన మొదటి వారం రోజులు కాస్త ఎరుపు, తెలుపు ద్రవం స్రవిస్తే తరువాత వారం పది రోజులు కాస్త పసుపు రంగుగా ద్రవాలు స్రవిస్తాయి. రెండు వారాలకి గానీ ఈ స్రావం ఆగదు. ఈ లక్షణాలను బట్టి స్త్రీకి కాన్పు అయిందీ లేనిదీ, ఎన్ని రోజుల క్రితం జరిగిందీ చెప్పవచ్చు.

నిజం బయటపడటంతో సుబ్బాలు కూడాను తనకి కాన్పు అయింది గానీ బిడ్డ చచ్చిపోయి పుట్టిందని, తాను చంపలేదని మొరపెట్టుకుంది.

డాక్టర్ అన్వేష్ ఆ పసికూన ఛాతీని బాగా పరిశీలించి చూశాడు. నిండుగా, కాస్త గుండ్రంగా కనబడింది. ప్రాణం లేకుండా పుడితే ఛాతీ ఫ్లాట్‌గా వుంటుంది గానీ గుండ్రంగా వుండదు.

తరువాత కడుపు కోసి చూశాడు. ఛాతీని, కడుపుని వేరు చేస్తూ ఉండే డయాఫ్రం 6-వ ప్రక్కటెముకల లెవెల్లో ఉంది. అదే బిడ్డ ప్రాణం లేకుండా పుడితే డయాఫ్రం 4వ ప్రక్కటెముక దగ్గర ఉంటుంది. పైగా గొడుగులాగా కాకుండా బల్లపరుపుగా కనబడుతుంది.

డాక్టర్ అన్వేష్ ఈ కొద్ది మార్పుతోనే బిడ్డ ప్రాణంతో పుట్టిందనీ, భూమిమీద పడిన తర్వాత చక్కగా ఊపిరి తీసుకుందనీ నిర్ధారణకి వచ్చాడు. అయితే అతని అన్వేషణ అంతటితో పూర్తి కాలేదు.

ఛాతీని కోసి చూశాడు. ఛాతీ ఎముకల క్రింద ఊపిరితిత్తులు నిండుగా ఉన్నాయి. అదే ప్రాణం లేకుండా పుడితే ఊపిరితిత్తులు చిన్నవిగా, ముట్టుకుంటే గట్టిగా ఉంటాయి. శ్వాస తీసుకోగానే అవి ఉబ్బుతాయి. మెత్తగా తయారవుతాయి.

డాక్టర్ అన్వేష్ రెండు ఊపిరితిత్తుల్నీ ఛాతీ నుండి వేరు చేసి బయటకు తీశాడు. రెండింటిని వేరు వేరుగా నీరు

వున్న గాజు తొట్టెల్లో వేశాడు. అవి నీటి మీద చక్కగా తేలాయి. మళ్ళీ వాటి నుంచి చిన్న చిన్న ముక్కలు చేసి నీళ్ళల్లో వేశాడు. ఆ ముక్కలు కూడా నీటి మీద తేలాయి. ప్రాణం లేకుండా పుట్టిన బిడ్డకి అయితే నీళ్ళల్లో వేయగానే ఊపిరి తిత్తులు మునిగిపోతాయి. చివరికి ఊపిరి తిత్తులు నుంచి విడిగా కోసి చేసిన ముక్కలు కూడా మునిగిపోతాయి.

డాక్టర్ అన్వేష్‌కి ఆ బిడ్డ ప్రాణంతోనే పుట్టిందని, చక్కగా గాలి తీసుకుందని పోస్టుమార్టంలో తేలిపోయింది. అయితే ఎలా చనిపోయిందో తెలుకోవలసిన అవసరం వుంది బిడ్డ శరీరాన్ని తీక్షణంగా పరిశీలించి చూశాడు. మెడ దగ్గర చూశాడు. కుక్క మెడ పట్టుకుని ఈడ్చుకొని వెళ్ళడంతో అక్కడ పంటి గాట్లు కనబడుతున్నాయే తప్ప మరేమీ గుర్తులు మొహం మీద లేవు.

అసలు ఈ బిడ్డ సుబ్బులు కూతురని నిర్ధారణ ఏమిటి? ఆమే చంపి పారేసిందని నమ్మకం ఏమిటి? ఇంకెవ్వరి బిడ్డో కావచ్చు కదా! జవాబులు తేల్చి చెప్పవలసిని అవసరం డాక్టర్ అన్వేష్‌కి వుంది.

ఆ బిడ్డ సుబ్బులు కూతురు కన్నదే అని చెప్పాలంటే జెనెటిక్స్ ప్రకారం టెస్టు చేయవలసిందే. అయితే చావుకు ఎవరు కారణమో చాలావరకు తెలుసుకోవచ్చు. అందు కోసం బిడ్డ పీక పిసికి చంపడం వల్లనే బిడ్డ ప్రాణం పోయి వుంటుందని డాక్టర్ అన్వేష్‌కి గట్టి నమ్మకం. తన నమ్మకాన్ని

రుజువు చేసుకోవడానికి మెడ దగ్గర మైక్రో ఫొటోగ్రఫీ తీశాడు.

ఆశ్చర్యం! అక్కడ స్పష్టంగా చేతివేళ్ళ గుర్తులు కనబడ్డాయి.

బిడ్డ చావుకి ఎవరు కారకులో తెలుసుకోవడానికి పోలీసులు కూడా సుబ్బులు, ఆమె కూతురి వేలి ముద్రలు కూడా తీసుకున్నారు.

ఫింగర్ ప్రింట్సు స్పెషలిస్టు రంగనాథ్‌కి అన్వేష్ తీసిన మైక్రో ఫొటోగ్రాఫ్, ఆ ఇద్దరి వేలి ముద్రలు పంపించారు. అవి సుబ్బులి వేలి ముద్రలని తేలిపోయింది.

ఆ పసి కూనని ఎందుకు చంపవలసి వచ్చిందో అది వేరే విషయం. కాని పసికూన మృత్యువులో మిస్టరీగా మిగిలిపోయిన విషయం పోస్టుమార్టంలో వెలుగులోకి వచ్చింది.



## 8. మానభంగానికి ఋజువు

పడుచుదనం పరువాలన్నీ పార్వతిలో నిండుగా వున్నాయి. పార్వతిని చూసి మోజుపడని పడుచు కుర్రవాడు వుండడేమో!

అటువంటి పార్వతి తెల్లవారేసరికల్లా శవంగా మంచి గోడ్డు పక్క పడి వుంది.

పైకి ఒక్క గాయం కూడా కనబడటం లేదు. రేగిన జుట్టు, చిరిగిన రవిక తప్ప మరేమీ తేడా కన్పించడం లేదు.

పార్వతి ఎలా మరణించింది, ఎందుకు మరణించింది ఎవ్వరికీ అంతు పట్టని రహస్యంగా ఉండిపోయింది.

శవంగా మారిన పార్వతిని చూసి జాలిపడటం తప్ప ఎవరు నేరస్తులో తెలియని మిస్టరీ అయింది.

చివరికి పార్వతి శవం పోస్టు మార్టం కొరకు ఫోరెన్సిక్ మెడిసిన్ ప్రొఫెసర్ డాక్టర్ అన్వేష్ దగ్గరికి చేరింది.

ఇంకా రెండు పదులు కూడా నిండని పార్వతి శవంగా మారడం డాక్టర్ అన్వేష్‌ని ఎంతో బాధపెట్టింది.

శవంగా మారినా తన అందాన్ని కోల్పోని పార్వతి ఒంటి మీద కత్తి పెట్టి పరపరా కోసేయాలంటే డాక్టర్ అన్వేష్‌కి కూడా మనసు ఒప్పుకోవడం లేదు. కాని అది అతని ఉద్యోగ ధర్మం. పోస్టుమార్టం చేసి మరణ రహస్యం చెప్పవలసిన విధి అతనిది.

పార్వతి శవాన్ని పై నుంచి క్రింది దాకా చాలా నిశితంగా పరిశీలించసాగాడు.

పార్వతి బుగ్గమీద, రొమ్ముల మీద అక్కడక్కడ ఒకటి రెండు పంటి గాట్లు కనబడ్డాయి. అవి కూడా కసి కసిగా కొరికినట్లు వున్నాయి.

ఎవరైనా రేప్ చేశారేమోనని, రేప్ చేసిన తరువాత చంపి రోడ్డు మీద పారేసేరేమో అని అనుమానం కలిగింది.

రేప్ చేయబడినప్పుడు, అందులోనూ వయసులో వున్న స్త్రీ రేప్ చేయబడినప్పుడు, సాధారణంగా ఆమె శరీరం మీద పెనుగులాడిన గాయాలు కనబడతాయి. రేప్ చేసే దుష్టునికి ఆమె అంత తేలికగా లొంగిపోదు కదా. తన శక్తి మేరకు ఎదుర్కొంటుంది కదా. అయినా ఆ కామ పిపాసి ఆమెను గాయపరిచి లొంగదీసుకుంటాడు కదా. అటువంటప్పుడు ఒంటిమీద తప్పక కొన్ని గాయాలు వుండి తీరాలి. మరి పార్వతి ఒంటి మీద గాయాలు కనబడక పోవటం డాక్టర్ అన్వేష్‌కి ఆశ్చర్యం కలిగించింది.

రేప్ చేయబడి హత్య చేయబడితే పీకని నులిమినట్లు కనబడాలి. లేదా ఎక్కడైనా కత్తితో పొడిచిన గుర్తులు కనబడాలి. అవి కూడా కానరాలేదు. డాక్టర్ అన్వేష్‌కి ఈ కేసు ఒక ఛాలెంజిలాగా తయారైంది

ఒక వేళ చంపకపోయినా రేప్ వల్ల యోని దగ్గర డీప్‌గా చీరుకునిపోయి విపరీతంగా రక్తస్రావమై మరణిం చిందని అనుకుందామంటే ఆమె లంగాగాని, చీరగాని రక్తంతో తడిసి ముద్ద అయినట్లు ఎక్కడా కనబడటం లేదు.

మరి ఆమె ఎందుకు మరణించింది ?

ఎలా మరణించింది ?

డాక్టర్ అన్వేష్ అనుమానించినట్టు రేప్ వల్ల మర ణం కాదా ?

డాక్టర్ అన్వేష్ అంత తేలికగా వదిలిపెట్టే రకం కాదు

రేప్ వల్ల పెళ్ళి కాని పిల్ల మరణించినట్లయితే సాక్ష్యంగా కన్నెపొర చిరిగి కనబడాలి. అదీకాక అప్పుడే చిరిగిన కన్నెపొర గాయంగా కనబడాలి.

పార్వతి రేప్ వల్లే మరణించిందని దృఢంగా నమ్ము తున్న డాక్టర్ అన్వేష్‌కి కన్నెపొర చూసిన తరువాత నిరాశే మిగిలింది. ఎందుకంటే కన్నెపొర ఏ మాత్రం చిరగలేదు.

పార్వతి మరణ రహస్యం విషయంలో తన అభి ప్రాయం మార్చుకోవడానికి మనస్సు ఒప్పుకోవడంలేదు. అయితే పోస్టుమార్టం చేస్తున్న వ్యక్తి ముందే ఒక నిర్ణ యానికి రావడం, ఆ రకంగా ప్రొసీడ్ అవడం తప్పు. ఈ విషయమూ అతనికి తెలిసినదే. అయినా అతని పట్టుదలలో ఒక నిజంలేకపోలేదు. ఎందుకంటే తన సర్వీసులో కొందరు వేశ్యలకి కూడా కన్నెపొర ఉండటం కళ్లారా చూశాడు. కన్నెపొర ఉన్నంత మాత్రాన్న వేశ్యావృత్తిలో ఉన్న స్త్రీని కన్య అనలేం కదా. కన్నెపొర కొందరు స్త్రీలలో చాలా దళసరిగానూ, వదులుగానూ వుండి సంయోగ సమ యంలో తేలికగా ముడతపడి తరువాత మళ్ళీ మామూలు స్థితికి వచ్చేస్తుంది. అందుకని కన్నెపొర చిరగకుండా వుంది కనుక పార్వతి మానభంగానికి గురి కాలేదని అంత తేలికగా ఒప్పుకోలేకపోతున్నాడు.

మరి డాక్టర్ అన్వేష్ తన అనుమానాన్ని నిజంగా రుజువు చేసుకునే దెలా ?

అందుకని ఒక చిన్న పుల్లకి దూది చుట్టి యోని మార్గంలోకి పోనిచ్చి అక్కడ వున్న ద్రవాలతో దానిని తడి చేసి గ్లాసు స్లైడు మీద రుద్ది మైక్రోస్కోపులో పరీక్ష చేయసాగాడు. నిజంగా రేప్ జరిగి వున్నట్టయితే వీర్యకణాలు ఆ స్లైడుమీద కనపడాలి.

మైక్రోస్కోప్‌లో పరీక్ష చేస్తున్న డాక్టర్ అన్వేష్ ముఖంలో ఎక్కడా సంతోష ఛాయలు కనబడలేదు. తాను అనుమానించినట్టు రేప్ అయినట్టయితే మైక్రోస్కోప్‌లో చూచినప్పుడు కనీసం ఒకటి రెండు అయినా వీర్యకణాలు కనబడాలి. సంయోగం తరువాత స్త్రీ మరణించినా మూడు నాలుగు రోజుల వరకు యోని మార్గంలో వీర్యకణాలు కనబడతాయి. అదే రేప్‌కిగురైన సాధారణ స్త్రీలో 9 నుంచి 17 రోజుల వరకు కూడా వీర్యకణాలు యోని మార్గంలో గర్భాశయ కరంలో కనబడతాయి. మరి పార్వతి విషయంలో అలా ఏమీ కనబడటం లేదు. మరణించి పట్టుమని పదిగంటలైనా కాలేదు. అయినా ఆమెలో వీర్యకణాలు లేకపోవడంతో డాక్టర్ తన అభిప్రాయాన్ని మార్చుకోవాలా అనే సందిగ్ధంలో పడిపోయాడు.

ఏమో రేప్ చేసినవాడు వేసక్టమీ చేయించుకున్నవాడు కావచ్చు. అసలు మొదటి నుంచి వీర్యంలో వీర్యకణాలు లేనివాడు కావచ్చు. మరి అటువంటప్పుడు పరీక్ష చేసినా వీర్యకణాలు ఎక్కడ నుంచి వస్తాయి?

డాక్టర్ అన్వేష్‌లో ఈ ఆలోచన రేగింది.

ఒక పొడుగాటి పిప్పెట్టు తీసుకున్నాడు. యోని మార్గం లోపలిక్లా పోనిచ్చాడు. ఆ పిప్పెట్టుతో అక్కడ నిలవ వున్న ద్రవాన్ని కలెక్టు చేశాడు. వెంటనే ఫోరెన్ సిక్ లేబరేటరీలో ఆ ద్రవాన్ని యాసిడ్ ఫాస్ఫేటజ్ టెస్టు చేశాడు. ఆ ద్రవంలో చాలా ఎక్కువ శాతంలో యాసిడ్ ఫాస్ఫేటజ్ కనుగొనబడింది. దానితో డాక్టర్ అన్వేష్ ఆనందంతో ఒక్క గెంతు వేశాడు. ఎక్కువ శాతంలో యాసిడ్ ఫాస్ఫేటజ్ యోనిలో వుండటంటే అది వీర్యానికి సంబంధించిన ద్రవమే. దీన్ని బట్టి పురుష సంపర్కం జరిగిం దని తేలిపోయింది. అది మానభంగమే అయివుండాలి. ఎందు కంటే పోలీసుల కథనం ప్రకారం ఆమె ప్రవర్తన వంక పెట్టేందుకు వీలు లేనిది.

డాక్టర్ అన్వేష్ అనుమానం చాలా వరకు రుజువు అయినట్లే. కాని ఆమె మరణం ఎలా సంభవించి వుంటుంది అనేది అతని ముందు ప్రశ్నార్థకంగా మిగిలిపోయింది.

పుర్రె కోసి చూశాడు. లోపల అంతా చక్కగా వుంది.

పీక దగ్గర దేనికది చూశాడు. అక్కడా ఏమీ కనబడ లేదు. అంటే పీక నులిమి చంపినట్లు కాదు.

ఛాతీ కోసి చూశాడు. పక్క టెముకలు విరగడంగాని, లోపల శ్వాసకోశానికి, గుండెకు గుచ్చుకోవడం గాని లేదు. సాధారణంగా రేప్ జరిగినప్పుడు ఛాతీ గట్టిగా అదిమివేయ బడి ఛాతీ ఎముకలు విరిగి గుండెకు గుచ్చుకునిపోతాయి.

అటువంటిది కూడా ఇక్కడ కనబడంలేదు.

పొట్ట కోసి చూశాడు. అక్కడా అన్నీ సక్రమంగా వున్నాయి.

అయితే పార్వతి ఎలా మరణించింది?

ఆమె మరణం నిజంగా మిస్టరీగా మిగిలిపోయింది.

డాక్టర్ అన్వేష్ తక్కినవన్నీ క్షుణ్ణంగా పరీక్షించిన తరువాత పార్వతి మరణానికి కారణం అతిగా భయపడటం అని నిర్ధారణకి వచ్చాడు. ఆ దుర్మార్గుడు రేప్ చేయడానికి ఆమె మీద పడగా అతిగా భయపడివుంటుంది. ఆ భయంతో ఎడ్రినల్ అతిగా స్రవించి వుంటుంది. అలా అతిగా స్రవించిన ఎడ్రినలిన్ వెంట్రిక్యులర్ ఫిబ్రిలేషన్‌కి కారణమై వుంటుంది. అంతే... క్షణంలో గుండె ఆగిపోయివుంటుంది. అంతేతప్ప పార్వతి మరణానికి వేరే కారణం కనబడటంలేదు.

అయితే పార్వతి అంత భయపడిన దుర్మార్గుడెవరు? అది తెలుసుకోడానికే పార్వతి బుగ్గమీద, రొమ్ములమీద పడిన పళ్ళగాట్లను మోడరన్ టెక్నాలజీ ఉపయోగించి ఫోటో ప్రింట్లు తీశాడు.

ఇంతలో పోలీసులు పార్వతి మరణానికి కారకుడుగా అనుమానించి ఒకడిని పట్టుకోవడం జరగనే జరిగింది. ఫింగర్ ప్రింట్స్ ఒకరివి వున్నట్టు మరొకరికి వుండనట్టే పళ్ళకి సంబంధించిన గాట్లు కూడా ఒకరిని పోలినవి మరొకరివి వుండవు.

విచిత్రం!!

పార్వతి బుగ్గమీది పంటిగాట్లు, పోలీసులు పట్టుకున్న

దుర్మార్గుడి పళ్ళ గాట్లు ఒకటే అయినాయి!

పార్వతికి జరిగిన పోస్టుమార్టంలో మృత్యు రహస్యం బయటపడడమే కాదు, ఆమె మరణానికి కారణమైన అసలైన నేరస్తుడు కూడా దొరికిపోయాడు.



# 9. నీళ్లలో దొరికిన శవం

శ్రీనివాస్‌తో షికారుకి వెళ్లిన సునీత సరస్సులో శవమై తేలింది.

ఈ సంగతి విన్న తల్లిదండ్రులు గొల్లుమన్నారు. "నిలువునా నా కూతురు ప్రాణం తీశారు" అని తల్లి రోదిస్తూ అల్లుడి మీద నింద మోపింది.

"ఏ పాపం నేనెరగను! కాళ్లు కడుక్కుంటానని సరస్సు ఒడ్డుకి వెళ్లి సర్రున జారిపోయింది. నేనైతే ఈతరానివాడిని, ఏం చేయాలో తెలియక, సునీతని ఎలా రక్షించాలో తెలియక అయోమయంలో పడిపోయాను. ఎంతో అరిచాను. అక్కడెవరైనా వుంటేగా వెంటనే ఆదుకోవడానికి?" బాధగా అన్నాడు శ్రీనివాస్. అతని కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి భార్యని పోగొట్టుకున్నందుకు. బంధువులు, స్నేహితులు అతనికి సానుభూతి చూపించారు.

కాని సునీత తల్లి అతనివన్నీ దొంగ కన్నీళ్ళు అన్నది.

"అన లేనప్పుడైనా నా కూతురుని ప్రేమగా చూస్తేగా?" అంది. పుట్టింటి నుంచి డబ్బు తెమ్మని వేధించడం తప్ప తిండి తిందా లేదా అని పట్టించుకున్న రోజు అంటూ లేదంది.

"ఈ రోజుల్లో ఇదొకటి ఎక్కువై పోయింది. తనంతట తను చచ్చిపోయినా, ప్రమాదవశాత్తు మరణించినా, భర్త చంపేశాడనో, అత్త ఆరళ్ళు భరించలేక ప్రాణం తీసుకుందనో అనడం పరిపాటి అయిపోయింది" అంది సునీత అత్తగారు కొడుకుని వెనకేసుకుని వస్తూ.

ఏదైతేనేం, సునీత శవం పోస్టుమార్టం కోసం డాక్టర్ అన్వేష్ దగ్గరికి వచ్చింది సునీత ప్రమాదవశాత్తు సరస్సులో పడిపోయిందని పోలీసు పంచనామాలో రాసివుంది. కాని శవం తీరు చూస్తే ఆమె చావులో ఏదో మిస్టరీ వుందనిపించింది డాక్టర్ అన్వేష్‌కి.

సునిత ముఖం కాస్త ఉబ్బి వుంది. మొహం, పెదవులు నీలంగా కనబడుతున్నాయి. ఫెయిర్ కాంప్లెక్షనేమో గోళ్ళు, చేతులు కూడా స్పష్టంగా నీలిరంగులో కనబడుతున్నాయి. కనుగుడ్లు పైకి ఉబ్బి ఉన్నాయి. కంటి పాపలు పెద్దవి అయి వున్నాయి. నాలిక ఉబ్బి కాస్త బయటకు కనబడుతుంది. వీటన్నిటి బట్టి చూస్తే ఆమె గాలి ఆడక మరణించిందని తేలిపోతుంది. నీళ్ళల్లో మునిగిపోయినప్పుడు శ్వాస తీసుకోవడంతో పాటు నీళ్ళు కూడా ఊపిరితిత్తుల్లోకి పోయి ప్రాణవాయువు అందక ప్రాణంపోవడం మామూలు.

మరి ఆ లక్షణాలన్నీ సునీతలో స్పష్టంగా కనబడు

తున్నాయి. అయితే అంతమాత్రాన సునీత నీటిలోపడడంతో మరణించిందని నమ్మబుద్ధి కావడం లేదు డాక్టర్ అన్వేష్‌కి.

నీటిలో మునిగి మరణించినట్లయితే ముక్కులో నుంచి నోటిలో నుంచి నురుగు రావటం ఉంటుంది. మరి అటువంటి నురుగేమీ కనబడడం లేదు. అయితే అరుదుగా కొందరి విషయంలో నీటిలో పడగానే ఒక గుక్కెడు నీళ్ళు గాలి గొట్టంలోకి పోగానే లారెంగ్స్ (స్వరపేటిక) స్పాజిమ్ వచ్చి పూర్తిగా నీరు లోపలికి పోకుండానే ప్రాణం పోవచ్చు. అరుదుగానే అయినా అలా జరిగే అవకాశం వున్న విషయాన్ని మరువలేదు డాక్టర్ అన్వేష్.

నీటిలో మునిగిపోయి మరణించారని చెప్పిన కేసుల్లో నూటికి ఇరవై కేసులు ముందే గొంతు నులిమి చంపేసి నీటిలో పడేసినవో, మత్తు మందులు వేసి అపస్మారక స్థితిలో నీటిలో తోసినవో అయి వుంటాయి. అటువంటి కేసులు డాక్టర్ అన్వేష్ తన సర్వీసులో చాలా చూశాడు.

డాక్టర్ అన్వేష్ కత్తి పరపరా చాతీని కోసింది. మామూలుగా నీట మునిగి ప్రాణం పోయిన కేసుల్లో అయితే చాతీని కోయగానే లోపల ఉబ్బిపోయి వున్న ఊపిరితిత్తులు రెండూ పొడుచుకుంటూ బయటికి వస్తాయి. కాని అటువంటిదేమీ ఇక్కడ కనబడలేదు. అదీకాక నీట మునిగి ప్రాణం కోల్పోయిన వారి విషయంలో నీరు బాగా చేరిపోయి ఉబ్బిన ఊపిరితిత్తులు చాతీ మధ్యలో వుండే గుండెను కనబడకుండా మూసివేస్తాయి. ఆ కాస్త ఖాళీ స్థలాన్ని కూడా ఆక్రమించి

గుండెను నొక్కి వేస్తాయి.

సునీత విషయంలో అటువంటిదేమీ కనబడడం లేదు. రెండు ఊపిరితిత్తుల మధ్య గుండె మామూలుగా కనబడుతుంది. ఊపిరితిత్తులు కూడా మామూలు పరిమాణంలో వున్నాయే తప్ప పెరిగి లేవు.

రెండు ఊపిరితిత్తులను బయటకు తీసి ముక్కలుగా చేసి చూశాడు. చాలా తక్కువ నీరు వచ్చింది కాని అది ఏ లెక్కలోకీ రాదు. అయినా ఆ నీటిని పరీక్ష నిమిత్తం వేరుగా పట్టి వుంచాడు. అదే నీట మునిగి ప్రాణం కోల్పోయిన వాని విషయంలో అయితే ముక్కలు ముక్కలుగా కోసిన ఊపిరితిత్తులనుండి, నురగ రూపంలోను, రక్తం కలిసిన నీరు రూపంలోను, కావలసినంత ద్రవం కారుతుంది.

ఊపిరితిత్తుల నుండి వచ్చిన నీటిని మైక్రోస్కోపులో వెంటనే 'డయోటోమ్ టెస్ట్' చేశాడు. మామూలుగా అన్ని రకాల నీళ్ళలోనూ (నదులు, సముద్రాలు, చెరువులు, కాలువలు, నూతులు ఏవైనా కావచ్చు.) ఆల్గే అనే ఏకకణ జీవులు వుంటాయి. మనిషి నీట మునిగి ఆ నీరు ఊపిరితిత్తుల్లోకి పోయినప్పుడు ఇవి కూడా అక్కడికి చేరుతాయి. అంతేకాదు వెంటనే అవి శ్వాసనాళాలని ఛేదించుకుని రక్త ప్రవాహంలోకి చేరి మెదడులోకి, గూడ ఎముక, తొంటి ఎముకల్లోకి కూడా వెళ్ళిపోతాయి. "డయోటోమ్ టెస్టు"లో ఆల్గే కనబడినట్లయితే నీట మునిగి ప్రాణం పోయినట్లు నిర్ధారణ అవుతుంది.

డాక్టర్ అన్వేష్ ఊపిరితిత్తుల నుంచి పట్టిన ఆ కొద్ది పాటి ద్రవాన్ని మైక్రోస్కోపులో ఏకాగ్రంగా పరీక్షచేయు నారంభించాడు. కాని అక్కడ ఆశ్తే కనబడలేదు. మరి పోలీసు పంచనామాలో నీట మునిగి ప్రాణం కోల్పోయినట్లు వుంది. అది నిజం కాదని డాక్టర్ అన్వేష్‌కి కొంతవరకు చేసిన పోస్టుమార్టం ద్వారా రుజువయింది. అయితే మరికొన్ని ఆధారాలు కావాలి. నీళ్ళలో పడీ పడగానే భయంవల్ల గుండె ఆగిపోతే ఇక ఊపిరితిత్తుల్లోకి నీళ్ళు చేరే ప్రసక్తే వుండదు కదా.

ఆ అనుమానమే ఎవరైనా లేవనెత్తితే...!

డాక్టర్ అన్వేష్ ఒక్క క్షణం సందిగ్ధంలో పడ్డాడు.

తన నిర్ణయం సరైనదే అయినా అలాంటి ప్రశ్నకి సమాధానం చూపించలేకపోతే తానేదో పక్షపాత వైఖరిగా వ్యవహరించినట్టే కదా. ఆలోచనలో పడ్డ అన్వేష్‌కి శవంగా మారిన సునీతే కావలసిన సమాచారం అందించింది.

ఎంత అకస్మాత్తుగా ప్రాణం పోయినా ఆత్మరక్షణ కోసం నీట మునిగిపోతున్న వ్యక్తి గట్టునో, గడ్డిపరకనో పట్టుకోవడానికి గట్టిగా పిడికిలి బిగిస్తాడు. ప్రాణం పోయినా అలా గుప్పిడి బిగిసే వుంటుంది. అందులో చిక్కిన మట్టో, గడ్డిపరకో మిగిలే వుంటుంది. (దీనినే కడావెరిక్ స్పాజమ్ అంటారు) సునీత విషయంలో అటువంటి కడావెరిక్ స్పాజమ్ ఏమీ కనబడటం లేదు.

ఇది ఇలా వుండగా డాక్టర్ అన్వేష్ బుర్రలో

మెరుపులాంటి ఆలోచన కలిగింది.

వెంటనే సునీత శవాన్ని బోర్లా పడేసి చూశాడు. వీపంతా రాళ్ళు, రప్పలతో గీసుకునిపోయి వుంది.

ఆ వెంటనే పీక దగ్గర చూశాడు. పైకి ఏమీ లేదు. మరింత జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. మెడ మీద అక్కడక్కడ చర్మం కమిలి కనబడుతూంది. మెడ దగ్గర జాగ్రత్తగా కోసి చూశాడు. చర్మం క్రింద రక్తనాళాలు చిట్లివున్నాయి. కండరాలు నలిగివున్నాయి.

కావలసిన క్లూలు దొరికిపోయాయి. అందరూ ఊహిస్తున్నట్లు సునీత నీటిలో మునగడం వల్ల మరణించలేదు. ముందే పీక నులిమి ప్రాణం తీసిన తరువాత ఈడ్చుకుంటూ తీసుకువెళ్ళి నీటిలోకి నెట్టి వేయడం జరిగింది. ఇది హత్యే గాని ప్రమాదవశాత్తు సంభవించిన మరణం కాదు.

డాక్టర్ అన్వేష్ తన ఒపీనియన్ పోస్టుమార్టంరిపోర్ట్ లోకి ఎక్కించడం కోసం కలం అందుకున్నాడు.

❋

# 10. కుళ్ళిపోయిన శవం ఆడా? మగా? తేలేదెలా ?

ఆ ఊళ్ళో ఒకేసారి ఇద్దరు కనబడకుండా పోయారు. కనబడకుండా పోయిన వాళ్ళు ఇద్దరూ మగవాళ్ళే అయినా, ఆడవాళ్ళే అయినా అంతగా ఆలోచన వుండేది కాదేమో. అందులో ఒకరు ఆడ—మరొకరు మగ.

వారం దాటింది కానీ వారి జాడ ఎవరికీ అంతుపట్ట

లేదు. అమ్మాయి తల్లితండ్రులు పోలీసు స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చారు.

రిపోర్టు రాసుకున్న ఎస్.ఐ. "మీ అమ్మాయి ఏమై పోయి వుంటుందను కుంటున్నారు?" అని అడిగాడు. ఏం చెప్పాలో తెలియక అయోమయంలో పడిపోయారు వాళ్ళు. కాని ప్రక్కనే వున్న కుర్ర కానిస్టేబుల్ "ఏమై వుంటుంది, ఎవరితోనో లేచిపోయి వుంటుంది" అన్నాడు హేళనగా. అప్పటికే అవమాన భారంతో తలలు పడిపోయిన తల్లి తండ్రులకి కానిస్టేబుల్ మాటలు కన్నీళ్ళు తెప్పించాయే తప్ప కలవరాన్ని కలిగించలేదు.

అమ్మాయి తనకిష్టమైన వానితోపోయినా పరవా లేదు కానీ క్షేమంగావుంటే చాలు అదే పదివేలు అనుకున్నారు.

అమ్మాయి కనబడకుండా పోయిన కొద్ది రోజులకి ఒక మురికి గుంటలో మొండెంలేని ఒక స్త్రీ శిరస్సు దొరికింది.

పొడుగాటి శిరోజాలు వుండబట్టి అది స్త్రీ శిరస్సు అనుకోవడమే తప్ప, ముఖం అంతా కుళ్ళిపోయి అది ఎవరిదో గుర్తుపట్టలేని స్థితిలో వుంది. చివరికి ఆడా, మగా అని చెప్ప లేని స్థితిలో వుంది.

శిరస్సు దొరికిన రెండు, మూడు రోజుల్లోనే పాడు పడిన బావిలో తలలేని మొండెం ఒకటి కనబడింది.

ఒంటి మీద బట్టలేమీ లేవు. బాగా కుళ్ళిపోయివుంది. ఆకారం బట్టి మనిషిదని అనుకోవాలే తప్ప ఆ శవం ఆడదో, మగదో తేల్చిచెప్పే అవకాశం కూడా లేదు.

పోలీసులు దొరికిన ఆ మొండాన్ని, తలనీ తమ ప్రాంతానికి చెందిన ప్రభుత్వ ఆసుపత్రికి పోస్టుమార్టం నిమిత్తం తీసుకువెళ్లారు.

ఆ ప్రభుత్వ ఆసుపత్రిలో పేరుకి నలుగురు డాక్టర్లు. అయినా ఎప్పుడూ వుండేది ఒక్కరే. తక్కిన ముగ్గురూ ఎప్పుడూ ప్రైవేటు ప్రాక్టీసే! మిగిలిన ఆ ఒక్కరూ కొత్తగా ప్యాసయిన కుర్ర డాక్టరు.

కుర్రడాక్టరు కుళ్లిపోయిన ఆ శవానికి పోస్టుమార్టం ఎలా చేయాలో తోచక తికమకపడ్డాడు. చివరికి తల నరికేయటంతో ప్రాణం పోయిందనీ, అది (స్త్రీ) శవమనీ, బాగా కుళ్లిపోయి వున్నందున తక్కినవి చెప్పటం కుదరడం లేదని రిపోర్టు రాసి ఇచ్చేశాడు.

దానివల్ల పోలీసులకి కొంత భారంతీరినట్లు అనిపించింది. అమ్మాయి కనిపించడం లేదని ఫిర్యాదు చేసిన తల్లితండ్రులని పిలిచి ఇదిగో 'మీ అమ్మాయి శవం' అని పోలీసులు అప్పజెప్పబోయారు.

"మా అమ్మాయి శవంగా మారట మేమిటి ? మా మనసు అంగీకరించడంలేదు. అసలు ఆ శవం మా అమ్మాయిదే కాదు" అన్నారు తల్లితండ్రులు. లోపల నిజమే నేమోనని వున్నా, అమ్మాయి ఇంకెక్కడో క్షేమంగానే వుండి వుంటుందనే ఆశ వారిలో చావలేదు.

పోలీసులకి ఈ శవం ఇప్పుడొక పెద్ద సమస్య అయి కూర్చుంది. శవం కుళ్లిపోయినా దొరికిన ఆధారాన్ని బట్టి

హత్య చేయబడిం దేవరో తెలుసుకోవలసిన బాధ్యత పోలీసులదే. ఆ కుళ్లిన శవాన్ని మరోసారి పోస్టుమార్టం చేయించి నిపుణుల అభిప్రాయం సంపాదించవలసిన అవసరం వారికి వచ్చింది.

చివరికి మొండెం నుంచి వేరైన తల, తలనుంచి వేరైన మొండెం డాక్టర్ దగ్గరికి చేరాయి.

సెకండ్ ఒపినియన్ కోసం అందులోనూ నిపుణుల అభిప్రాయంకోసం తీసుకురావడంతో డాక్టర్ అన్వేష్ కాస్త ఆలోచనలో పడ్డాడు.

తలనీ, మొండాన్నీ బాగా పరిశీలించి చూశాడు. కోసేందుకు అక్కడేమీ లేదు. అన్నీ బయటికే వున్నాయి. చకచకా అన్నీ తడిమేశాడు.

ఒక్కసారిగా పోలీసు ముఖంలోకి తీక్షణంగా చూశాడు డాక్టర్ అన్వేష్.

"తలా, మొండెం రెండూ ఒకరివేనా ?" అడిగాడు.

డాక్టర్ అన్వేష్ అలా అడగటంతో పోలీసులకు మతి పోయినట్టయింది. అయినా కాస్త తమాయించుకుని, 'అవును' అన్నారు. "అయినా మీకెందుకా అనుమానం కలిగింది" అడిగారు నింపాదిగా.

దానికి డాక్టర్ అన్వేష్ అన్నది విన్న తరువాత పోలీసుల మతి నిజంగానే పోయింది.

డాక్టర్ అన్వేష్ విడమరచి వాళ్ళతో చెబుతూ,

"శిరస్సు స్త్రీదే, కానీ మొండెం మగవానిది. దొరికిన తలా, మొండెం రెండూ ఒకరివి కాదు" అన్నాడు.

"డామిట్ కథ అడ్డం తిరిగింది. సింగిల్ మర్డర్ కాదన్నమాట. డబుల్ మర్డరన్న మాట" అన్నాడు హెడ్ కానిస్టేబుల్ మిస్టరీ మర్డర్స్‌తో మతి పోగొట్టుకుంటూ.

అయోమయం నుంచి కాస్త తేరుకుంటూ "నాకు తెలియక అడుగుతున్నా, ఇది ఆడదాని మొండెం కాదు, మగవాడిదని ఎలా అంటున్నారు" అని అడిగాడు.

డాక్టర్ అన్వేష్ ఏదో చెప్పబోయాడు. అయినా తాను అడగవలసింది ఇంకా పూర్తికానట్టు "అసలు అక్కడ మర్మావయవాలే కనబడటం లేదు కాదా, ఇంకెట్లా మీకు నిర్ణయించడం సాధ్యమైంది?" అని అమాయకంగా అడిగాడు

"నీ అనుమానం సరైనదే. మర్మావయవాలు కుళ్ళిపోయి, లేకుండా పోయినా సెక్సు నిర్ధారణ చేయవచ్చు. ముందు నేను కూడా తలా, మొండెం ఒకరివే అనుకున్నాను. అయినా సెక్సు నిర్ధారణ కోసం పొత్తి కడుపులోపల వుండే గర్భకోశం చూశాను. శవం కుళ్ళిపోయి గుండె, ఊపిరితిత్తులు, లివర్, స్ప్లీన్ అన్నీ ఆకారం లేకుండా పోయినా గర్భసంచి మాత్రం చాలాకాలం వరకు ఆకారం చెదరకుండా వుంటుంది అందుకనే కడుపులోని ప్రేగులన్నీ కుళ్ళిపోయినా గర్భకోశం చూశాను. అది ఎంత వెదికినా కనబడలేదు" అన్నాడు డాక్టర్ అన్వేష్.

"అలాగా? అదుకని ఆడదానిది కాదన్నారా"

అన్నాడు హెడ్ కానిస్టేబుల్ తాపీగా.

"గర్భకోశం లేనంత మాత్రాన స్త్రీ శవం అనుకో డానికి వీలులేదే! కాన్పులు అయిన స్త్రీలో గర్భకోశం తక్కిన శరీర భాగాలలాగానే త్వరగానే కుళ్ళిపోతుంది. అందుకని త్వరగా నిర్ణయానికి రాకుండా ప్రొస్టేటుగ్రంధి కోసం కూడా వెతికాను. అది కనబడింది. ప్రొస్టేటు గ్రంధి ఆడవాళ్ళలో వుండదు. మగవాళ్ళల్లోనే వుంటుంది. అదీ గాక శరీరమంతా కుళ్ళిపోయినా ప్రొస్టేటుగ్రంధి చివరి వరకు మిగిలి వుంటుంది. శరీరంలో చివరగా కుళ్ళేది ఈ ప్రొస్టేటు గ్రంధే. అందుకనే స్త్రీశిరస్సు దిఅనేది తెలుస్తున్నా. మొండెం మగవానిదని తేలిపోయింది" అన్నాడు డాక్టర్ అన్వేష్.

అయితే, అతటితో డాక్టర్ అన్వేషణ పూర్తి కాలేదు.

ప్రోస్టేటు గ్రంధితో సెక్స్ నిర్ధారణ పూర్తి అయి నట్లు కాదు. శరీరంలోని ఎముకలను కూడా పరీక్షచేసి కుళ్ళిన శవం ఆడ, మగా అనేది నిర్ధారణ చేయాలి. ఎముకల ఆకారం బట్టి అవి స్త్రీవా, పురుషునివా అని చెప్పేయవచ్చు.

కేవలం పుర్రె, బస్తి ఎముకలు దొరికితే 98 శాతం నిర్ధారణతో చనిపోయినది స్త్రీయా, పురుషుడా అని చెప్ప వచ్చు.

ముఖం ఆకారం అంతా చెడిపోయినా, తలమీద వెంట్రుకలు లేకుండా పోయినా, కేవలం పుర్రె ఒక్కటే మిగిలినా ఆ పుర్రె స్త్రీదా, పురుషునిదా అని తొంభై

శాతం నిర్ధారణగా చెప్పవచ్చు. పది శాతం కేసుల్లో అభి ప్రాయం తప్పకావచ్చు.

కేవలం బస్తి ఎముక (పెల్విస్ బోన్) ఆధారంగా 95 శాతం నిర్ధారణతో ఆడా, మగా అనేది తేల్చవచ్చు.

కేవలం గూడ ఎముక, తొంటి ఎముక, మోకాలు ఎముక దొరికితే 80 శాతం కేసుల్లో అవి స్త్రీకి సంబంధించి నవా, మగవాళ్ళకి సంబంధించినవా చెప్పవచ్చు.

ఎందుకంటే స్త్రీలలో ఎముకలు కాస్త చిన్నవి గానూ, బరువు తక్కువగానూ, ఎక్కువ నున్నగానూ వుం టాయి. మగవాళ్ళలో కాస్త పెద్దవిగా, బరువుగా, గరు కుగా వుంటాయి.

పుర్రె కూడా స్త్రీలలో కాస్త చిన్నదిగానూ, దాని మీద వుండే ఎత్తుపల్లాలు మగవాళ్ళ పుర్రె కంటే తక్కువ గానూ వుంటాయి.

స్త్రీకి బస్తి ఎముక (పెల్విస్ బోన్) పురుషుని కంటే తక్కువగానూ, వెడల్పుగానూ, నున్నగానూ వుంటుంది. అంతేకాకుండా పెల్విస్ దిగువ భాగం మగవారిలో కంటే చాలా వెడల్పుగా వుంటుంది. అందుకనే శిశు జననం తేలి కగా జరుగుతుంది.

డాక్టర్ అన్వేష్ కుళ్ళిన ఆ శవం తాలూకు పోస్టు మార్టం పూర్తి చేశాడు.

తనకి దొరికిన క్లూలు బట్టి, ఎముకల షేప్ బట్టి శిరస్సు స్త్రీది అనీ, మొండెం మగవానిది అనీ నిర్ధారణగా తేలుస్తూ

రిపోర్టు పూర్తి చేశాడు.

అయితే తల దొరికి జాడ తెలియని మొండెం ఏమైనట్లు ? అలాగే మొండెం దొరికి, దొరకని తల ఏమైనట్లు ?

ఈ డబుల్ మర్డర్స్ ఎందుకు జరిగినట్లు ? వాటిమధ్య సంబంధం ఏమిటి ?

తల, మొండెం దొరకడంవల్ల కథ పూర్తి అయిందనుకున్న పోలీసులకి పోస్టుమార్టమ్ ఫైండిగ్స్‌వల్ల కథ మళ్లీ మొదటికి వచ్చింది.



# 11. మరణ రహస్యం తెలుసుకోవడంలో తికమకలు

కొత్తగా పెళ్ళయిన కొండయ్య పొలానికి వెళ్ళి పీనుగుగా మారిపోయాడు. కొత్త పెళ్ళికూతురు రుక్మిణి శవంగా మారిన కొండయ్యను చూసి గొల్లుమంది. కొండయ్య చావు చూస్తే చాలా అనుమానాస్పదంగా వుంది.

పొలానికి పురుగు మందు కొట్టడానికి వెళ్ళి ఆ మందే తీసుకుని ప్రాణం తీసుకున్నాడని అనుమానం కలిగింది.

కొండయ్యకి ఎందుకిలా చేయవలసి వచ్చింది? కొండయ్యకి ఇష్టం లేకుండా ఈ పెళ్ళి జరిగిందా? అదెవ్వరికీ అర్థంకాని విషయంగా వుండిపోయింది.

కొండయ్య చచ్చి తన కూతుర్ని ఎందుకూ పనికి రాకుండా చంపాడని రుక్మిణమ్మ తల్లి నెత్తీ నోరు మొత్తుకుంటూ ఏడ్వడం మొదలుపెట్టింది.

ఆ తల్లి అనుమానానికి ఆధారం లేకపోలేదు. కొండయ్య నోటి వెంట చొంగ వస్తుంది. వేసుకున్న దుస్తులమీద వాంతి చేసుకున్న సూచనలు కనబడుతున్నాయి. వళ్ళంతా పురుగుల మందు వాసన వస్తూన్నందువల్ల వాంతి వాసన ప్రత్యేకంగా తెలియడంలేదు ఏ మందు పొలానికి కొట్టాడో అదే తీసుకుని వుండవచ్చు.

అయితే కొండయ్య తల్లి తండ్రులు రుక్మిణమ్మ తల్లి మాటల్ని ఒప్పుకోలేదు. కొండయ్యకి ఆత్మహత్య చేసుకో వలసిన పరిస్థితి ఏమీ లేదన్నారు. అతని చావులో ఏదో మిస్టరీ వుందన్నారు.

"అదేమీ కాదు మీవాడు కావాలని చచ్చాడు. నా కూతురు గొంతు కోసేశాడు" అంది ఆవేశంగా రుక్మిణమ్మ తల్లి.

శవాన్ని ఎదురుగా పెట్టుకుని రెండు వైపుల వారూ ఘర్షణకి దిగారు. "మందు వాసనకి ప్రాణం పోయిందేమో" అంటూ మధ్యవర్తులు సర్దబోయారు. అయినా వారి మధ్య వేడి తగ్గలేదు. దానితో కొండయ్య శవం శవపరీక్షకు మెడికల్ ఆఫీసరు దగ్గరికి వెళ్ళింది.

మెడికల్ ఆఫీసరు కొండయ్య శవాన్ని తేరిపార చూశాడు. శరీరంపై ఎక్కడా గాయాలేమీ కనబడలేదు. శవం నుంచి పురుగుల మందు వాసన వస్తోంది.

శరీరం మీద వున్న దుస్తుల్ని తీసి జాగ్రత్తచేశాడు. ముఖ్యంగా వాంతి చేసుకున్న చొక్కాని వేరుగా వుంచాడు.

పోస్ట్‌మార్టమ్ ప్రారంభించాడు.

గొంతుకోసి చూశాడు. అక్కడేమీ దెబ్బతిన్నట్టు కనబడలేదు. కడుపు కోసి చూశాడు. పొలానికి వెళ్ళే ముందు భోజనం చేసినట్టు వున్నాడు. సగం సగం జీర్ణమైన అన్నం జీర్ణాశయంలో కనబడింది. జీర్ణాశయాన్ని, అందులో వున్న ఆహారాన్ని స్పిరిట్ బాటిల్‌లో భద్రపరిచాడు.

జీర్ణకోశం ప్రేగుని కూడా కొంత భాగం కోసి చూశాడు. అక్కడా అతనికేమీ కనబడలేదు. అయినా దాని భాగాన్ని కూడా కొంత తీసి స్పిరిట్ బాటిల్‌లో బద్ర పరిచాడు.

కొండయ్య ఎలా చనిపోయినట్లు?

ఎండ్రిన్ వంటి పురుగుల మందు తీసుకున్నట్లు ఎక్కడ కనబడటంలేదు. అయినా మరణరహస్యం తెలుసుకోవలసిందే! మూత్రపిండాల్ని, కాలేయాన్ని చూశాడు. పైకి బాగానే వున్నాయి. అయినా ఎందుకయినా మంచిదని రసాయనిక పరీక్షల నిమిత్తం వాటికి సంబంధించిన చిన్న చిన్న భాగాలని కోసిబాటిల్‌లో భద్రపరిచాడు.

మూత్రం పరీక్ష చేస్తే కొంత క్లూ దొరకవచ్చు. ఎందుకంటే చాలా రకాల రసాయనిక విష పదార్థాలు మూత్ర పిండాల ద్వారా మూత్రంలోకి చేరుతాయి. కొంత మూత్రాన్ని తీసి సీసాలో భద్రపరిచాడు.

ఏది కోసినా, ఏది చూసినా ఏమీ కనబడడం లేదు. కొండయ్య మరణం ఎలా సంభవించినట్టు?

ఛాతీ కోసి చూశాడు. శ్వాసకోశాలు, గుండె మామూలుగా వున్నాయి. పుర్రెనికోసి మెదడు చూశాడు. అదికూడా మామూలే.

ఆ మెడికల్ ఆఫీసరుకి ఏమీ తోచలేదు. చివరికి రక్త నాళాల్లో నుంచి కొంత రక్తం సిరంజి ద్వారా తీసి వేరే సీసాలో వుంచాడు.

శవ పరీక్ష ముగిసిందిగాని మరణరహస్యం అంతుపట్ట లేదు. పోస్టుమార్టం రిపోర్టులో తన నిర్ణయం ఏమీ తెలియ జేయలేకపోయాడు.

చివరికి మరణ రహస్యం తెలుసుకోవడానికి తాను భద్రపరచిన శరీర భాగాల్ని డాక్టర్ అన్వేష్ దగ్గరికి పంపిం చాడు.

డాక్టర్ అన్వేష్ వాటన్నింటినీ రాసాయనిక పరీక్ష నిమిత్తం ఫోరెన్సిక్ లేబొరేటరీలోకి తీసుకువెళ్ళాడు.

సాధారణంగా విషం ఏదైనా లోపలికి తీసుకుంటే జీర్ణాశయంలో వున్న పదార్థాన్ని రసాయనిక పరీక్ష చేస్తే తెలిసిపోతుంది. డాక్టర్ అన్వేష్ కడుపులో వున్న పదార్థా లని సాధారణంగా తీసుకునే విష పదార్థాల కోసం పరీక్ష చేశాడు. అందులో ఏమీ కనబడలేదు.

మరణ రహస్యం తేలికగా తెలిసిపోతుందని ఆశపడిన డాక్టర్ అన్వేష్‌కి నిరాశే ఎదురైంది.

తరువాత చకచకా తక్కిన శరీర భాగాలన్నీ రసాయ నిక పరీక్ష చేశాడు. వాటిల్లోనూ ఏమీ కనబడలేదు. మూత్రం

పరీక్ష చేశాడు. అందులోనూ ఏమీ అంతుబట్టలేదు.

ఇంక మిగిలింది సీసాలోని ఎర్రగా కనబడుతున్న రక్తం మాత్రమే.

ఆ రక్తాన్ని ఏ పరీక్ష చేయాలి?

ఒక్క క్షణం సీరియస్‌గా ఆలోచించాడు. డాక్టర్ అన్వేష్.

పొలం దగ్గర పురుగు మందు కొడుతూ మరణించిన కొండయ్య ఆ మందువలే ఎందుకు మరణించాలి. పాము కాటుకు ఎందుకు గురై వుండకూడదు అన్న ఆలోచన ఒక్కసారిగా మనసులో మెదిలింది.

సాధారణంగా విషసర్పం కరిస్తే కొన్ని గంటలపాటు బతికే వుంటారు. పాము కరచిందని ఎవరికో ఒకరికి చెప్పేంత వ్యవధి వుంటుంది. మరి కొండయ్య విషయంలో అలాంటి దేమీ కనబడటం లేదు.

ఏమో! పాము కోరలు తిన్నగా రక్తనాళాల్లోకి దిగి నేరుగా విషం రక్తంలోకి చేరిపోయిందేమో ...దానితో కొద్ది నిమిషాల్లోనే ప్రాణం పోయిందేమో...

ఆ ఆలోచన రాగానే సీసాలో పట్టిన రక్తాన్ని పాము విషం కోసం పరీక్ష చేశాడు. సాధారణంగా ఆల్కహాలు ఎక్కువ అవడం వల్లనో, కార్బన్ మోనాక్సైడ్ ఎక్కువ అవడం వల్లనో ప్రాణం పోయిందని అనుమానం కలిగినప్పుడు చనిపోయిన వ్యక్తి నుంచి రక్తం సేకరించి రసాయనిక పరీక్ష

చేయడం జరుగుతుంది. అదే విధంగా ఇప్పుడు డాక్టర్ అన్వేష్ కొండయ్య రక్తాన్ని రసాయనిక పరీక్ష చేయనారంభించాడు.

పాము కోరల నుంచి వెలువడే విషంలో ప్రోటియోలైటిక్ ఎంజైమ్, ఫాస్ఫొటైడైట్స్, న్యూరోటాక్సిన్స్, అంతే కాకుండా ప్రోటీజెస్, ఎరెప్సిన్, కోలినెస్టరేజెస్ ఎంజైమ్స్ వుంటాయి.

డాక్టర్ అన్వేష్ వీటికి సంబంధించిన పరీక్షలు ఒకటి తరువాత మరొకటి చేసుకుంటూ పోతున్నాడు.

విచిత్రం! కొండయ్య రక్తంలో పామువిషానికి సంబంధించిన విష పదార్థాలు అధిక శాతంలో కనబడ్డాయి.

పురుగుల మందు తీసుకుని ప్రాణం తీసుకున్నాడనుకున్న కొండయ్య పాము కాటుకి గురై నిమిషాల్లో ప్రాణం కోల్పోయాడు.

రుక్మిణమ్మ తల్లి ఇక ఇప్పుడేమంటుందో!



## 12. పాతిపెట్టిన శవాన్ని ఎంత కాలానికి వెలికితీసినా మరణ రహస్యం బయటు పడవచ్చు!

చెల్లెలు ఉష మరణించిన తరువాత సుబేదార్ సుందర్ ఆ ఊరు ఇప్పుడే రావడం! కర్ కర్ మనే బూట్లు, మెలితిరిగిన మీసాలు చెప్పకనే చెబుతాయి అతనే సుబేదార్ సుందర్ అని.

సుందర్‌ని చూడగానే తల్లి గొల్లుమంది. తండ్రి దుఃఖాన్ని దిగమింగుకోవడం కోసం నోట్లో గుడ్డ కుక్కుకున్నాడు.

"సుందర్! నీ చెల్లి పోయిందిరా" అంది తల్లి రోదిస్తూ.

"ఎలా?"

"అత్తవారింటిలో ఫిట్స్ వచ్చాయి. ఒక రోజంతా స్మారకం లేదు మరునటి రోజు మనందరినీ వదిలేసి వెళ్ళి పోయింది" అంటూ తల్లి భోరున విలపించసాగింది.

ఉమ చనిపోయి మూడు నెలలైనా ఆ దుఃఖం తీరలేదు దుఃఖిస్తున్న తల్లి హృదయానికి సురేంద్ర హృదయం కూడా తోడైంది.

కొంతసేపు తరువాత_

"అమ్మా ఉమకి ఫిట్స్ రావడమేమిటి? ఫిట్స్‌తో పోవడమేమిటి? నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు సుందర్.

"పెళ్ళయిన దగ్గర నుంచి కట్నం, కానుకలు తగినన్ని మనం ఇవ్వలేదని అత్తగారు, అతను వేధిస్తూనేవున్నారు. పెళ్ళి నాడు ఇస్తామన్నాం గాని ఇవ్వడానికి మనదగ్గరేవి? ఇటు మనల్ని అడగలేక అక్కడ వాళ్ళకి సమాధానం చెప్పలేక పిల్ల ఎంతో సతమతమైపోయింది. అందువల్లనో, మరెందుకో కానీ అప్పుడప్పుడు అది ఫిట్స్ వచ్చి పడిపోవడం మొదలైది. చివరికి ఆ ఫిట్సే దాని ప్రాణం తీశాయి"

ఉమ మృత్యువుకి ఫిట్స్ కారణమని తల్లి తండ్రులు నమ్మినా సుబేదార్ సుందర్‌కి యిందులో ఏదో దుర్మార్గం

వుందని తోచింది.

"ఫిట్స్ కారణమంటే నేను ఒప్పుకోనమ్మా. ఇందులో ఏదో వుంది" అన్నాడు సుందర్ దృఢంగా.

"ఏదో వుండటమేమిటిరా? చూసిన పక్కింటివాళ్ళు కూడా చెప్పారు-ఫిట్స్ బాగా వచ్చాయని. అయితే రోజూ వచ్చే ఫిట్సే కదా అని డాక్టరుకి చూపించకుండా వదిలేశారు. దానితో నా కూతురు ప్రాణం పోయింది" అనిమళ్ళీ ఏడవడం మొదలు పెట్టింది.

"ఏడవకమ్మా! ఉష చావుకి కారణమెవరో నేను తెల్సుకుంటాను. అంతే కాదు- ఎందుకు చనిపోయిందో కూడా తెలుసుకుంటాను. పాతిపెట్టిన శవాన్ని బయటకు తీయవలసిందే. అసలు విషయమేమిటో తేల్చుకోవలసిందే" గర్జించాడు సుందర్.

"నీకేమైనా మతిపోయిందా? దాన్ని పాతి పెట్టేసి కూడా మూడు నెలలు అయింది. ఇక నువ్వు బయటకు లాగేందుకు అక్కడేముంటుంది?" అన్నాడు తండ్రి.

నిజమే మరి! శవాన్ని పాతి పెట్టేసిన మూడు నాలుగు రోజుల్లో బాక్టీరియా క్రిములు చేరి, గ్యాస్ తయారై ఒళ్ళంతా బాగా వుబ్బినట్లు అవుతుంది. అయితే వారం రోజుల్లో గ్యాస్ అంతాపోయి ఉబ్బిన శవం సన్నగా అయి పోతుంది. పదిహేను రోజుల్లో ఒంటి మీది చర్మం ఊడిపో తుంది. కండరాలు ఎక్కడకక్కడ కుళ్ళిపోతాయి. మూడు నుంచి ఆరు నెలల్లో కండంతాపోయి కేవలం అస్థిపంజరం ఏ

ఎముకకు ఆ ఎముక వేరు అయిపోయి కుప్పకూలిపోతుంది.

అయినా అవసరమైన మెడికో-లీగల్ కేసుల్లో పాతి పెట్టిన శవాన్ని తవ్వి తీయడం మామూలే. దానిని పోస్టు మార్టం చెయ్యడమూ సాధారణమైన విషయమే! ఈఅంశం మీద దేశదేశాల్లో రకరకాల నిబంధనలు వున్నాయి.

ఫ్రాన్సులో పది సంవత్సరాలు, జర్మనీలో 30 సంవత్సరాలలోపు ఎప్పుడైనా శవాన్ని వెలికి తియ్యవచ్చు. పోస్టుమార్టం చెయ్యవచ్చు.

ఇంగ్లండులోనూ, ఇండియాలోనూ 'ఇంత కాలంలోపే పాతి పెట్టిన శవాన్ని వెలికి తీయవచ్చు. తరువాత తీయకూడదు' అనే నియమం, నియమితకాలం లేదు. అవసరం అనుకుంటే ఎన్ని సంవత్సరాల తరువాయినా పాతిపెట్టిన శవాన్ని వెలికి తీయవచ్చు. శవం మట్టి అయిపోవచ్చు. ఎముకలు పొడి అయిపోవచ్చు. అయినా శవం కలిసిపోయిన మట్టి కొన్ని రకాల చార్యల విషయంలో అసలు రహస్యం బయట పెడుతుంది. అందుకే ఇండియాలో, ఇంగ్లండులో శవం వెలికి తీయడానికి కాలపరిమితి లేదు.

సుందర్ ఉద్దేశ్యంలో ఉషది సహజ మరణం కాదు. అత్త మామలో, స్వయానా భర్తో చంపేసి వ్యాధివల్ల చనిపోయినట్టు నాటకమాడారని అతని అనుమానం. అందుకనే వెంటనే పోలీసులకి కంప్లైంట్ ఇచ్చాడు. చెల్లెలి అత్తమామలమీద, భర్త సుందరయ్యమీద మర్డర్ కేసు పెట్టాడు. పాతిపెట్టిన శవాన్ని వెలికి తీయాలని, పోస్టుమార్టం చెయ్యా

లని మేజిస్ట్రేట్ ఆర్డరు వేశాడు.

మేజిస్ట్రేట్ ఆర్డరు డాక్టర్ అన్వేష్‌కి చేరింది. వెంటనే తన అసిస్టెంట్స్‌ని, పోలీసు ఆఫీసర్ని తీసుకుని స్మశానానికి వెళ్ళాడు. ఉమని ఎక్కడ పాతిపెట్టారో కాటికాపరి చూపించాడు. ఉమ తండ్రి కూడా అదే స్థలమని నిర్ధారించాడు.

శవాన్ని తవ్వడానికి ముందు డాక్టర్ అన్వేష్ ఆ స్థలానికి కాస్త దూరంగా కొంత మట్టిని తీసి సీసాలో భద్రపరిచాడు. పోలీసులు పురమాయించగా పనివాళ్ళు శవం పాతిపెట్టిన చోట తవ్వకం మొదలుపెట్టారు. రెండడుగుల లోతు తవ్వేసరికి దాదాపు అస్థిపంజరంగా మిగిలినశవం కనబడింది. అక్కడక్కడ కుళ్ళిన కండ కొంత మిగిలి వుంది.

మట్టి పనివాళ్ళు శవాన్ని గోతిలోనుంచి ఎత్తబోయారు.

"ఆగండి...ఆగండి" అంటూ డాక్టర్ అన్వేష్ గోతిలోకి కాస్తవంగి శవంమీద మట్టిని నాలుగు గుప్పెళ్ళు తీసుకుని మరో సీసాలో భద్రపరిచాడు. "ఊఁ, ఇక బయటకు తీయండి" అన్నాడు.

పనివాళ్ళు అలాగే బయటకు తీశారు. డాక్టర్ అన్వేష్ శవానికి అడుగున వున్న మట్టిని కూడా మరో నాలుగు గుప్పిళ్లు తీసి రెండవ సీసాలోనే పోశాడు. పాతిపెట్టిన గోతిని నిశితంగా పరిశీలించాడు. శవం వేళ్ళ నుంచి ఊడిపోయిన గోళ్ళని, తల నుంచి వేరైన వెంట్రుకల్ని గోతిలో నుంచి ఏరి వేరువేరుగా భద్రపరిచాడు.

బయటికి తీసిన శవాన్ని పోస్టుమార్టం చేయడానికి

ఏముంది అని ఒకరి మొఖాలు మరొకరు చూసుకున్నారు. ఉమ బంధువులు 'సుందర్‌కి పిచ్చి కాకపోతే మరేమిటి - పాతేసిన శవాన్ని మూడు నెలల తరువాత వెలికి తీసి ఏం తెలుసుకుందామనుకున్నాడు?' అని కూడా అనుకున్నారు.

డాక్టర్ అన్వేష్ కూడా అలాగే నిర్ణయించి శవాన్ని మళ్ళీ గోతిలో కప్పేయమంటాడని వాళ్ళ ఉద్దేశ్యం.

కానీ డాక్టర్ అన్వేష్ ఏకదీక్షగా అస్థిపంజరం ఎముకలన్నిటినీ శ్రద్ధగా పరిశీలించసాగాడు.

కాళ్ళ ఎముకలు, చేతి ఎముకలు అన్నీ చక్కగానే వున్నాయి. పక్క టెముకలు చూశాడు. అవి కూడా ఏ మాత్రం విరగకుండా వున్నాయి. ఎందుకంటే ఒక్కొక్క సారి ఛాతీలో ఎవరైనా గుద్దితే పక్కటెముకలు విరిగి గుండెలో, ఊపిరితిత్తుల్లో గుచ్చుకుని ప్రాణం పోవచ్చు. అలాంటి చిహ్నాలేవీ కనబడలేదు.

తలమీద బలంగా బాదితే తల పగిలి మరణించిందేమో చూశాడు. పుర్రెలో కూడా ఏ మాత్రం పగులు లేకుండా వుంది.

అయితే ఉమది సహజ మరణమేనా ?

కేవలం ఫిట్సువల్లే పోయిందా ?

ఎందుకో డాక్టర్ అన్వేష్‌కి ఒప్పుకో బుద్ధికాలేదు. 'ఉమకి చివరిగా వచ్చిన ఫిట్సు తలకి దెబ్బ తగలడం వల్ల ఎందుకు కాకూడదు ?' అని అనిపించింది.

అవును! తల మీద గట్టిగా బాదినా ఫిట్సులాగా

గావచ్చు. తలకి దెబ్బ తలిగినప్పుడు పుర్రె ఎముక పగలక పోవచ్చు. కాని ఆ దెబ్బకి పుర్రె లోపల వుండే మెదడు పైని రక్తనాళాలు పగిలిపోయి రక్తం చిమ్ముతుంది. అలా చిమ్మిన రక్తం గూడుగా కట్టి మెదడులో కొంత భాగాన్ని నొక్కి వేస్తుంది. మెదడు అలా నొక్కి వేయడం వల్ల అప స్మారక స్థితి ఏర్పడడం, ఫిట్సులాగా రావడం, నిదానంగా మెదడు పని మానివేసి ప్రాణం పోవడం జరుగుతుంది. దెబ్బ తగిలిన గంట నుంచి ఒకటి-రెండు రోజుల్లో ఎప్పుడైనా ప్రాణం పోవచ్చు.

పోస్టుమార్టంచేస్తున్న డాక్టర్ అన్వేష్‌కి మెరుపులాగా మెరిసిన ఈఆలోచన మరణరహస్యంలో ఒక ఊపునిచ్చింది. వెంటనే సన్నని రంపం తీసుకుని పుర్రెని గుండ్రంగా కోసి (కొబ్బరికాయని మధ్యకి పగల కొట్టినట్టు) పై డిప్పను వేరు చేశాడు.

పుర్రె లోపల మెదడు ఎప్పుడో నీరైపోయి కారి పోయింది. అందుచేత అక్కడ చూసేందుకు ఏమీ లేదు.

కాని డాక్టర్ అన్వేష్‌కి కావలసినది కనబడింది. మరణరహస్యాన్ని కనిపెట్టాననే సంతోషంవల్ల మెరిసేకళ్ళతో "ఇది సాధారణమైన మరణం కాదు. ఇది హత్యే. పచ్చడి బండతోనో, బరువైన ఆయుధంచేతో తలపై బాధడంవల్ల మరణం సంభవించింది" అన్నాడు.

"ఎలా తెలిసింది ?" అన్నాడు పోలీసు ఆఫీసరు అత్యంత ఆసక్తిగా.

చూడండి. పుర్రె లోపల ఈ భాగంలో రక్తంమరక ఎలా పట్టేసి వుందో. మరణించి మూడు నెలలైనా ఈ రక్తం మరిక చెరగలేదు" అని డాక్టర్ అన్వేష్ నీళ్ళు పోసి రక్తం మరకని కడిగాడు. అయినా వదలలేదు. "ఇది తప్ప కుండా ప్రాణం పోక ముందు రక్తం కారిన మచ్చే" అని నిర్ధారణగా చెప్పాడు. "ఎందుకంటే ఇటువంటి రక్తం మర కలు శవాన్ని పాతిపెట్టేసి ఎన్ని నెలలైనా పోవు"



డాక్టర్ అన్వేష్‌కి కావలసిన క్లూ దొరికింది. పోలీసు ఆఫీసర్‌కి కావలసిన సమాచారం దొరికింది. సుందర్ చెల్లెలి మరణానికి కారణమైన వారి మీద కఠిన చర్య తీసుకోవా లన్నాడు. కేసు కదిలింది.



డాక్టర్ అన్వేష్ శవం మళ్ళీ పాతి పెట్టించి తిన్నగా ఫోరెన్సిక్ లేబొరేటరీలోకి వెళ్ళాడు. తాను తీసిన మట్టి శాంపిల్స్‌ని ఆర్సెనిక్, ఇతర మెటాలిక్ పాయిజన్స్ కోసం పరీక్ష చేశాడు ఆర్సెనిక్ విషం వంటివి ఇచ్చి చంపినట్లయితే శవం మట్టిగా మారిపోయినా ఆ మట్టిని పరీక్షచేస్తే అందులో ఆర్సెనిక్ విషం ఎక్కువ శాతంలో కనబడుతుంది. ఎవరైనా మామూలుగానే ఆ మట్టిలో ఆర్సెనిక్ శాతం ఎక్కువ అని వాదించకుండా వుండడానికే శవాన్ని పాతిపెట్టిన గోతికి దూరంగా వుండే మట్టిని కూడా పరీక్షచేసి ఏ మట్టిలో ఎంత వున్నదీ తేడా నిర్ధారణ చేసి చెప్పడం జరుగుతుంది. ఆర్సెనిక్

విషం వల్ల చావు అయితే శవం వెంట్రుకలు గోళ్ళని పరీక్ష చేసినా తెలిసిపోతుంది.

డాక్టర్ అన్వేష్‌కి మట్టి పరీక్షలో గోళ్ళలో ఏమీ లేదా కనబడలేదు కనబడవలసిందంతా పుర్రె లోపల కన బడింది. కట్నం చావుని ఫిట్స్ చావుగా చిత్రీకరించాలను కున్న వారి చేతులకి బేడీలు పడ్డాయి.

## 13. పుర్రె సూపర్ ఇంపోజిషన్‌తో దొరికే క్లూ

శోభనం రాత్రి సౌమ్య సిగ్గుల మొగ్గవుతూ గదిలోకి అడుగు పెట్టింది. శంకరం ఎంతో ప్రేమతో సౌమ్యని దగ్గరకి తీసుకున్నాడు.

వెచ్చని కౌగిలిలో కరిగిపోయిన సౌమ్య ఎప్పుడు నిద్ర పోయిందో తెలియదు కాని తెల్లవారిన తరువాత ఉదయ భాను నునులే వెచ్చని కిరణాలు తాకడంతో ఒక్కసారిగా లేచి కూర్చుంది.

కళ్ళు నలుముకుని గదిలో ఇటు అటు చూసింది. అంతా అయోమయంగా అనిపించింది.

ఇంటిలో నుంచి వున్న గది తలుపు వేసే వుంది. వీధి వైపు వున్న తలుపు గడియ తీసి వుంది. తలుపు దగ్గరకేసి వుంది. కొత్త పెళ్ళికొడుకు శంకరం గదిలో లేడు.

శంకరం ఏమైనట్టు? ఎందుకు బయటకు వెళ్ళినట్టు?

వెంటనే అమ్మా, నాన్న దగ్గరికి పరుగు తీసింది. ఆమె కంగారుచూసి వాళ్ళకి కంగారు వేసింది.

అల్లుడుగారు అదృశ్యం అవడం ఆశ్చర్యంగా వుంది.

గంటలు గడిచాయి... రాత్రి కూడా అయిపోయింది ...అల్లుడుగారు ఇంటికి రాలేదు.

సౌమ్య మనసులో ఏదో కీడుశంకిస్తోంది. కబురు అందుకుని గాభరాపడుతూ అత్తగారు, మామగారువచ్చారు. అటు వాళ్ళు, ఇటు వైపు వాళ్ళు కలసి వెతికి వేసారిపోయారు.

రోజులు గడిచిపోయాయి. నెలలు మారిపోయాయి. శంకరం అదృశ్యం అంతుపట్టని మిస్టరీ అయిపోయింది. పోలీసు కంప్లెంట్ ఇచ్చారు పేపర్లో ఫోటోలు వేశారు. అయినా ఫలితం లేకపోయింది.

ఆరు నెలలు గడిచిన తరువాత...

ఊరి అవతల ఓ పొలం తవ్వుతూ వుండగా కొన్ని ఎముకలుదొరికాయి. దూరంగా మరో చోట పుర్రె దొరికింది.

అవన్నీ ఒక వ్యక్తివేనా?

అయితే కావచ్చు, అది వేరే విషయం.

కాని అవి శంకరంవి కాదు కదా! శంకరం కనబడకపోతే మాత్రం, శవంగా మారాడంటే నమ్మడానికి ఎవరికీ మనస్సు ఒప్పుకోవడంలేదు. శంకరం తిరిగివస్తాడని సౌమ్య కళ్ళల్లో ఒత్తులు పెట్టుకుని చూస్తోంది.

అఘమేఘాల మీద పోలీసు అధికారులు రంగంలోకి వచ్చారు. కుప్పగా దొరికిన ఎముకల్ని వేరుగా దొరికిన

పుర్రెని పరీక్ష నిమిత్తం ఫోరెన్సిక్ మెడిసిన్ ప్రొఫెసర్ డాక్టర్ అన్వేష్ దగ్గరికి పంపారు.

ఆ ఎముకల్ని డాక్టర్ అన్వేష్ శ్రద్ధగా పరీక్షచేశాడు. అవి మనిషివే అని నిర్ధారణ చేశాడు.

కుప్పగా తయారైన ఎముకలనుంచి ఆ మరణం హత్యో కాదో చెప్పడం కష్టం. అయినా ఆర్సెనిక్ వంటి విషం వల్ల మరణం సంభవించిందేమో తెలుసుకోవడానికి ఎముకల పొడిని కెమికల్ ఎగ్జామినేషన్ చేశారు. అందులో అటు వంటి మెటాలిక్ పాయిజన్ వున్నట్టు తేలలేదు. అయితే ఇక తెలుసుకోవసిందల్లా ఆ పుర్రె, జాడ తెలియకుండా పోయిన శంకరందేనా ?

మిగిలింది పుర్రె ఒక్కటే. అదీకాక పుర్రెలన్నీ దాదాపు ఒకేలా వుంటాయి. అటువంటప్పుడు ఈ పుర్రె ఫలానా వ్యక్తిదే అని నిర్ధారించడం డాక్టర్ అన్వేష్‌కి పెద్ద పరీక్ష !

కొంతకాలంకిందట ఇటువంటిపరీక్షే డాక్టర్ అన్వేష్‌కి ఎదురైంది. చివరికి వాడు అనుకున్న వ్యక్తిది కాదని తన పరీక్షలో తేలిపోయింది. తాను ఎంతో జాగ్రత్తగా పరీక్షించి చెప్పబట్టి సరిపోయింది. లేకపోతే పోస్టుమార్టం నిపుణుడుగా చాలా చిక్కుల్లో ఇరుక్కునేవాడే. ఎందుకంటే చనిపోయా డనుకున్న వ్యక్తి రెండు సంవత్సరాల తరువాత సజీవంగా తిరిగివచ్చాడు.

అందుకే శంకరం కేసు డాక్టర్ అన్వేష్‌కి మరో

సవాలు అయింది. తన పరిశోధనకు అదృశానికి ముందు శంకరం తీయించుకున్న ఫోటో అతనికి అవసరమైనది. పెళ్ళి ఫోటోల్లోంచి ఒక క్లోజ్ అప్‌ని ఎంచి పోలీసులు డాక్టర్ అన్వేష్‌కి ఇచ్చారు. దానితో అన్వేష్ పని ప్రారంభించాడు.

ఆ ఫోటోకి మరో ఫోటో తీసి నెగటివ్ తయారు చేశాడు.

అలాగే శంకరానిది కావచ్చునని పోలీసులు ఇచ్చిన పుర్రె, దాని కింద వుండే దవడ ఎముకని జాగ్రత్తగా సరి చేసిపెట్టి పుర్రెని మరొక ఫోటో తీశాడు.

పుర్రెకు తీసిన ఫోటోని కరెక్టుగా అదే సైజుకి ఎన్లార్జ్ చేశాడు. ఇలా ఎన్లార్జ్ చేసినప్పుడు రెండు కళ్ళ గుంటల మధ్య దూరం ఈ చివర నుంచి ఆ చివర వరకు ఎంత వుందో కొలిచి చూశాడు ఎందుకు అలా కొలిచి చూడడం జరిగిం దంటే పుర్రెకి, ఫొటోకి ఆ కొలత సరిగ్గా సరిపోయినప్పుడే అది సరియైన లైఫ్ సైజు లేదా ! : ! సైజు అంటారు. పుర్రెకు సంబంధించిన ఫోటో నెగిటివ్‌ని సరిగ్గా అదే సైజుకి (లైఫ్‌సైజుకి) ఎన్లార్జ్ చేయగా, అదేసైజ్‌కి శంకరంఒరిజినల్ ఫొటోని కూడా (అతని తల మట్టుకు) లైఫ్‌సైజుకి ఎన్లార్జ్ చేశాడు. తరువాత పుర్రె నెగిటివ్‌ని, శంకరం ఫోటో నెగి టివ్‌ని రెంటింటిని సూపర్ ఇంపోజ్ చేసి ఒక ఫోటో తీశాడు.

ఆశ్చర్యం!!

పుర్రె నెగిటివ్ మీాద శంకరం ఫోటో నెగిటివ్ సూపర్ ఇంపోజ్ చేయటంతో కరెక్టుగా కలిసిపోయింది.

పుర్రె ముఖంలో శంకరం సహజ లక్షణాలన్నీ చక్కగా ఇమిడిపోయి రెండూ ఒకటేలాగా అయిపోయాయి.

అయినా డాక్టర్ అన్వేష్ తొందరపడి నిర్ణయానికి వచ్చేయలేదు. కళ్ళకి సంబంధించిన ఎముకల గుంటల్లో కంటిగ్రుడ్లు రెండూ సహజంగానే కనబడుతున్నాయో లేదో చూశాడు. ఒరిజినల్ ఫోటోలో లాగానే ఈ సూపర్ ఇంపోజ్ చేసినా దానిలో కూడా సరిగ్గా అలాగే కనబడ్డాయి. ముక్కు పొజిషన్ కూడా అలాగే వుంది. ముక్కు ఎత్తుపల్లాలు కూడా చక్కగా సరిపోయాయి. ముక్కు షేప్ కూడా అచ్చం ఒరిజినల్ ఫోటోలో లాగా వుంది. పుర్రె లోని ముక్కు ఎముకల నిర్మాణం ఏ మాత్రం తేడా వున్నా ముక్కు షేప్ అలారాదు సూపర్ ఇంపోజ్ చేసిన దానిలో నోరు చూశాడు.

పై పెదవులు చూశాడు, చక్కగా సరిపోయాయి. క్రింది దవడ కూడా సరిపోయింది. క్రింది దవడ ఎముక ఏ మాత్రం కలవక పోయినా ముఖం షేప్ లో తేడా వచ్చేస్తుంది. ఇటువంటప్పుడు సూపర్ ఇంపోజిషన్ లో తేడా కనబడిందని తేల్చి వేయడమవుతుంది.

కాని డాక్టర్ అన్వేష్ అన్వేషణలో సూపర్ ఇంపోజిషన్ పద్ధతికి శంకరం ఒరిజినల్ ఫోటోతో దొరికిన పుర్రె సరిపోవడంతో అది శంకరందే అవడానికి హెచ్చు అవకాశాలు వున్నాయని తన అభిప్రాయం వెల్లడించాడు.

అన్నీ కలిసినప్పుడు శంకరందే ఆ పుర్రె అని సెంట్

పర్సెంట్ నిర్ధారణతో ఎందుకు ఎక్స్పర్ట్ ఒపీనియన్ ఇవ్వ లేదని బంధువులు కాస్త ఆశ్చర్యపోయారు.

అయితే అప్పుడప్పుడు సూపర్ ఇంపోజిషన్ ఇతర పుర్రెలతో కూడా సరిపోవచ్చు.

ఏది ఏమైనా శంకరం మరణం ఒక మిస్టరీగా మిగిలి పోయింది. అంత మంచివాడు అలా ఎందుకని హత్య చేయ బడ్డాడో సౌమ్యకిగాని, ఇతరులకి గాని అంతుపట్టని విషయమే!



## 14. ఒక్క వెంట్రుక చాలు – వ్యక్తి ఎవరైనదీ చెప్పడానికి !

సుజాత ఎండ్రిన్ తాగి ప్రాణం తీసుకుంది ఆ గదిలో ఆమె ఒక్కర్తే వుంది. పక్కనే సగం ఖాళీ అయిన ఎండ్రిన్ డబ్బా వుంది.

నోటిలో నుంచి ఎండ్రిన కారుతూ వాసన వేస్తోంది. ఎండ్రిన తాగుతున్నప్పుడు ఒలికి వుంటుంది. అందుకనే చీర మీద, రవిక మీద కూడా ఎండ్రిన్ పడివుంది.

ఇంకా పెళ్ళయినా కాని సుజాత ఇలాంటిపని ఎందుకు చేసిందో అని చూసిన వాళ్ళందరికీ బాధ కలిగింది

సుజాతకి కొందరు బాయ్ ఫ్రెండ్స్ కూడా వున్నారు. "ఏదో కాలు జారి వుంటుంది. కడుపు వచ్చి వుంటుంది. దానితో ఆ కుర్రవాడు కనబడకుండా జారుకుని వుంటాడు.

ఇక వేరే గత్యంతరం లేక ప్రాణం తీసుకునివుంటుంది." ఇలా తలొకరు తలొకటి అనుకోసాగారు. పైగా అమ్మా-నాన్నల మధ్య సంబంధం కూడా అంతంతే. అటువంటి కుటుంబంలో పిల్ల గురించి జనం తేలికగా మాట్లాడడం మామూలే!

శవాన్ని పోస్టుమార్టం కోసం పంపారు. సాధారణంగా పాయిజనింగ్ కేసులు, అందులోనూ ఎండ్రిన్ వల్ల చావులు పోస్టుమార్టం చేయటం చాలా తేలిక. మరణ రహస్యం పైకి తెలిసిపోతూనే వుంటుంది. ఏదో పోస్టుమార్టం చేయాలి కనుక చేయడం తప్ప, ఇంకేమీ వుండ దనిపిస్తుంది.

అటువంటి భావనతోనే డాక్టర్ అన్వేష్ పోస్టుమార్టం మొదలుపెట్టాడు. కాని ఆదిలోనే హంస పాదు అన్నట్టు అయిపోయింది. డాక్టర్ అన్వేష్ మరొకసారి శవంగా మారిన సుజాత ముఖంలోకి తేరిపార చూశాడు నోటిలో నుంచి ఎండ్రిన్ కారుతుంది. కాని ఆ ఎండ్రిన్‌తో పాటు రక్తంతో కలిసిన చొంగకూడా వుండాలి. అదేమీ ఇక్కడ రావడం లేదు.

కళ్ళల్లోకి చూశాడు. మామూలుగానే వున్నాయి. విష ఫలితంగా కళ్ళల్లో వచ్చే ఎటువంటి మార్పూ కానరా లేదు.

సాధారణంగా ఎండ్రిన్ వల్ల చావుఅయితే, కళ్ళల్లో ఎర్రజీరలు ఏర్పడతాయి. కంటి పాపలు చాలా పెద్దవి అవుతాయి. అటువంటి బాహ్య లక్షణాలు సుజాత శవంలో కన బడలేదు.

ఈ నెగిటివ్ పాయింట్సుని జాగ్రత్తగా నోట్ చేశాడు.

సాధారణంగా ఎండ్రిన్ తీసుకున్నప్పుడు మెదడులో శ్వాసకేంద్రం దెబ్బతిని ఊపిరితీసుకోవడం కుదరక ప్రాణం పోవడం జరుగుతుంది. ముఖ్యంగా ఎండ్రిన్ న్యూరోటాక్సిక్ నాడీ మండలాన్ని ధ్వంసం చేసే విషం.

జాగ్రత్తగా ఛాతీ కోసి చూశాడు. ముఖ్యంగా శ్వాస కోశాల్ని, శాస వెళ్ళేగొట్టాల్ని జాగ్రత్తగా పరిశీలించాడు. ఎండ్రిన్ పాయిజనింగ్‌లో శ్వాసకోశాలకి గాలి తీసుకువెళ్ళే గొట్టాలలోపల పొరల్లో ఎర్రని వాపు వుంటుంది. అంతే కాదు-వాటిల్లో రక్తంతో కూడిన జిగురు పదార్థం వుంటుంది శ్వాసకోశాలు కూడా వుబ్బి వుంటాయి. వాటిల్లో కొంత నీరు కూడా చేరుతుంది.

శ్వాసకోశాల్ని కోసి చూస్తున్న డాక్టర్ అన్వేష్‌కి అటువంటివేమీ కనబడలేదు.

కడుపుకోసి చూశాడు. ఎండ్రిన్ తాగినప్పుడు మండి పోయి అన్నవాహిక ఎర్రగా అయిపోతుంది. జీర్ణకోశం, పేగులోపల ఎర్రగా అవడం, లోపలి పొరలు ఉబ్బడం వుంటాయి. అంతేకాదు జీర్ణకోశం లోపలి పదార్థాలు ఎండ్రిన్‌తో కలిసిపోయి కిరోసిన్ వాసన కలిగిస్తాయి.

కడుపు కోసిన డాక్టర్ అన్వేష్‌కి అటువంటి లక్షణాలేవి కనబడలేదు. అయినా కెమికల్ ఎనాలిసిస్ కోసం జీర్ణాశ

యాన్ని, అందులోని భాగాల్ని ప్రత్యేకంగా తీసివేశేసీసాలో భద్రపరిచాడు.

లివర్ ని చూశాడు. అదిమ్మాత్రం ఎర్రబడివుంది. అంతే కాదుకాస్త చితికి వుంది. లివర్ నుండి కొంత రక్తం కారి కడుపులో కూడా చేరివుంది. ఎండ్రిన్ తీసుకున్నప్పుడు లివర్, మూత్రపిండాలు, మెదడు ఎర్రబడడం, కాస్త వుబ్బడం మామూలే. కానీ లివర్ చితికివుండడం డాక్టర్ అన్వేష్ కి ఆశ్చర్యం కలిగించింది. సుజాత మరణంలో ఏదో మిస్టరీ వుందనిపించింది.

కెమికల్ ఎనాలిసిస్ కోసం తీసిన జీర్ణాశయం, పదార్థాలను లేబరేటరీలో పరీక్ష చేశాడు.

డాక్టర్ అన్వేష్ కి అందులో ఎండ్రిన్ గాని, మరో విషపదార్థంగాని కనబడలేదు.

ఎండ్రిన్ చావు అనుకున్న సుజాత చావు ఇక్కడే కొత్తమలుపు తిరిగింది.

ఎవరో పొట్టలో గట్టిగా తన్నినట్టు వున్నాడు. దానితో లివర్ పగిలి షాక్ కలిగి వుంటుంది. అయితే అటువంటి అనుమానానికి ఆస్కారం ఇవ్వకుండా వుండడానికిచనిపోయిన సుజాత నోటిలోను, ఒంటి మీదా ఎండ్రిన్ పోసి ఆత్మహత్యగా మభ్యపెట్టాలని ఆ దుర్మార్గుడెవడో ప్లాన్ వేసాడు.

ఈ ఆలోచన రావడంతోనే డాక్టర్ అన్వేష్ హంతకునికి సంబంధించిన క్లూ కోసం నిశితంగా చూసాడు.

అనుకోకుండా సుజాత గోళ్ళసందుల రెండు మూడు

వెంట్రుకలు కనబడ్డాయి. మరణం సమయానికి ఆమె కట్టుకుని వున్న చీర మీద కూడా ఒకటి రెండు వెంట్రుకలు కనబడ్డాయి. బహుశ ఆమె చావుకి ముందు హంతకుడితో పెనుగులాడి వుంటుంది. ఏమైనా వాటిని చూసి డాక్టర్ అన్వేష్ హంతకుడు దొరికినంత ఆనందపడిపోయాడు. ఎందుకంటే ఒక్క వెంట్రుక దొరికినా చాలు, దాని ద్వారా బ్లడ్ గ్రూప్ అతి తేలికగా తెలుసుకోవచ్చు.

వెంట్రుక పొడవు మూడు నాలుగు అంగుళాలు వుంది దానిని బట్టి అది మగవాడిదేనని తేలిపోతుంది.

వెంటనే దొరికిన వెంట్రుకల్లో ఒక దానిని లేబరేటరీలో పరీక్ష చేశాడు. నేరస్తుడిగా భావిస్తున్న వ్యక్తి బ్లడ్ గ్రూప్‌కి సంబంధించిన పూర్తి వివరాలు తెలిసి పోయాయి.

అంతే. క్షణాల్లో పోలీసులు రంగంలోకి దిగి సుజాత బాయ్ ఫ్రెండ్స్‌ని వెదికి పట్టుకున్నారు. వెంట్రుక పరీక్ష ద్వారా బయట పడిన బ్లడ్ గ్రూప్ తాలూకు వ్యక్తిని ప్రత్యేకంగా గుర్తించారు అంతే! అతను తాను చేసిన ఘోర నేరాన్ని అంగీకరించడం, చేతికి ఇట్టే బేడీలు పడిపోవడం జరిగిపోయాయి.

రక్తం పరీక్ష చేస్తే బ్లడ్ గ్రూప్ తెలుస్తుందని అందరికి తెలుసు కాని శరీరం మీద ఎక్కడి వెంట్రుకలు తీసి ఫోరెన్సిక్ లేబరేటరీలో పరీక్ష చేసినా దాని తాలూకు మనిషి బ్లడ్ గ్రూప్ తెలిసి పోతుంది.



## 15. మందులు, పెట్టుడు మందుల గుట్టు రట్టు !

మొన్నటి దాకా బాగానే ఉన్న మురహరిరావుకి అనుకోకుండా అనారోగ్యం కలిగింది.

మొదట కడుపులో మంటగా మొదలై నిదానంగా వికారం, వాంతులు తయారయినాయి. నీళ్ళ విరోచనాలు కూడా అవుతున్నాయి. వీటికోసం ఏవేవో మందులు వాడి నాడు కాని - పెద్దగా ఫలితం కనబడలేదు.

నాలికంతా పూసినట్లు తయారైంది. నోటినిండా పుండ్లు వచ్చాయి. దానితో ముద్దమింగాలంటే ప్రాణంమీదకి వస్తోంది. ఆ బాధతో కళ్ళవెంట నీళ్ళు రావడమే కాదు, నోటివెంట కారడం కూడా ఎక్కువైంది.

ఛాతీ మధ్య బ్రెస్టబోనని వేలు పెట్టి నొక్కితే చాలు ప్రాణం ఎగిరి పోయేటంత సలపరం కలుగుతూంది.

కొద్దిపాటిగా జ్వరం కూడా వస్తోంది.

ఒంటి మీద అక్కడక్కడ ఊదా రంగు మచ్చలు కనబడుతున్నాయి. ఎండలోకి వెడితే చర్మం ఇట్టే కందిపో తూంది. ఎండతగిలిన మేరంతా చర్మం ఊదా రంగులో మారుతూంది. ఒళ్ళుకూడా దురద పుడుతుయుంది.

మురహరిరావుకి ఎందుకిలా జరుగుతూందో అంతుపట్ట లేదు. వీటి కోసం మందులైతే వాడు తున్నాడు గాని తాత్కాలిక ఉపశాంతేదో కలుగుతుందే తప్ప పూర్తిగా తగ్గడంలేదు.

దీనితో మురహరిరావుకి ఎవరో మందు పెట్టారని అను అనుమానం కలిగింది. మురహరిరావు భార్యకి ఆ అనుమానం మరింత ఎక్కువైంది. తన భర్తకి కొందరి ఆడవాళ్ళతో సంబంధం లేకపోలేదు. ఎవర్తో తన కొంగున ముడివేసుకోవడం కోసం మందుపెట్టి వుంటుందని భావించింది.

ఆ బాధ గట్టిగా మనస్సులో మెదలగానే మురహరి రావు భార్య తన సవతులకు శాపనార్థాలు పెడుతూ గగ్గోలు పెట్టింది.

మురహరిరావుని మందు కక్కించే కనకయ్య దగ్గరికి తీసుకుని పోయింది. అసలే కక్కులున్న వానిచేత కనకయ్య మరింత కక్కించాడు.

కనకయ్య ఏం గారడీ చేశాడో, "ఇదిగో గారిముక్క ఇందులో ఎవరో మందు పెట్టారు, అందుకే అరగకుండా ఇంతకాలం కడుపులో ఉండిపోయిం"దన్నాడు

గారె ముక్కని కనకయ్య చూపించడంతో మురహరి రావు, అతని భార్య మనస్సు కొంత కుదుటపడింది

కాని ఏం లాభం వికారం, వాంతులు, విరోచనాలు మళ్ళీ మామూలే.

మురహరి భార్య మళ్ళీ మరొకని చేత మందుకక్కించే పని చేసింది. అతను ఈసారి మాంసం ముక్క చూపించి ఇదిగో ఇందులో మందుపెట్టారు అన్నాడు.

మందు కక్కించడం అనేది ఒట్టి అబద్ధం, మోసం కనుక నిజంగానే అనారోగ్యం వున్న మరహరిరావుకి ఆ

బాధలు ఎలా తగ్గుతాయి ?

చివరికి మురహరిరావు డాక్టర్ దగ్గరికి వెళ్ళాడు. డాక్టర రక్తం పరీక్ష చేశాడు. మురహరిరావుకి రక్తబల హీనత బాగా ఏర్పడింది. రక్తంలో తెల్లకణాలు చాలావరకు తగ్గిపోయాయి. తెల్లకణాలు బాగా తగ్గిపోవడం, రక్తహీనత ఏర్పడటం ప్రమాద చిహ్నాలు కదా.

డాక్టరు మురహరిరావు మూత్రం కూడా పరీక్ష చేశాడు. ఆల్బుమిన్ విపరీతంగా ఉంది. మూత్రంతో పాటు ఎర్రకణాలు కూడా పోతున్నాయి.

మురహరిరావు గురించి డాక్టరుకి ఏదో అనుమానం కలిగింది. ఇంకా ఏవో పరీక్షలు చేసి చేయవలసిన చికిత్స చేద్దాం అనుకున్నాడు.

కానీ ఇంతలోనే మురహరిరావు ప్రాణం పోయింది. తన భర్తకి మందుపెట్టి ఎవరో ప్రాణం తీశారని గగ్గోలు పెట్టింది.

మురహరిరావు మరణం అనుమానాస్పద మరణం కావడంతో శవాన్ని పోస్టుమార్టం కోసం పంపడమైంది

చేతబడి, మందుకక్కించడాలు ఒట్టి మూఢనమ్మకాలు అయినా అటువంటి కేసుల్లో మరణానికి అసలైన కారణం కనుక్కోవాలి శాస్త్రీయంగా అసలు కారణాన్ని ఋజువు చేసి చెప్పాల్సిన బాధ్యత పోస్టుమార్టం చేసిన డాక్టరు మీద వుంది.

మురహరిరావుని పోస్టుమార్టం చేయబోతున్న డాక్టర్

అన్వేష్ ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకోకపోలేదు.

డాక్టర్ అన్వేష్‌కి మురహరిరావు పెదవులు, నాలిక, పళ్ళు, దవడలోపల చర్మం నీలం, ఊదారంగుల్లో ఉండటం కనబడింది.

మురహరిరావు పోస్టుమార్టం మొదలైంది. పై నుంచి క్రిందిదాకా డాక్టర్ అన్వేష్ కోసి చూశాడు.

జీర్ణాశయం, తక్కువ ప్రేగు వాచి ఉంది. మెదడు లోనూ, శరీరంలోని ఇతర భాగాల్లోనూ చిన్న చిన్న రక్త నాళాలు పగిలి ఉన్నాయి.

మూత్ర పిండాలు బాగా దెబ్బతిని ఉన్నాయి. లివర్ కూడా పాడై కనబడింది.

మరణానికి ముందు మురహరిరావులో కలిగిన అనారోగ్య లక్షణాలు, పోస్టుమార్టంలో కనబడిన మార్పులుబట్టి బంగారం భస్మాన్ని తీసుకోవడం వల్ల దుష్ఫలితాలు కలిగి ప్రాణం పోయినట్లు అనిపిస్తోంది.

డాక్టర్ అన్వేష్ తన సర్వీసులో ఇటువంటి కేసులు చూడకపోలేదు. ఓ 60 సంవత్సరాల వ్యక్తి క్షయవ్యాధికి చికిత్స కోసం బంగారం పొడి కలిపిన భస్మాన్ని తీసుకున్నాడు. అతనికి ఇతరత్రా ఏ దుష్ఫలితాలు కనబడలేదుగాని ఆ భస్మం తీసుకున్న కొద్దినెలలకి రక్తహీనత ఏర్పడి తెల్లకణాలు దెబ్బతినిపోయి ప్రాణం పోయింది.

మరొక వ్యక్తి మంచిసెక్సుసామర్థ్యం వస్తుందని మంచి తేజస్సు వస్తుందని, ఒంటికి బంగారం వర్ణం వస్తుందని బంగారం

పొడి కలిపిన భస్మం తీసుకుని ప్రాణం మీదకి తెచ్చుకున్నాడు. మురహరిరావులో లాగానే అతనిలో కూడా పెదవులు చిగుళ్ళు, పళ్ళు, నాలిక ఊదా రంగులో మారిపోయాయి. వికారం, వాంతులు వంటివి కలిగాయి. చివరికి బంగారం భస్మం అతని మూత్రపిండాలని, లివర్‌ని పూర్తిగా పాడు చేసి ప్రాణం తీసింది.

బంగారం పొడికి సంబధించిన సోడియం ఆరోథయో సల్ఫేట్, గోల్డ్ అండ్ సోడియం క్లోరయిడ్ వంటివి ఎటు వంటి వాసనా లేకుండా తీయని రుచిలోనో, మరో రుచి లోనో పొడి రూపంలో, పంచదార ఆకారంలో లభ్యమవు తాయి. బంగారం తీసుకుంటే చర్మం మంచి రంగు వస్తుందనో కండ పుష్టి ఎముక పుష్టి కలుగుతుందనో కొందరు వీటిని సేవిస్తారు. వీటివల్ల ఫలితం కలగడం ఎలా ఉంటుందో తెలి యదుగాని కొందరికి కొంతకాలానికి దుష్ఫలితాలు కనబడ తాయి. అందులోనూ శాస్త్రీయంగా మందులు తయారీ కాకుండా మామూలుగా తయారుచేసి ఇచ్చే బంగారు భస్మాలు ఎన్నో భయంకరమైన పరిమాణాలు కలిగిస్తాయి. డాక్టర్ అన్వేష్ మురహరిరావు మూత్ర పిండాలని, ఇతర టిస్యూలని గోల్డ్ (బంగారం) ఇతర మెటాలిక్ పాయిజన్స్ కోసం కెమికల్ ఎనాలసిస్ (రసాయనిక పరీక్ష) చేసి చూశాడు.

విచిత్రం అందులో ఎక్కువ శాతంలో బంగారం మెటల్ కనబడింది.

తరువాత స్పెక్ట్రోస్కోపిక్ ఎగ్జామినేషన్ చేశాడు. ఈ పరీక్షలో బంగారానికి సంబంధించిన ప్రత్యేక వేవ్ లెంగ్త్ ప్రత్యేక కలర్ లో కనబడింది.

దానిలో మురహరిరావు మరణానికి కారణం బంగారం భస్మం అని పోస్టుమార్టంలో తేలిపోయింది.

పూర్తి ఆరా తీయగా అతని మరణానికి అతనే కారణం అని కూడా తేలింది.

అతని ఇంట్లోనే ఈ బంగారం భస్మం దొరికింది.

అసలు విషయం ఏమిటంటే యవ్వనం తరగకుండా ఉండాలనీ, మిలమిల మెరిసే రంగు రావాలని బంగారంకి సంబంధించిన భస్మం కొంతకాలంగా సేవిస్తూవచ్చాడు.

చివరికి వృద్ధాప్యం చేరుకోకుండానే యౌవనంలోనే జీవితం ముగిసింది!

❋❋❋

# 1. తెలిసీ తెలియని జ్వరాలు

కొన్ని మరణాలెలా మిస్టరీగా ఉంటాయో కొన్ని జబ్బులు కూడా మిస్టరీగానే ఉంటాయి. అంతుపట్టని వ్యాధుల అంతు తెలుసుకోవడంలోనే థ్రిల్ ఉంటుంది.

కిశోర్‌కి జ్వరం వస్తోంది. ఆ జ్వరం ఏదో 4-5 రోజులది కాదు. వారాల తరబడి నుంచి వస్తోంది. జ్వరంతో పాటు చలికూడా ఉంటోంది. రక్త పరీక్ష చేస్తే మలేరియా అని రిపోర్టు వచ్చింది. ఇంకేముంది క్లూ దొరికిందని క్లోరోక్విన్ ఫుల్‌కోర్సు వాడేశారు. అయినా జ్వరం దారి జ్వరందే. టైఫాయిడ్ కూడా ఉందేమోనని పరీక్ష చేస్తే టైఫాయిడ్ కూడా ఉందని రక్త పరీక్ష కనబడింది. టైఫాయిడ్‌కి 10-15 రోజులు మందులు వాడారు. అయినా జ్వరం వస్తూనే ఉంది ఎన్ని మందులు వాడుతున్నా ఇన్ని రోజులునుంచి వదలకుండా జ్వరం వస్తూ ఉంటే టి. బి. అయి ఉంటుందని అనుమానం వచ్చింది. ఎక్స్‌రే, రక్తపరీక్షల్లో టి. బి. అని తేలలేదు. అయినా పరీక్షల్లో టి. బికి చూచాయిగా కొంత చోటు కనబడింది. టి. బి. కి మందులు మొదలు పెట్టారు. టి. బి. మందులు మొదలుపెట్టి నెలరోజులైనా జ్వరం తగ్గలేదు. ఇక ఏ మందులు-- ఆ మందులు లేటెస్టుగా వచ్చినవన్నీ గుమ్మరించారు. అయినా జ్వరం తగ్గలేదు. జ్వరం దారి జ్వరందే మందులుదారి మందులదే అయిపోయింది. జ్వరం మొదలు నుంచే ఎంతో శక్తివంత

మైన యాంటిబయాటిక్ మందులు వాడినా, అవకాశమున్న టెస్టులన్నీ చేయించారు. అయినా ఫలితం శూన్యం.

-: మందులు మానేశారు జ్వరం ఎగిరిపోయింది ! :-

చివరికి కిశోర్‌కి విసుగెత్తింది. మందులతో కడుపు కుండ అయిపోయింది. ఏ మందూ మింగనని భీష్మించాడు. నూకలజావ, నిమ్మరసం, కొబ్బరినీళ్ళు తప్ప మందులు వేటినీ దరిచేరనీయలేదు. విచిత్రం.... 10–15 రోజుల్లో జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. ఆకలి పూర్తిగా వచ్చేసింది. అన్నీ తినేయడం మొదలు పెట్టాడు. కొద్ది రోజుల్లోనే ఆరోగ్యంగా తయారయ్యాడు.

అయితే అటువంటి పరిస్థితి కిశోర్‌కే చెల్లింది. అందరికీ అలా జరగదు. జ్వరం వదలకుండా వెంటాడుతుంది. వ్యాధి అంతుపట్టకుండా అవుతుంది. కొందరి విషయంలో యాంటిబయాటిక్స్ అనవసరంగా అతిగా వాడటం కూడా జ్వరం కొనసాగడానికి మూలం అవుతుంది. కొందరికి కొన్ని మందులకి(డగ్స్) హైపర్ సెన్సిటివిటి(రియాక్షను) ఉంటుంది. దానివల్ల జ్వరం వస్తూ ఉంటుంది. ఆ మందు మానితేతప్ప జ్వరం తగ్గదు.

-: ఒక్క రోగికి రెండు మూడు రోగాలు :-

ఒకే రోగిలో ఒకేసారి రెండు మూడు రకాల వ్యాధులు ఉండవచ్చు. అదే కిశోర్ విషయంలో చూశాం. అతనికి మలేరియా, టైఫాయిడ్ రెండూ ఉన్నాయి. అయితే ఆ రెండింటికి మందులు వాడినా జ్వరం తగ్గక పోవడానికి ఆ

సమయంలో వాడే మరేదైనా మందుకి హైపర్ సెన్సిటివిటీ ఉండి జ్వరం వస్తూ ఉండవచ్చు.

-: టెస్టులు తప్పుకావచ్చు... జబ్బు అది కాకపోవచ్చు :-

కొన్ని సందర్భాలలో రక్త పరీక్ష రిపోర్టు తప్పుగా రావచ్చు. జబ్బు లేనిదే ఉన్నట్లు రావచ్చు. అందుకని టెస్టులు తిరిగి చేయడం రోగిని తిరిగి క్షుణ్ణంగా పరీక్ష చేయడం అవసరం. అంతే తప్ప త్వరపడి మందులువాడటం మంచిదికాదు. వ్యాధి నిర్ధారణ కానిదే మందులు వాడే యడం తప్పు.

రోగి పరిస్థితి క్షీణించకుండా తగిన ఆహారం, నీరు అందించాలి. తగినన్ని కేలరీల ఆహారం, అవసరమైన నీరు తీసుకోకపోతే డిహైడ్రేషన్, మాల్‌న్యూట్రిషన్ వల్ల కూడా జ్వరం ఉంటుంది.

కిశోర్ విషయంలో అతిగా మందులు వాడటం, ఆహారం—నీరు తగినంత అందకపోవడం కారణమై ఉంటుంది. మందులు అనవసరంగా వాడటం ఆగిపోవడంతో, శరీరానికి తగినన్ని కేలరీలు అందడంతో, నీరుతో, డిహైడ్రేషన్ కంట్రోలు అవడంతో జ్వరం పోయిందనుకోవచ్చు అందుకని రోగి చికిత్సలో వీటన్నింటినీ దృష్టిలో ఉంచుకోవాలి.

-: అంతుపట్టని జ్వరాల్లో పరీక్షలు :-

అధికశాతం జ్వరాలు వ్యాధి క్రిములు శరీరంలో చేరడం వల్ల వస్తాయి సాధారణంగా రోగిని పరీక్ష చేసి

నప్పుడు ఏ వ్యాధి అయినదీ తెలిసిపోతుంది. కొన్ని కేసుల విషయంలోనే లేబరేటరీ పరీక్షలు అవసరమవుతాయి.

జ్వరం ఎందువల్ల వచ్చిందో పైకి తెలియనప్పుడు వివిధ రకాల రక్త పరీక్షలు అవసరమవుతాయి. వ్యాధికి సంబంధించిన బాక్టీరియా క్రిమి ఏదైనదీ తెలుసుకోవడానికి రక్తం, శరీరంలో అసాధారణంగా చేరిన నీరు, మూత్రం, వెన్నులో నీరు, కళ్ళె, వాంతి, విరోచనం పరీక్ష చేయవలసి ఉంటాయి. కొన్నింటిలో వ్యాధి క్రిములు తేలికగా మైక్రోస్కోప్ పరీక్షలో కనబడితే మరికొన్ని కేసుల్లో కల్చర్ టెస్టు చేయవలసి ఉంటుంది. వీటివల్ల వ్యాధి క్రిమి ఏమైనదీ, దానికి కరెక్టుగా పనిచేసే మందు ఏమైనదీ తేలుతుంది.

అల్ట్రాసౌండు స్కానింగు, సి. టి. స్కానింగు, యం. ఆర్. ఐ. ఎక్స్‌రే వంటి పరీక్షలు అవసరమవుతాయి.

ఇన్ని చేసినా ఒక్కొక్కసారి జ్వరం అంతుపట్టకుండా ఉంటుంది.

-: రిపీట్ ... రిపీట్ :-

క్షుణ్ణంగా వ్యాధి చరిత్ర :- జ్వరం తగ్గకుండా ఉంటున్నప్పుడు రోగిని మళ్ళీ మళ్ళీ పరీక్ష చేయడం, జ్వరానికి ముందు రోగి ఏ ఏ ప్రదేశాలకి వెళ్ళినదీ, ఏమేమి చేసిందీ, జ్వరం ఎలా మొదలైనది, మందులు ఏవేవి వాడినదీ స్పష్టంగా అడిగి తెలుసుకోవాలి. కొన్ని వ్యాధులు కొన్ని ప్రదేశాల్లోనే ఉంటాయి. కొన్ని ప్రత్యేక పరిస్థి

తుల్లోనే కొన్ని వ్యాధులు వస్తాయి. రోగి తాను ఎక్కడికి వెళ్ళినదీ, ఏం చేసిందీ చెప్పకపోతే డాక్టరు వ్యాధికారణం అర్థంకాక తికమక అవవచ్చు. కొందరు రోగులు మొదట్లో కొన్ని విషయాలు చెప్పడం మరిచిపోతారు. ఆ విషయాలే రోగ నిర్ధారణకు ఎంతో ముఖ్యమౌతాయి. అందుకని జ్వరం అంతుపట్టకుండా వున్నప్పుడు రోగిని తిరిగి తిరిగి ప్రశ్నించడం, విషయ సేకరణ చేయడం అవసరం.

మళ్ళీ మళ్ళీ రోగి పరీక్ష :- మొదటిసారి రోగిని పరీక్ష చేసినప్పుడు కొన్ని వ్యాధి లక్షణాలు గమనించక పోవచ్చు. లేదా ఆ సమయానికి వ్యాధి లక్షణాలు కలగక పోవచ్చు. వ్యాధి లక్షణాలు రోగ నిర్ధారణకి మూలం. అందుకని జ్వరం తగ్గకుండా ఉన్నప్పుడురోగి రోగాన్ని మళ్ళీ పూర్తిగా పరీక్ష చేయడం అవసరం. కొందరికి ముక్కులో ఏదైనా గింజదూరి మళ్ళీ జ్వరం రావచ్చు. మరొకరికి చెవిలో చీము జ్వరానికి కారణం కావచ్చు. గొంతులో గడ్డలు, గజ్జల్లో గడ్డలు జ్వరానికి కారణంకావచ్చు. పిరుదల దగ్గరో మరో చోటో లోతుగా తయారయ్యే చీముగడ్డలు జ్వరానికి కారణం కావచ్చు. మొదట్లో పరీక్ష చేసినప్పుడు ఇది కనబడక తక్కినవన్నీ మామూలుగా ఉండి వ్యాధి అంతుపట్టకపోవచ్చు. రోగి రోగాన్ని మళ్ళీ పరీక్షచేసినప్పుడు జ్వరానికి అసలు కారణం బయటపడుతుంది.

మళ్ళీ మళ్ళీ మూత్ర పరీక్ష :- మూత్రంలో చీము,

రక్తం జ్వరానికి కారణం అవుతుంది. మూత్రపిండాలు, మూత్ర వాహికలు, మూత్రకోశం వ్యాధులు చాలా జ్వరాలకి కారణం. మొదట్లో మూత్ర పరీక్షచేస్తే ఏమీ కనబడకపోవచ్చు. మూత్ర పరీక్ష అతి సాధారణ పరీక్ష— కాని అందులో కనబడే ప్రోటీను, చీము కణాలు, ఎర్రకణాలు వ్యాధి నిర్ధారణకి ఎంతో తోడ్పడతాయి. అందుకని జ్వరం తగ్గకుండా వస్తూ వ్యాధి అంతుపట్టకుండా ఉన్నప్పుడు రిపీటెడ్‌గా మూత్ర పరీక్ష అవసరం.

జ్వరం ఛార్టు :- జ్వరం అంతుపట్టకుండా ఉన్నప్పుడు జ్వరం చార్టు చాలా తోడ్పడుతుంది. ఒక్కొక్క జ్వరానికి జ్వరం వచ్చేతీరు ఒక్కొక్క విధంగా ఉంటుంది. అందుకని జ్వరాన్ని చాలా జాగ్రత్తగా నోట్ చేసి చార్టు మీద వేయాలి.

రిపీటెడ్ లేబరేటరీ పరీక్షలు :- అవసరంబట్టి లేబరేటివ్ పరీక్షలు రిపీట్ చేస్తూ ఉండాలి. మొదటిసారి రక్త పరీక్షలో టైఫాయిడ్ లేనట్లు రిపోర్టు రావచ్చు. ఒకటి రెండు రోజులు తరువాత అదే పరీక్ష చేస్తే టైఫాయిడ్ జ్వరం స్పష్టంగా బయట పడవచ్చు. అలాగే ఇతర జ్వరాల విషయం ఒక్కొక్కసారి లేబరేటరీ పరీక్షలు తప్పుకావచ్చు. అందుకని అవసరంబట్టి రక్త పరీక్షలు— ఇతర పరీక్షలు రిపీట్ చేయాలి. అంతేకాని ఒకసారి చేయించాం కదా అని ఊరుకోకూడదు.

-: అపుడైనవి అంతుపట్టనివి కావచ్చు ! :-

జ్వరం పూర్వాపరాలు, జ్వరం చార్టులు, రక్త పరీక్షలు ఎన్ని పరిశీలించినా జ్వరం అంతుపట్టక పోవచ్చు, తగ్గిపోవచ్చు. అయితే కారణం కోసం అన్వేషణ ఆగకూడదు.

ఎందుకంటే...

కొన్ని కంతులు జ్వరానికి కారణమవుతాయి. హాడ్జ్కిన్స్ డిసీజ్, లింగ్స్, కిడ్నీస్, జీర్ణాశయం, కేన్సర్ వదలకుండా జ్వరం ఉండటానికి కారణం కావచ్చు.

బ్రూసిలోసిస్, సబ్ ఎక్యూట్ ఎండోకార్డయిటిస్, లివర్, పాన్క్రియాస్‌లో ఇన్ఫెక్షను, పసరు తిత్తినాళం, కడుపులోపల ఇన్ఫెక్షను జ్వరానికి కారణం కావచ్చు.

కనెక్టివ్ టిస్యూ వ్యాధులు, రక్తనాళాలు ఇన్ఫెక్షను, చర్మానికి సంబంధించిన ఫంగస్ వ్యాధులు కూడా వదలకుండా జ్వరాన్ని కలిగించవచ్చు.

ఇవేమీ కాకుండా జ్వరం తగ్గడానికి వాడే మందులే కొన్ని జ్వరాన్ని కలిగింపవచ్చు. దీనినే 'హైపర్ సెన్సివిటీ టు డ్రగ్స్' అంటారు.

అరుదైన ఈ విషయాలని దృష్టిలో ఉంచుకుని తగిన పరీక్షలు జరపాలి.

-: అంతుపట్టని జ్వరాల్లో అనుసరించవలసిన పద్ధతులు :-

విశ్రాంతి :- అస్వస్థతగా ఉన్నప్పుడు విశ్రాంతి ముఖ్యం. విశ్రాంతి లేకపోతే త్వరగా స్వస్థత చేకూరదు.

జ్వరం ఉన్న వ్యక్తి చల్లగా ఉండే గదిలో విశ్రాంతి తీసుకోవాలి. చక్కని గాలి ప్రసరిస్తూ ఉండాలి. పరిసరాలు ఆరోగ్యకరంగా ఉండాలి. రోగి పడుకున్న మంచం, పరుపు హాయిగా ఉండాలి. నల్లులు, దోమలు, చీమలు రోగికి మరింత బాధని కలుగజేస్తాయి. పడుకున్నా సరైన విశ్రాంతి అనిపించకుండా చేస్తాయి. విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో మానసిక ఉల్లాసంకోసం ఏదైనా చదవడం, టి. వి. చూడటం, రేడియో వినడం చేయాలి.

శారీరక పరిశుభ్రత :- జ్వరం ఉన్నవ్యక్తికి రోజూ ఒళ్ళంతా నీటి గుడ్డతో శుభ్రంగా తుడిచి పౌడరు రాయాలి. జ్వరం ఎక్కువ వున్నప్పుడు ఒంటిమీద చన్నీళ్ళల్లో ముంచిన గుడ్డకప్పాలి. రోగి నోటి శుభ్రత కాపాడాలి. రోజూ వుదయం పళ్ళు తోమాలి. నోటి లోపల ఇన్ ఫెక్షను లేకుండా చూడాలి. మంచం మీదనుంచి లేవలేని రోగికి బెడ్ సోర్స్ రాకుండా మెత్తని పరుపుమీద పడుకోబెట్టడం తరచు ఇటు అటు త్రిప్పడం, గుస్తుల్లో మూత్ర విసర్జనచేస్తే ఆ దుస్తులని వెంటనే మార్చడం చేయాలి.

త్రాగడానికి ఎక్కువ నీరు :- సాధారణంగా అస్వస్థతగా వున్నవ్యక్తి నీరు ఎక్కువ తీసుకోడు- కాని శరీరానికి నీరు ఆవశ్యకత ఎక్కువగా వుంటుంది. జ్వరంగా వున్నప్పటికి రోజు రోగి మొత్తం మీాద కనీసం 1500 సి. సి. ల మూత్రం విసర్జించాలి. అసలే జ్వరం, దీనికితోడు వాంతులు విరోచనాలు వుంటే శరీరంలోనుంచి నీరు, ఉప్పు అధి

కంగా బయటకు పోతాయి. అందుకని జ్వరంగా వున్న పుడు రోగికి నీరు ఎక్కువ ఇవ్వాలి. పల్చని మజ్జిగలో ఉప్పు కలిపి ఇవ్వడం, కొబ్బరి నీళ్ళు, పళ్ళరసం ఎక్కువ ఇవ్వాలి. ఒకవేళ రోగి త్రాగకపోతే నరంద్వారా సలైను ఎక్కించాలి.

ఆహారం :- జ్వరంగా వున్నప్పుడు కేలరీలు ఎక్కువ ఖర్చు అవుతాయి. ఖర్చు అయిన కేలరీలని సమకూర్చ డానికి తగిన ఆహారం ఇవ్వాలి. కాని జ్వరంగా వున్నప్పుడు నోటికి రుచిగా లేక ఆహారం తీసుకోవడం కుదరదు. అయినా ఏదో ఒక రూపంలో తేలికగా అరిగే ఆహారం అందివ్వాలి. జ్వరంగా వుంటే అన్నం పెట్టకూడదని అనుకుంటారు. కాని ఆకలి, అరుగుదల వుంటే మామూలుగా అన్నం పెట్టాలి. టైఫాయిడ్ వంటి కొన్ని రకాల జ్వరాల్లో తప్ప తక్కిన జ్వరాల్లో ఆహారం మామూలుగా పెట్టాలి. మామూలు ఆహారం తీసుకోకపోతే జావ తాగించాలి. గ్లూకోజు, పళ్ళ రసం, పాలు, తేనే వంటివి ఇవ్వాలి.

నిద్ర :- జ్వరంనుంచి త్వరగా కోలుకోవడానికి నిద్ర పోవడం అవసరం. తలనొప్పి, ఒళ్ళు నొప్పులు వుంటే అవి తగ్గడానికి బిళ్ళలు ఇవ్వాలి. వాంతులు అవుతూవుంటే తగ్గ డానికి ఇంజక్షను ఇవ్వాలి. నిద్ర పట్టకపోతే నిద్ర బిళ్ళలు ఇవ్వాలి. రోగి బాగా నిద్రపోతే వ్యాధినుంచి త్వరగా కోలు కుంటారు.

మందులు :- ఫలానా జ్వరమని స్పష్టంగా తేలక

పోయినా కనీసం తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, దగ్గు,ఆయాసం జ్వరం తగ్గడానికి ఆస్ప్రిన్, అనాలజిన్, పారసిటమాల్, దగ్గు మందు ఇవ్వాలి. అవసరంబట్టి యాంటిబయాటిక్ మందులు కూడా ఇవ్వాలి.

ధైర్యం :- కొందరు అనవసరంగా భయపడతారు. రోగికి తగిన ధైర్యాన్ని కలిగించడం, త్వరగా కోలుకుంటా డని విశ్వాసాన్ని కలిగించడం అవసరం.

—: అదా... ఇదా :—

కొన్ని జ్వరాలు ఎంత చేసినా ఎన్ని చేసినా తగ్గ కుండా వుంటాయి. మందులకి లొంగనట్లు వుంటాయి. అటువంటప్పుడు అసలు వ్యాధి అదా... ఇదా అనే అను మానం కలుగుతుంది. మందులకి రెసిస్టెన్సు వుండే వ్యాధి తగ్గడం లేకా, వ్యాధి నిర్ధారణ తప్పా అనే అనుమానం వస్తుంది.

—: మలేరియా టి. బి లోకి దింపిందా ? :—

మలేరియా టి. బి. లోకి దింపిందనో, టైఫాయిడ్ లోకి దింపిందనో— ఇలా రకరకాలుగా అను కోవడం వుంటుంది. మొండికైన మలేరియా చివరికి టి. బి. రూపంలో బయటపడేసరికి ఇంతవరకు ఉన్న జ్వరం మలే రియా వల్లనా, టి బి. వల్లనా అర్థంకాక అయోమయంలో పడతారు. వ్యాధి ఒక మిస్టరీగా మారుతుంది.

అంతుపట్టని జ్వరాలు ఎలా వున్నాయో, అంతుకట్టని

ఇతర రోగాలు కూడా అనేకం. అయినా కొన్ని వ్యాధులకి వుండే ప్రత్యేక లక్షణాలుబట్టి, వ్యాధి కలిగిన తీరునుబట్టి రోగి వయస్సు, రోగి నివసించే ప్రదేశంబట్టి కొన్ని వ్యాధులని నిర్ధారించడమవుతుంది.

అంతుపట్టని వ్యాధులని అంతుపట్టేటట్లు కృషి చేయడం, చివరికి వ్యాధి అంతులని పట్టుకోవడం నిజంగా ఒక థ్రిల్. రోగికి ఒక పెద్ద రిలీఫ్.



## 2. ఆయాసం ఉంటే- ఉబ్బసమా ? గుండెజబ్బా?

ఆయాసం వస్తూ వుంటే ఉబ్బసమైనా కావాలి, గుండెజబ్బు అయినా కావాలనుకుంటారు. అలా అనుకుని భయపడిపోతారు. ఒక్కొక్కసారి ఆయాసం ఒక పజిల్‌గా మారుతుంది.

ఉబ్బసంవల్ల ఆయాసం అయి వున్నట్లయితే సాధారణంగా వంశంలో ఎవరికో ఒకరికి వుంటుంది. అదేకాక అంతకుముందు అప్పుడప్పుడు ఆయాసం అనిపిస్తూ వుంటుంది. గట్టిగా శారీరక శ్రమ చేయడానికీ, ఆయాసం రావడానికీ సంబంధం కనబడదు. ఒక్కొక్కసారి విశ్రాంతిగా వున్నా ఆయాసం అనిపిస్తూంది. మరొకసారి ఎంత శ్రమ చెందినా ఆయాసం అనిపించదు, వుబ్బసంవల్ల ఆయాసం వచ్చినప్పుడు దగ్గుకూడా వుంటుంది. ఆ దగ్గుతో కొంత తెమడ జిగురుగా

పడుతుంది. గాలి తీయడం తేలికగా వదలడం బాధగా వుంటుంది. గొంతులో గురగుర పిల్లికూత వుంటుంది.

ఇదే గుండెజబ్బువల్ల ఆయాసం అయినట్లయితే రక్తపోటుగాని, గుండెజబ్బు లక్షణాలుగాని వుంటాయి. సాధారణంగా విశ్రాంతిగా వున్నప్పుడు ఆయాసం రాకుండా నడిచినా, పనిచేసినా ఆయాసం వస్తుంది. ఆయాసంతో దగ్గు వుండవచ్చు. దగ్గుతోపడే తెమడ జిగురుగా కాకుండా నీరులాగా వుంటుంది. ఆయాసంతో చమటలు పోయడం ఎక్కువ. డెరిఫల్లిన్, ఎమైనోఫలిన్‌లతో ఉబ్బసానికి వుపశాంతి వచ్చినట్లు గుండెజబ్బువల్ల కలిగే ఆయాసానికి వుపశాంతి కనబడదు

-: ఉబ్బసమూ కాదు, గుండె జబ్బూ కాదు, మరేమిటి? :-

కొందరికి వచ్చే ఆయాసం గుండెజబ్బు వల్లా అవదు, ఉబ్బసంవల్లా అవదు మరి ఎందుకనేది అంతుపట్టకుండా వుంటుంది.

ఊపిరి తిత్తుల పైపొరల్లో నీరు చేరగా వచ్చే ప్లూరల్ ఎఫ్ల్యూజన్ వల్లగాని, గాలి చేంగా వచ్చే న్యూమోథోరాక్స్ వల్లగాని, ఊపిరితిత్తుల్లో ఇన్‌ఫెక్షను వల్లగాని, ఫైబ్రోసిస్ వల్లగానీ ఆయాసం రావచ్చు. బ్రోంఖయిటిస్, బ్రోంకైఎక్టేసిస్, లంగ్ కేన్సర్ వల్ల ఆయాసం రావచ్చు. ఊపిరితిత్తులు పెరగడం (ఎంఫసీమా), ముడుచుకుపోవడం (ఎటలెక్టేసిస్) వల్ల ఆయాసం రావచ్చు. ఇవన్నీ ఎక్సరే

తీస్తే తెలుస్తాయి. కాని కొందరికి ఎక్సరే తీసినా ఏమీ కనబడదు.

-: ఆయాసానికి శ్వాసకోశాలే కారణం కానవసరంలేదు :-

ఆయాసం బాగా అనిపించడానికి, గాలి పీల్చడానికి ఇబ్బంది అనిపించడానికి శ్వాసకణాల వ్యాధులే ఉండనవసరం లేదు. రక్తహీనత ఉన్నా ఆయాసపడటం వుంటుంది. మూత్రపిండాల వ్యాధులు, ఇతర వ్యాధులవల్ల రక్తంలో యూరియాశాతం పెరిగిపోయి ఆయాసం అధికంగా అనిపించవచ్చు.

-: ఏ జబ్బు లేకుండా ఆయాసం :-

కొందరు న్యూరోటిక్ పర్సనాలిటీ వ్యక్తులు ఉంటారు. వారికి ఏ జబ్బు ఉండదు. ఎన్ని పరీక్షలు చేసినా ఏమీ కనబడదు. వారికి వున్నట్లుండి ఒక్కసారిగా ఊపిరి అందనట్లు అవుతుంది. వారిని ఆ సమయంలో చూస్తే గాలి ఆడక ఎంతో ఆయాసపడిపోతున్నట్లు ఉంటుంది. ఒకటి— రెండు నిమిషాల్లోనే ప్రాణం పోతుందా అని చూసే వారికి భయం కలుగుతుంది. కాని అది నిజమయిన ఆయాసం కాదు కేవలం సైకలాజికల్. వారికి మనస్సులో ఏదో భయం, ఏదో ఆలోచన వచ్చి విచిత్రంగా ప్రవర్తిస్తారు. వారికి ఏం చేయకుండా వదిలేసినా కొంతసేపటికి ఎంచక్కానో లేచి కూర్చుంటారు. ఇటువంటి వాళ్ళది

న్యూరోటిక్ పర్సనాలిటీ [హిస్టీరికల్ పర్సనాలిటీ] అనేది గుర్తించకపోతే ఆయాసం అంతుపట్టకుండా అవుతుంది.

ఆయాసం వున్నప్పుడు తీరు ఎలాఉందీ, ఎలా మొదలైందీ, ఎంతసేపు నుంచి వస్తోందీ, ఎలా పెరుగుతోందీ, ఇతర వ్యాధులేమైనా వున్నాయా అనే వాటిని క్షుణ్ణంగా పరిశీలించడం, అవసరంబట్టి టెస్టులు చేయటం వుండాలి. ఒక ప్రక్క ఆయాసానికి ఆక్సిజను పెట్టడం, డెరిఫిల్లెన్ ఇంజక్షన్లు ఇచ్చినా మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయాలి.



## 3. ఒంటికి చేరిన నీరు - తికమక

ఒంటికి నీరు చేరగానే ఎందరో భయపడిపోతారు. ఒంటికి నీరు చేరడం ప్రాణం మీదకి రావడమే అనుకుంటారు. అఫ్‌కోర్స్, కొన్ని సందర్భాలలో అలా నీరుచేరడం వ్యాధి ముదిరిపోయిన దానికి గుర్తుగా తీసుకోవచ్చు.

-: ఒంటికి నీరు చేరితే గుండె పెరిగినట్టేనా ? :-

గుండె పెరిగినపుడు ఒంటికి నీరు చేరుతుంది. కాని ముందుగా పాదాలకి నీరు చేరుతుంది. ఆ తరువాత నిదానంగా ఒంటికి నీరు వస్తుంది. గుండె పెరగడం వల్ల ఒంటికి నీరు చేరినపుడు మూత్ర విసర్జన కూడా కొంత తగ్గుతుంది. పరీక్ష చేసి చూస్తే గుండె పెరిగి కనబడుతుంది. కాలేయం

కూడా బాగా పెరుగుతుంది. ఆయాసం ఉంటుంది. కొందం రికి నీరు చేరడమే కాకుండా ఒళ్ళు, గోళ్ళు నీలంగా మారుతాయి.

## —: ఉబ్బు కామెర్లు :—

ఉబ్బు కామెర్లు రావడంవల్ల ఒంటికి నీరు వచ్చిందని కొందరు భయపడతారు. ఒంటికి నీరు చేరడానికి అనేక కారణాలు ఉన్నాయి. ఉబ్బుకామెర్లు అని చెప్పేవారు ఏ కారణంవల్ల ఒంటికి నీరు చేరినా ఉబ్బుకామెర్లు అనేస్తారు. అంతేగాని ఉబ్బు కామెర్లు అని వేరుగా జబ్బు లేదు. ఉబ్బు కామెర్లు అని చెప్పుకునేది గుండెజబ్బు వల్ల కావచ్చు, మూత్రపిండాలు, కాలేయం వ్యాధులవల్ల కావచ్చు, ఎనీమియావల్ల కావచ్చు, ఎలర్జీవల్ల కావచ్చు.

## —: అంతు పట్టేదెలా ? :—

మూత్రపిండాలు దెబ్బతినడంవల్ల కూడా ఒంటికి నీరు చేరుతుంది. మూత్రంలో ఆల్బుమిన్ ఎక్కువగా పోతుంది. నీరు ముందు ముఖానికి వస్తుంది. తరువాత ఒంటికి చేరుతుంది.

లివర్ [కాలేయం] దెబ్బతినడంవల్ల నీరు ఒళ్ళంతా కాకుండా ఛాతీ క్రిందనుంచి వుంటుంది. పొట్టకి, కాళ్ళకి, పాదాలకి నీరు చేరుతుంది. ఛాతీ, చేతులు ఎండిపోయినట్లు వుంటాయి.

చిన్న పిల్లల్లో లివర్ జబ్బువల్ల ఒళ్ళంతా నీరు చేరుతుంది. ఈ పరిస్థితిని "ఇండియన్ ఛైల్డ్‌హుడ్ సిర్రోసిస్" అంటారు. ఈ వ్యాధి [illegible] ఏళ్ళ వయస్సు పిల్లల్లో వస్తుంది. మొదట పాదాలకి, కాళ్ళకి నీరు చేరి తరువాత ఒళ్ళంతా నీరు చేరుతుంది. లివర్ బాగా పెద్దది అవుతుంది. పొట్టకి బాగా నీరు వస్తుంది. స్ప్లీన్ కూడా బాగా పెద్దది అవుతుంది. పచ్చకామెర్లు కూడా కొంత వుంటాయి. మూత్రం పచ్చగా వస్తుంది. ఈ విధంగా ఒంటికి నీరు చేరే వ్యాధి ప్రమాదకరమైనది.

-: రక్తహీనత ఉన్నా నీరు వస్తుంది :-

గుండె, లివరు, మూత్రపిండాల వ్యాధులు లేకుండా కూడా ఒంటికి నీరు వస్తుంది. రక్తహీనత [ఎనీమియా] వున్నవాళ్ళకి ఒంటినిండా నీరు చేరుతుంది. రక్త పరీక్ష చేస్తే రక్తహీనత స్పష్టంగా బయట పడుతుంది. రక్తంలో ప్రోటీన్లు తక్కువ శాతంలో వుంటాయి.

ఒంటికి నీరు చేరడానికి ఎలర్జీకూడా కారణం. ఏ వయస్సు వారికైనా ఎలర్జీ వల్ల నీరు చేరవచ్చు. ఎలర్జీ వల్ల ఒంటికి నీరు చేరడం సాధారణంగా [illegible]గా జరుగుతుంది. ముఖానికి, కాళ్ళకి నీరు చేరుతుంది. చర్మంమీద ఎలర్జీకి సంబంధించిన దద్దురు కనబడవచ్చు.

ఒంటికి నీరు చేరినప్పుడు తగిన పరీక్షలుజరిపి కారణం ఏదైనదీ నిర్ధారణ చేయాలి. ఎలర్జీ వల్ల నీరు చేరినప్పుడు తక్కినవన్నీ మామూలుగా వుంటాయి.



# 4. కారణం కనిపించదు...
## ఆకలి అసలు ఉండదు...
## ఏమిటా జబ్బు ?

ఆకలి లేకపోవడం, తినాలనిపించక పోవడం ఇన్ ఫెక్షన్ జ్వరాల్లోనూ, క్షయవ్యాధిలోనూ, కేన్సర్ లోనూ వుంటుంది. అంతే కాకుండా క్రానిక్ గాస్ట్రియిటిస్ లో వుంటుంది. మొదటి దశలో వున్న గాస్ట్రిక్ కేన్సర్ లో వుంటుంది. ఈ రెండింటిలో ఏదైనా తినబోతే ముందుగానే పొట్టనిండుగా వున్నట్లు ఫీలింగ్ వస్తుంది. ఇన్ ఫెక్టివ్ హెపటైటిస్ [లివర్ కి వైరస్ వ్యాధి] వచ్చినవారికి అన్నంచూస్తేనే వెగట పుట్టుతుంది. దీర్ఘకాలంగా మూత్రపిండాల వ్యాధి వున్నప్పుడు కూడా ఆకలి అనిపించదు.

–: జబ్బు ఉండదు... ఆకలి ఉండదు ! :–

ఏ పనీపాటా లేని కొందరు ఊరికినే కూర్చుని వుంటారు. అలా ఎటువంటి శారీరకశ్రమ చెందని కొందరిలో ఆకలి వుండదు. నియమిత సమయంలో భోజనం చేసే పద్ధతి లేనివారికి ఆకలి సరిగ్గా వేయడం, తినాలనిపించడం వుండదు. అలాగే భోజనానికీ భోజనానికి మధ్య చిరుతిళ్ళు కొద్దిగా తిన్నప్పటికీ ఆకలి వుండదు. కొంచం ముందు కూర్చున్నా తినాలని వుండదు.

థైరాయిడ్ గ్రంథి తక్కువ పని చేసేవారిలో, ఎడిసన్స్ డిసీజ్ ఉన్నవారిలో, విటమిన్ బి-కాంప్లెక్సు లోపం వున్నవారిలో ఆకలి వుండదు.

## -: తిండి తినాలనిపించని మానసికవ్యాధి :-

"ఎనొరెక్సియా నర్వోజా" అనే ఒక మానసికవ్యాధి ఉంది. ఇటువంటి మానసికవ్యాధి ముఖ్యంగా ఆడపిల్లల్లో కనబడుతుంది వీరిలో ఎటువంటి శారీరక వ్యాధి వుండదు. అయినా అన్నం తినరు. అసలు అన్నం తినాలనే వుండదు. రోజు రోజుకీ బరువు కోల్పోతారు. మలబద్ధకం వుంటుంది. నాడి చాలా నిదానంగా కొట్టుకుంటుంది. ముఖం మీద, కాళ్ళమీద వెంట్రుకలు మొలుస్తాయి.

## -: గందరగోళం పరిస్థితి :-

అన్నం తినకపోవడం, తినాలనిపించక పోవడం రోగికీ డాక్టరుకీ సవాలుగానే తయారవుతుంది. చాలా సందర్భాలలో కారణం అంతుపట్టదు. ఇటువంటి కేసుల్లో వ్యక్తి మానసిక పరిస్థితిని బాగా పరిశీలించాలి. ఆ వ్యక్తిది న్యూరోటిక్ పర్సనాలిటీయా అని గమనించాలి. అతనికి వ్యాధులేమైనా వున్నాయా అని క్షుణ్ణంగా పరీక్షించాలి. ఆహారం సమయానికి తీసుకుంటున్నదీ లేనిదీ, చిరుతిండి తింటున్నదీ గమనించాలి. త్వర త్వరగా బరువు కోల్పోతూ వుంటే కేన్సర్ వుందేమో చూడాలి. కొన్ని రకాల మందులు

ఆకలిని చంపేస్తాయి. అంచేకని ఆ వ్యక్తి ఏవైనామందులు వేసుకొంటున్నాడేమో తెలుసుకోవాలి. మద్యం తీసుకునే అలవాటు ఉందేమో చూడాలి. ఎందుకంటే క్రానిక్ ఆల్కహాలిజంలో ఆకలి ఉండదు.



## 5. అంతుపట్టని ఛాతీ నొప్పి

ఛాతిలో నొప్పి అనిపించగానే గుండెనొప్పి అని భయపడేవారు ఎందరో ఉంటారు. కొందరికి తరచుగా ఛాతీలో నొప్పి వస్తుంది. ఎన్ని పరీక్షలు చేసినా ఏమీ కనబడదు. అయినా నొప్పి వస్తూనే ఉంటుంది. ఆ వ్యక్తిని భయపెడుతూనే ఉంటుంది.

ఛాతిలో నొప్పి అనగానే గుండె నొప్పి అనుకోవడం వద్దు. కాని గుండెనొప్పి ఛాతీ మధ్యలో ఛాతీ ఎముక క్రింద వస్తుంది. ఛాతీకి ఎడమవైపు వచ్చే నొప్పి సాధారణంగా గుండెనొప్పి అవదు.

గుండె నొప్పి అనుకునే చాతీ నొప్పి చాలా సందర్భాలలో గుండెనొప్పి కాకుండా ఊపిరితిత్తి వ్యాధివల్ల, ప్లూరా వాపువల్ల, ఛాతీ కండరాలు, నరాల నొప్పివల్ల వస్తుంది

అంతుపట్టని నొప్పికి అవసరమైన సమాచారం :-

ఛాతీనొప్పి అంటే అది ఎలా మొదలైందీ తెలుసు

కోవాలి నొప్పి వచ్చిన తీరుబట్టి గుండెనొప్పా, మరొకటా అనేది తెలుసుకోవడం తేలిక అవుతుంది

నొప్పి వచ్చిన ప్రదేశం, నొప్పి తీరు, నొప్పి ప్రాకిన విధం చాలా వరకు నొప్పి తెలుసుకోవడానికి క్లూ ఇస్తాయి.

నొప్పి ఒకవేళ ఎక్కువ అవుతూవుంటే ఎందువల్ల అవుతోంది, ఏంచేస్తే అవుతుందీ తెలుసుకోవడం అవసరం. అలాగే ఏంచేస్తే నొప్పి తీవ్రత తగ్గుతోందీ గమనించడం అవసరం. అంతేకాకుండా ఛాతీలో వచ్చిన నొప్పి ఎంత సేపు ఉంటున్నదీ, వచ్చినప్పుడు చమటలు పోస్తున్నాయా, వాంతులు అవుతున్నాయా, విరోచనం అయిపోతోందా తెలుసుకోవాలి.

-: ఛాతీకి లోపల... బయట :-

ఛాతీ నొప్పికి ఛాతీలోపల కారణాలు :- గుండెపోటు, యాంజైనా గుండెనొప్పి, పెరికార్డయిటిస్ వల్ల చాతీనొప్పి అనిపిస్తుంది.

గుండెనుంచి వచ్చే పెద్ద రక్తనాళం (అయోర్టా) ఉబ్బడం, వ్యాధిగ్రస్తం కావడంవల్ల కూడా చాతీనొప్పి వస్తుంది.

శ్వాసకోశ వ్యాధులు, ప్లూరాకి సంబంధించిన, వ్యాధులు, గాలిగొట్టంవాపు, చాతీమధ్య కంతులు కూడా చాతీ నొప్పికి కారణం.

అన్నవాహిక వాసినా, ఘండుపడినా, కేన్సరు

వచ్చినా చాతీలోపల నొప్పి వస్తుంది. చాలామంది ఈ విధంగా వచ్చే నొప్పిని గుండెనొప్పి అని భయపడతారు.

చాతీ గోడల్లో వచ్చేనొప్పి :- చాతీ గోడలు ప్రక్క టెముకలు, కండరాలు, నరాలతో నిర్మితమవుతాయి. చాతీ కండరాల్లో, నరాల్లో, చర్మంమీద వచ్చే బాధలని కూడా గుండెనొప్పిగా భావిస్తారు. ఈ విధంగా వచ్చే చాతీనొప్పి ఏ విధంగానూ గుండెతో సంబంధంలేదు.

స్త్రీలలో వక్షోజాలలో నొప్పి వస్తూ వుంటుంది. ముఖ్యంగా బహిష్టు ముందు రోజుల్లో అనిపిస్తుంది. అది తెలుసుకోక గుండెనొప్పి అనుకుంటారు.

చాతీ కండరాలవాపు, ఇన్ ఫెక్షను కూడా చాతీ నొప్పికి కారణమవుతుంది. అలాగే చాతీమీద వుండే నరాలకి వ్యాధివచ్చి తీవ్రమైన నొప్పి కలుగుతుంది. ఇటు వంటి న్యూరలాజికల్ పెయిన్ని గుండె నొప్పిగా అనుకో కూడదు

చాతీ గోడలు ప్రక్కటెముకలు, కార్టిలేజ్, కనె క్టివ్ టిస్యూతో నిర్మితమౌతాయి. వీటికికూడా ఇన్ ఫెక్షను, ఇనఫ్లమేషను వస్తుంది. దానివల్ల చాతిలో నొప్పి అని పిస్తుంది

చాతీనొప్పికి ఇతర కారణాలు :- గాస్ట్రిక్ అల్సర్, డ్యూయోడనల్ అల్సర్, కడుపులో గ్యాస్, పసరుతిత్తి, కాలేయం వ్యాధులు చాతీనొప్పిని కలుగజేస్తాయి.

కొన్ని రకాల నరాల వ్యాధులు, వినాళ గ్రంథుల వ్యాధులు, వెన్నుపూసల వ్యాధులు చాతినొప్పికి కారణమౌతాయి.

—: సైకలాజికల్ పెయిన్ :—

కొందరికి అన్ని రకాల పరీక్షలు జరిగినా అన్నీ నార్మల్‌గానే వుంటాయి. అయినా ఆ వ్యక్తి చాతీ నొప్పితో మెలికలు తిరిగిపోతూ ఉంటాడు. చూసేవారికి అతని పరిస్థితి భయంకరంగా వుంటుంది. ఏ కారణం లేకుండా అంతనొప్పి ఎలా వస్తుందా అని అనుకుంటారు. వీరిలో శారీరక కారణం ఏదీ వుండదు. కాని అనవసరమైన భయం, ఆందోళన, మానసికంగా దిగులువంటి మానసిక కారణాలు చాతీనొప్పికి కారణమౌతాయి.

ఎదుటివాళ్ళు తన గురించి పట్టించుకోవాలనీ, వారి దృష్టిని తనవైపు త్రిప్పుకోవాలనీ, తనమీద సానుభూతిగా వుండాలనీ ఆశించే హిస్టీరికల్ పర్సనాలిటీ వ్యక్తులు చాతికి నొప్పి వచ్చినట్లు ప్రవర్తిస్తారు. వీరికి మానసిక చికిత్స ఒకటే మార్గం.

చాలా సందర్భాలలో చాతీనొప్పి ఎందుకు వస్తున్నదీ స్పష్టమైన కారణం అంతుపట్టకుండా వుంటుంది. అయితే గుండెజబ్బు, ఊపిరితిత్తుల వ్యాధులు లేవని నిర్ధారణ అయిన తర్వాత కూడా చాతినొప్పి వస్తూవుంటే ఆ నొప్పి అంత ప్రమాదకరము కాదని ధైర్యంగా వుండటము అవసరం. అధైర్యపడితే నొప్పి మరింత ఎక్కువ అనిపిస్తుంది.

*

# 6. అపస్మారకం (కోమా) - కారణాలు

కోమా ఒక విధమైన నిద్రావస్థ. ఈ నిద్రావస్థలో రోగి గాఢ నిద్రలో ఉంటాడు. లేపినా లేవడు. పరిసరాల్లో జరిగే గోల ఏ విధంగానూ తెలివి తెప్పించదు.

కోమా స్థితి అకస్మాత్తుగా రావచ్చు. లేదా నిదానంగా రావచ్చు. తలకి దెబ్బ, మెదడులో రక్తనాళాలు పగలడం, రక్తనాళానికి రక్తంగడ్డ అడ్డుపడటం వంటి పరిస్థితుల్లో సడన్‌గా స్పృహ పోతుంది. కోమాలోకి జారుకోవడం వుంటుంది. రక్తపోటు, రక్తంలో గ్లూకోజు శాతం తగ్గిపోవడం, రక్తనాళాల గోడల్లో రక్తంగడ్డ తయారవడం మొదలైన వాటిలో కోమా పూర్తిగా కాకుండా కొంత వుంటుంది. ఆ తరువాత పూర్తి కోమా కలుగుతుంది.

—: కోమా అయోమయం :—

అపస్మారక స్థితిలో ఉన్న వ్యక్తిని చూసి కోమా ఎందుకు వచ్చిందో తెలియని అయోమయ పరిస్థితి కలగడం అతి సహజం.

మెదడుకి ఇన్‌ఫెక్షను వచ్చినప్పుడు కోమా వస్తుంది. మెనింజైటిస్, ఎన్‌కెఫలైటిస్‌లో కోమా వస్తుంది. మెదడుకి మలేరియా వచ్చినా కూడా కోమా కలుగుతుంది. టైఫాయిడ్ జ్వరం, సెప్టిసీమియా వంటి పరిస్థితుల్లో, మెదడులో కంతులు ఏర్పడినప్పుడూ, విషవాయువులకి గురైనప్పుడు కోమా వస్తుంది.

మూత్ర పిండాలు, కాలేయం వ్యాధుల్లోనూ, మధుమేహ వ్యాధిలోనూ కోమా వస్తుంది. అతి ఉష్ణానికి గాని, అతి శీతలానికి గాని గురైతే కోమా వస్తుంది. ఆల్కహాలు ఎక్కువ తీసుకున్నా, మాదకద్రవ్యాలు, మత్తుబిళ్ళలు ఎక్కువ వాడినా కూడా వస్తుంది.

-: కోమా ఎందుకైనదీ తెలుసుకోవడమెలా ? :-

తలకి దెబ్బ తగిలినట్లు ఎవరైనా చెబితే అందువల్ల కోమా అని అనుకోవచ్చు. కోమాలో ఉన్నవ్యక్తి వదిలే గాలి ఎసిటోన వాసన వేస్తూ వుంటే మధుమేహం వల్ల కలిగిన కోమాగా గుర్తించవచ్చు. చర్మం పసుపు రంగులో ఉంటే కాలేయం వల్ల కలిగిన కోమాగా భావించవచ్చు. చర్మం లేత గులాబీరంగులో కనబడితే కార్బన్ మోనాక్సయిడ్ పాయిజనింగ్ అనుకోవచ్చు. కంటిపాప ముడుచుకుపోయి అతి చిన్నదిగా ఉంటే నల్లమందువల్ల అనుకోవచ్చు. మెదడులో రక్తనాళాలు పగిలినప్పుడు కూడా కంటిపాప చాలా చిన్నది అవుతుంది. మెనింజైటిస్‌లో మెడ కండరాలు పట్టేస్తాయి. మెడ వంచితే వంగదు. మెదడులో కంతులు ఏర్పడటంవల్ల కోమావస్తే కంటిలోపల నరాలు ఉబ్బుతాయి.

-: అంతుపట్టని కోమాని అంతుపట్టడం ఎలా ? :-

చాలా సమయాల్లో కోమా ఎందుకు వచ్చిందీ అంతు

పట్టకుండా అవుతుంది. అందుకని కోమా ఎలా వచ్చిందీ, నిదానంగా వచ్చిందా, అకస్మాత్తుగా వచ్చిందా తెలుసుకోవాలి. మెదడులో రక్తనాళాలు పగలడం, తలకి దెబ్బ వంటి పరిస్థితుల్లో కోమా వెంటనే వస్తుంది. ఎపిలెప్సీ (మూర్ఛ) వంటి పరిస్థితుల్లో అపస్మారక స్థితి కొంతసేపు ఏర్పడుతుంది. అందుకని కోమా వచ్చిన వ్యక్తి విషయంలో ఆరాతీసేటప్పుడు అంతకు ముందెప్పుడైనా అపస్మారకస్థితి ఏర్పడేదా అని అడగాలి. మూర్ఛ తగ్గాక కోమా మళ్ళీ- మళ్ళీ రావచ్చు. అలాగే అపస్మారక స్థితిలో ఉన్న వ్యక్తికి మత్తు బిళ్ళలు వేసుకునే అలవాటు ఉందేమో తెలుసుకోవాలి.

రోగి ఆరోగ్య పరిస్థితి గురించి తెలుసుకోవడం కోమాకి సంబంధించిన క్లూ సంపాదించడానికి మార్గం. రక్తపోటు, మధుమేహం, మూత్రపిండాల జబ్బు, సిర్రోసిస్, మత్తుమందు- మాదక ద్రవ్యాలకి అలవాటు మొదలైన విషయాలు క్షుణ్ణంగా తెలుసుకోవడం అవసరం.

ఎండాకాలమైతే వేడికి గురి అయినదీ లేనిదీ తెలుసుకోవాలి.

కోమా అనేది ఒక కన్‌ఫ్యూజన్ విషయం. అందుకని కోమా రావడానికి కారణాలను దృష్టిలో ఉంచుకుని రోగిని జాగ్రత్తగా పరీక్షించాలి. దానితో కోమా ఎందువల్ల వచ్చిందీ తేలిపోతుంది.



# 7. ఋతుస్రావం రాకపోతే గర్భిణీయా, మరొకటా ?

కొందరిలో ఋతుస్రావం కనబడకపోవడం మొదటి నుంచీ ఉంటే మరి కొందరిలో సడన్‌గా ఆగిపోతుంది.

కొందరు ఆడపిల్లలు యుక్తవయస్సు వచ్చినా రజస్వల అవరు. పైగా పొత్తికడుపు దగ్గర ఎత్తుగా తయారవుతుంది. అది చూసిన వాళ్ళు ఆ అమ్మాయి రజస్వల కాకుండానే గర్భవతి అయిందని అనుకుంటారు.

## —: గడ్డా ? బిడ్డా ? :—

'క్రిప్టోమెనోరియా' అనే ఒక పరిస్థితి ఉంది. ఇటువంటి పరిస్థితిలో ఆ స్త్రీ ఎంతకీ రజస్వల అవడం ఉండదు. కాని కొంతకాలానికి పొత్తి కడుపు దగ్గర ఎత్తుగా ఎదుగుతుంది. తెలియనివారు దానిని చూసి గర్భిణీ అని కూడా అనుకుంటారు

'క్రిప్టోమెనోరియా' పరిస్థితిలో స్త్రీకి స్త్రీత్వం నిండుగా ఉంటుంది. వక్షోజాలు పూర్తిగా వస్తాయి. స్త్రీ రూపంలో ఎటువంటి తేడా ఉండదు. అయినా రజస్వల అయినట్లు కనబడదు. ఇటువంటి స్త్రీలు రజస్వల అవక పోవడం ఉండదు. రక్తస్రావం మాత్రం కనబడదు. దానికి కారణం యోనిద్వారం దగ్గర కన్నెపొర పూర్తిగా మూయబడి ఉంటుంది.

వీరిలో నెల నెలా బహిష్టులు అవడం ఉంటుంది.

కాని రక్తస్రావం కనబడదు. వీరిలో కలిగే రక్తస్రావము బయటకు రావడం కుదరక మర్మావయవాల లోపలే నిలవచేరి పోతుంది. అలా బహిష్టు రక్తం నిలవ చేరిపోవడంతో గర్భాశయం ఉబ్బుకు వస్తుంది.

మొదట్లోనే కన్నెపొర పూర్తిగా మూసి ఉంచిన పరిస్థితిని గుర్తించకపోతే 6–7 మాసాలంత గర్భిణీలాగా కనబడే అవకాశం లేకపోలేదు. ఇలా మూసి ఉంచిన కన్నెపొరని ఆపరేషను చేసి తొలగిస్తే లోపల పేరుకుని పోయిన రక్తమంతా బయటకు వచ్చేస్తుంది. కాన్పు అయిన కడుపు లాగా అంతా తగ్గిపోతుంది.

-: ప్రారంభం శుభం ! కాని... :-

కొందరు మొదట్లో నెల నెలా బహిష్టు మామూలుగా అవుతారు. ఆ తరువాత బహిష్టు రావడం ఆగిపోయి అంతు పట్టని రహస్యంగా మిగిలిపోతాయి. హార్మోన్ల లోపంవల్ల బహిష్టులు రాకపోవచ్చు. మానసిక ఒత్తిడి, ఆందోళన, మెంటల్ షాక్ వల్ల బహిష్టులు ఆగిపోవచ్చు. రక్తహీనత తీవ్రంగా ఉంటేకూడా బహిష్టులు వుండవు. పిట్యూటరీ గ్రంధి, ఎడ్రినల్ గ్రంధిలో కంతులు ఏర్పడితే బహిష్టులు రావు.

వయస్సు మళ్ళుతున్న స్త్రీలలో అకస్మాత్తుగా ముట్లుడిగి శాశ్వతంగా బహిష్టులు ఆగిపోవచ్చు. సాధారణంగా ఈ పరిస్థితి 40–50 సంవత్సరాల వయస్సు వారికి కనబడుతుంది.

ఋతుస్రావం రావలసిన విధంగా నెల నెలా రావడం వుండక ఆగిపోవడాన్ని 'సెకండరీ ఎమెనోరియా' అంటారు. ఇటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు కొన్ని కేసుల్లో కారణం ఏదైనదీ అర్థం కాకుండా అవుతుంది. రోగి జననేంద్రియాల పరీక్ష, అల్ట్రాసౌండు ఎగ్జామినేషను, యం. ఆర్. ఐ., హార్మోన్ల పరీక్ష, ఇతర పరీక్షలు జరిపినప్పుడు ఎమెనోరియాకి కారణం అంతుపట్టవచ్చు.



## 8. పొట్టకి నీరు చేరడంలో అంతర్యం?

కొందరికి పొట్ట (ఎబ్డామిన్) లో నీరు చేరుతుంది. పొట్టలో 1—2 లీటర్ల నీరు చేంతే తప్ప నీరు చేరినట్లు స్పష్టంగా కనబడదు. పొట్టలో నీరు చేరడాన్ని 'ఎసైటిస్' అంటారు.

జీర్ణకోశం నుంచి లివర్‌కి వెళ్ళే రక్తనాళాలకి ఏదైనా అడ్డంకి ఏర్పడితే పొట్టకి నీరు చేరడం అతి సహజం. ముఖ్యంగా లివర్ కుదించుకు పోయినప్పుడు (సిర్రోసిస్ లివర్) పొట్టకి నీరు చేరుతుంది.

గుండె పెరిగినప్పుడు, మూత్ర పిండాలు దెబ్బతిన్నప్పుడు పొట్టకి నీరు వస్తుంది.

కడుపులోపల క్షయవ్యాధి, కేన్సర్, ఇతర వ్యాధులు

వచ్చినప్పుడు కడుపుకి నీరు చేరడం సహజం. లివర్, పాన్‌క్రియాస్, జీర్ణకోశం, గర్భకోశం, అండాశయాలకి టి. బి; కేన్సర్ వచ్చినప్పుడు సాధారణంగా పొట్టకి నీరు చేరుతుంది.

-: అంతుపట్టని నీరు— కొన్ని 'క్లూ'లు :-

కొందరికి పొట్టకి నీరు చేరడంతోపాటు కాళ్ళకి, ముఖానికీ, శరీరం అంతటికీ కొద్దో గొప్పో నీరు వస్తుంది ఈ పరిస్థితిబట్టి 'నెఫ్రొటిక్ సిండ్రోమ్' అనుకోవచ్చు.

ముందుగా కాళ్ళకి నీరు కనిపించి, ఆ తరువాతే పొట్టకి నీరు చేరడం అంటే గుండె పెరగడంవల్ల అని అనుమానించవచ్చు.

పొట్ట బానలాగా తయారై పొట్టకి విపరీతంగా నీరు చేరి కొద్దిపాటిగా నీరు కాళ్ళకి వుంటే 'సిర్రోసిస్ లివర్' అనుకోవచ్చు.

పొట్టకి నీరు చేరడమే కాకుండా పచ్చకామెర్లు (జాండిస్) కూడా వుంటే పోర్టల్ వెయిన్ అబ్‌స్ట్రక్షన్ అనుకోవచ్చు. పోర్టర్ వెయిన్ అబ్‌స్ట్రక్షన్‌లో రక్తంలో ప్రోటీను శాతం బాగా తక్కువగా వుంటుంది.

-: ఏది? ఏలా? :-

సిర్రోసిస్ :- సిర్రోసిస్ లివర్ (లివర్ టిస్యూ పూర్తిగా పాడై కుదించుకుపోవడం) ఉన్న వ్యక్తి అంతకు ముందు మద్యం అతిగా సేవించడం ఉండవచ్చు లేదా అంతకు

ముందు ఏదైనా ఇన్ ఫెక్షను వచ్చి కాలేయం (లివర్)బాగా వ్యాధిగ్రస్తం కావడం వుంటుంది. కొందరిలో అంతకు ముందు రక్తం వాంతి అవడం, విరోచనంలో నల్లగా రక్తం పోవడం, కామెర్లు రావడం ఉంటాయి.

సిర్రోసిస్ పరిస్థితి ఉన్నవారి బుగ్గలు ఎరుపుగా వుంటాయి. బొడ్డు దగ్గర రక్తనాళాలు (సిరలు) ఉబ్బి స్పష్టంగా కనబడతాయి. వికారం, ఆకలి లేకపోవడం వుంటాయి. కొందరిలో మొదట్లో లివర్, స్ప్లీన్ పెరిగి కన బడతాయి. సిర్రోసిస్ లివర్‌లో కొందరికి పచ్చకామెర్లు ఉంటాయి.

మూత్రపిండాల వ్యాధి :- మూత్రపిండాల వ్యాధి వల్ల పొట్టకి నీరు చేరటమే కాకుండా, ముఖానికి, కాళ్ళకి నీరు చేరుతుంది. మూత్రంలో ఆల్బుమిన్ కనబడుతుంది. మైక్రోస్కోప్‌తో పరీక్ష చేస్తే ఎపిథీలియల్ కాస్ట్స ఉంటాయి.

గుండెజబ్బు :- గుండె పెరిగినప్పుడు సిరలన్నీ ఉబ్బుతాయి. మెడదగ్గర రక్తనాళాలు ఉబ్బి కనబడతాయి. కాలేయం ఉబ్బుతుంది. గుండె పెరిగినప్పుడు ముందు కాళ్ళకి, ఒంటికి నీరు కనబడి ఆ తరువాత పొట్టకి నీరు కన బడుతుంది. గుండె పెరగగా పొట్టకి నీరు చేరిన పరిస్థితిలో వ్యక్తి ఆయాసపడటం వుంటుంది.

—: పొట్టలో నీళ్ళా? పాలా? —:

'ఫైలస్ ఎసైటిస్' లో పొట్టలో చేరిన నీరు పాల లాగా కనబడుతుంది. నీరు పాలలాగా కనబడటానికి కడుపులో వున్న ప్రధాన ఎంఫాటిక్ నాళానికి అడ్డంకి ఏర్పడటం లేదా కేన్సర్ కణాలు చేరడం కారణం. బోదకాలు వున్న వారిలో కూడా బోద వ్యాధివల్ల పొట్టలో ఫైల్ చేరి నీరు పాలలాగా కనబడుతుంది.

—: నీరా? గాలా? :—

కొందరికి పొట్ట ఉబ్బుగా ఉంటుంది. అలా ఉబ్బుగా కనబడటానికి నీరు చేరడమా, గాలి పట్టడమా అని అనుమానం వస్తుంది. జీర్ణకోశం ప్రేగులో గాలి దూరి పొట్ట ఉబ్బుగా కనబడుతున్నప్పుడు గాలితో నిండిన ప్రేగులు కదలిక గమనించవచ్చు. పరీక్షచేస్తే ఫ్లూయిడ్ థ్రిల్ కనబడదు. నీరు వున్నప్పుడు పొట్టమీద వేళ్ళుపెట్టి కొట్టితే గట్టిగా అనిపిస్తుంది. గాలి చేరి పొట్ట ఉబ్బుగా తయారైతే వ్రేలుపెట్టి కొట్టితే డొల్లశబ్దం వస్తుంది.

ఒవేరియన్ సిస్ట్ :- కొందరిలో ఒవేరియన్ సిస్ట్ తయారై కడుపు అంతా నీటి సంచితో నిండిపోతుంది. అటువంటప్పుడు పొట్టలో నీరా, ఒవేరియన్ సిస్టా అని తేలకుండా అవుతుంది. ఇటువంటప్పుడు జాగ్రత్తగా పంశీలిస్తే ఒవేరియన్ సిస్ట్ పైభాగం తెలుస్తుంది. మామూలుగా పొట్టకి

నీరు చేరినప్పుడు కడుపు ప్రక్కన కూడా నీరు వుండి అక్కడ కూడా వ్రేలుపెట్టి మోగిస్తే డల్ సౌండు వస్తుంది. ఒవేరియన్ సిస్ట్ అయినప్పుడు పొట్ట ప్రక్కన నీరు ఉండక డొల్లశబ్దం వస్తుంది. ఒవేరియన్ సిస్ట్ కేన్సర్ వల్ల అయితే పొట్టకి కూడా నీరు చేరుతుంది.

నీరు చేరిన మూత్రాశయం :- కొందరిలో మూత్రం పూర్తిగా అవకుండా మూత్రంతో మూత్రాశయం పెద్దదిగా అవుతుంది. చాలావుంది మూత్రం అవుతుందనుకుంటారు గాని వారికి పూర్తిగా అవడం వుండదు. ఇటువంటి వారికి రబ్బరు ట్యూబు మూత్రనాళము ద్వారా వేస్తే మూత్రం మొత్తం బయటకు వస్తుంది. కొందరికి ఆపరేషను చేసి మూత్రం బయటకు వచ్చేటట్లు గొట్టము పెట్టవలసి వుంటుంది.

గర్భిణి :- గర్భిణీ స్త్రీకి గర్భంలో బిడ్డకంటే ఉమ్మ నీరు అధికంగా చేరి పొట్టకి నీరు చేరినట్లు అనిపిస్తుంది.

స్థూలకాయం :- స్థూలకాయం ఎక్కువ వున్నప్పుడు కూడా అది నీరా, క్రొవ్వా అనే అనుమానం కలుగుతుంది.

పొట్టకి నీరు చేరిందని భావించినప్పుడు తక్కిన పరిస్థితులని కూడా దృష్టిలో వుంచుకోవాలి. అప్పుడే అంతు పట్టని "నీరు" అంతు తేలుతుంది.



# 9. ఏ నొప్పో తెలియని కడుపు నొప్పి !

కొందరికి అకస్మాత్తుగా కడుపు నొప్పి వచ్చి అయోమయంలో పడేస్తుంది. గాస్ట్రిక్ నొప్పో, గ్యాస్‌వల్ల వచ్చిన నొప్పో, ఎపిండిసైటిస్సో, ఎమీబియాసిస్సో ఇలా అర్థం కాకుండా ఉంటుంది కడుపులో ప్రేగులు, పాన్‌క్రియాస్, పసరుతిత్తి, మూత్రపిండాలు, మూత్రవాహికలు ఎపిండిక్స్ ఓవరీస్, ట్యూబులు, గర్భాశయం, మూత్రాశయం ఇలా ముఖ్యమైన వెన్నో వున్నాయి. వాటికి వ్యాధి వచ్చినప్పుడు కడుపులో అకస్మాత్తుగా నొప్పి రావడము సహజం. ఏ నొప్పి ఎందువల్లో దేనివల్లో తెలుసుకోవాలి.

—: వ్యాధి ఒకచోట నొప్పి మరొకచోట :—

కడుపులో వచ్చే ప్రతీ నొప్పికీ కడుపులోనే కారణమై ఉండనవసరం లేదు. ఉదాహరణకి గుండెపోటు కడుపు నొప్పిగా పై కడుపులో అనిపించవచ్చు. ఇటువంటి నొప్పిని 'రిఫెర్డ్ పెయిన్' అంటారు.

పొట్టపై చర్మంమీద వచ్చే "హెర్పిస్ జోస్టర్' వంటి వ్యాధులు కూడా కడుపులో నొప్పిలాగా భ్రాంతి కలిగించవచ్చు.

న్యూమోనియా, ప్లూరస్, వెన్నుపూస వ్యాధులు వల్ల కూడా కడుపులో నొప్పి అనిపించవచ్చు.

అకస్మాత్తుగా వచ్చే ఎపెండిసైటిస్ [24 గంటల

నొప్పి] మొదట బొడ్డు చుట్టూతా గాని, పై కడుపులోగాని అనిపించవచ్చు. ఆ సమయంలో రోగిని నీకు నొప్పి ఎక్కడ అని అడిగితే పై కడుపులోనో, బొడ్డు దగ్గరో చూపిస్తాడు గాని ఎపెండిక్స్ ఉన్న చోట చూపించడు. కొన్ని గంటల వరకు ఆ నొప్పి ఎపెండిక్స్ వుంటే కుడి డొక్కలో సెటిల్ అవదు. అటువంటప్పుడు ఈ నొప్పి ఇంటస్టయినల్ కాలిక్ పెయినా, యురెటర్ కాలిక్ పెయినా, ఎమిాబియాసిస్సా, గాస్ట్రిక్ పెయినా, పెర్ ఫోరేషనా అనేది తెలకుండా అవుతుంది.

—: చోటుబట్టి పోటు :—

చాలావరకు నొప్పి వచ్చినా చోటుబట్టి కడుపునొప్పి ఏదైనదీ తెలుసుకోవచ్చు.

పై కడుపులో నొప్పివస్తే జీర్ణాశయంలో పుండు (పెప్టిక్ అల్సర్), పసరుతిత్తి వాపు, పాన్క్రియాస్ నొప్పి కావచ్చు. కాస్త ఇటూ అటూ అయితే— కాలేయం, పసరుతిత్తి, స్ప్లీన్, పెద్దప్రేగు నొప్పి కావచ్చు.

కుడి డొక్కలో నొప్పి ఎపెండిక్స్, జీర్ణకోశం, ప్రేగు మూత్రవాహికల నొప్పి ఏదైనా కావచ్చు. పొత్తికడుపు దగ్గర నొప్పి అయితే మూత్ర వాహికలు, మూత్రకోశం, జీర్ణ కోశం ప్రేగు, గర్భాశయం, ఓవరీస్, అండవాహికలకి సంబంధించిన నొప్పి కావచ్చు.

కొందరికి కడుపు నొప్పి వీపు నొప్పిగా తెలుస్తుంది.

ముఖ్యంగా మూత్రవాహికల్లో రాళ్ళు అంటే మూత్ర పిండాలు, పాన్క్రియాస్ వ్యాధిగ్రస్తం అయితే ఆ నొప్పి నడుము నొప్పిగా వస్తుంది.

-: నొప్పి నేచర్ బట్టి వ్యాధిని పసిగట్టడం :-

గాస్ట్రిక్ అల్సర్ నొప్పి మంటగా ఉంటుంది. మెలి పెట్టే విధంగా ఉండే నొప్పి పసరుతిత్తి, జీర్ణకోశం ప్రేగులు, మూత్రవాహికల స్పాజమ్‌వల్ల అవుతుంది. జీర్ణకోశానికి సంబంధించిన స్పాజమ్ కొద్దిసేపు వుండటం, పోవటం, మళ్ళీ కనబడటం వుంటుంది. యాంటిస్పాజమాటిక్ ఇంజక్షనుగాని బిళ్ళలు గాని ఇస్తే నొప్పి వెంటనే తగ్గిపోతుంది.

స్పాజమ్ పెయిన్ కొద్దిసేపే వుండి తగ్గిపోవడమనేది మూత్రవాహికల స్పాజమ్ అవుతుంది. ఎక్కువసేపు (గంటల తరబడి) వుండే కడుపునొప్పి సాధారణంగా పొట్ట లోపల ప్రేగువాపు, ప్రేగువాపుకి సంబంధించినది అవు తుంది. ప్రేగు నొప్పే కాకుండా ఇతర భాగాలకి వచ్చిన ఇన్‌ఫెక్షను, ఇన్‌ఫ్లమేషనువల్ల కడుపులో నొప్పి గంటలు, పూటల తరబడి వుంటుంది.

-: నొప్పికీ తిండికీ లింకె :-

అన్నం తినగానే నొప్పి తగ్గితే గాస్ట్రిక్ అల్సర్ అవుతుంది. అన్నం తిన్న రెండు- మూడు గంటలకి నొప్పి వస్తే డ్యుయోడనల్ అల్సర్ అవుతుంది. అన్నం తినగానే

వచ్చే కడుపునొప్పి సాధారణంగా వ్యాధికి సంబంధించడం అవదు.

బస్సు ప్రయాణం చేసినా, గతుకుల రోడ్డులో ప్రయాణం చేసినా వెంటనే తీవ్రంగా నొప్పి వస్తే పసరి తిత్తిలో గాని, మూత్రవాహికలోగాని రాయి వుండడం అవుతుంది.

-: కడుపు నొప్పిలో కొన్నింటి ముఖ్య లక్షణాలు :-

ఎక్యూట్ ఎపెండిసైటిస్ :- దీనినే 24 గంటలజబ్బు అంటారు. శక్తివంతమైన యాంటిబయాటిక్స్ లేని పూర్వపు రోజుల్లో ఎపెండెక్స్‌కి చీము పడినప్పుడు 24 గంటల్లో ఆపరేషను చేయకపోతే అది పగిలిపోవడం, కడుపు అంతా చీము చేరడం, సెప్టెసీమియా, షాక్ రావడం, ప్రాణం పోవడం వంటివి ఉండేవి. అందుకని దీనిని 24 గంటల జబ్బుగా చెప్పుకునేవారు. ఎపెండిసైటిస్ నొప్పి మొదట బొడ్డుచుట్టూతా అనిపిస్తుంది. పై కడుపులోకూడా నొప్పి అనిపిస్తుంది. తరువాత కొన్ని గంటలకి కుడివైపు డొక్కలో నొప్పి నిలకడగా వుండిపోతుంది. ఎపెండిసైటిస్ నొప్పి కొలిక్ పెయిన్‌లా కూడా వుంటుంది. ఎపెండిసైటిస్ వచ్చినప్పుడు ఒకటి రెండు వాంతులు అవడం, ఆకలి అనిపించక పోవడం వుంటుంది. 102 డిగ్రీల వరకు జ్వరం వుంటుంది. ఎపెండిసైటిస్‌కి సరైన చికిత్స వెంటనే జరగకపోతే కుడి డొక్కలో చీము గడ్డ తయారవుతుంది.

లుగా కనబడతాయి నాడి వేగంగా కొట్టుకొంటుంది వాంతులు అవుతాయి. వాంతి పల్లగా ఉంటుంది.

టైఫాయిడ్ అల్సర్ పెర్‌ఫొరేషన్ :– టైఫాయిడ్ జ్వరం వచ్చి 15 రోజులైనా తగ్గకుండా ఉండేవారిలో జీర్ణకోశం ప్రేగుల్లో ఏర్పడిన టైఫాయిడ్ అల్సర్స్ పగిలి ప్రేగుకి కన్నంపడే అవకాశం వుంది. ఈ రకంగా ప్రేగుకి చిల్లుపడే పరిస్థితిని పెర్‌ఫొరేషను అంటారు. టైఫాయిడ్ అల్సర్ పెర్‌ఫొరేషనులో రోగి పరిస్థితి అకస్మాత్తుగా విషమిస్తుంది. నాడి వేగంగా కొట్టుకుంటుంది. జ్వరం సడనుగా తగ్గిపోయి సబ్‌నార్మల్ అయిపోతుంది. కడుపులో విపరీతంగా నొప్పి వస్తుంది.

ఎక్యూట్ ఇంటస్టయినల్ అబ్‌స్ట్రక్షన్ :– జీర్ణకోశం ప్రేగులు ఏ కారణం వల్లనైనా కదలిక లేకుండా ఆగిపోతే ముఖ్యంగా నాలుగు లక్షణాలు కనబడతాయి. 1. నొప్పి 2 వాంతులు 3. అసలు విరోచనం కాకపోవడం 4. కడుపు ఉబ్బరం.

ఎక్యూట్ ఇంటస్టయినల్ అబ్‌స్ట్రక్షనులో కడుపులో కాలిక్ పెయిన్ వస్తుంది. ఈ నొప్పి 15–30 సెకండ్లుపాటు కనబడి 2–3 నిమిషాలు విరామం ఇస్తుంది. వాంతులలో మొదట తిన్న ఆహారం ఉంటుంది. తరువాత పసరువస్తుంది. ఆపై మలం కూడా రావచ్చు.

ఎక్యూట్ ఇంటససప్షన్ :– ఈ పరిస్థితి చిన్నపిల్లలో

ఎక్కువ. ప్రేగు పై భాగంలో క్రిందిభాగం దూరిపోతుంది. వాంతులు అవుతాయి. విరోచనం అవదు. కాని విరోచనం అయినట్టుగా మ్యూకస్ మాటిమాటికి మలద్వారం నుంచి బయటకు వస్తుంది. మ్యూకస్‌తో పాటు రక్తముకూడా ఉంటుంది.

రప్చర్డ్ ఎక్టోపిక్ జెస్టేషన్ :- కొందరికి గర్భాశయంలో కాకుండా అండవాహికల ట్యూబుల్లో గర్భం వస్తుంది. ఇలా ట్యూబులో గర్భం వచ్చినప్పుడు అది పగిలి పోయి తీవ్రమైన కడుపునొప్పి వస్తుంది. ఈ నొప్పి పొత్తి కడుపులో వస్తుంది. నెల నెలా బహిష్టు వచ్చే స్త్రీ బహిష్టు రాకుండా ఆగిపోయి ఆ తరువాత కొన్ని వారాలకి ఇలా నొప్పివస్తే ఎక్టోపిక్ జెస్టేషన్ రప్చర్‌గా భావించవచ్చు. దీనివల్ల వాంతులు ఉంటాయి. ఆ స్త్రీ పరిస్థితి చాలా ఆందోళనగా కనబడుతుంది. ఆయాసం ఉంటుంది. నాడి చాలా వేగంగా కొట్టుకుంటుంది. షాక్ లక్షణాలు ఉంటాయి.

అకస్మాత్తుగా కడుపు నొప్పి వచ్చినప్పుడు పై విషయాలని దృష్టిలో పెట్టుకొని పరీక్షిస్తే కడుపునొప్పికి కారణం అంతుపట్టుతుంది. ఎక్సరే తీస్తే, అల్ట్రాసౌండు స్కానింగు చేస్తే కొంతవరకు అకస్మాత్తుగా వచ్చిన కడుపు నొప్పికి కారణం తెలుస్తుంది.



# 10. వక్షోజాలలో గడ్డలు ఏమైన ఉంటాయి?

చాలామంది స్త్రీలకి వక్షోజాలలో గడ్డలు తయారవు తాయి. ఆ గడ్డలని చూసి కేన్సర్ అని భయపడతారు కూడా. ఆ గడ్డలు పెద్ద పజిల్ కూడా.

వక్షోజాలో వచ్చే ప్రతీ గడ్డ కేన్సర్ కాదు. అది చీముగడ్డ కావచ్చు. ఫైబ్రోఎడినోమా కావచ్చు.

ఎక్యూట్ మాస్టయిటిస్ :- బిడ్డకి పాలు ఇస్తున్న రోజుల్లో వక్షోజాలు గడ్డలుగా తయారవడం మామూలు. అలా తయారైన గడ్డలు బాగా నొప్పిగా ఉంటాయి. ముట్టు కుంటే ఎంతో సలపరంగా వుంటాయి. ఈ గడ్డలు కేన్సర్ గడ్డలు కావు. యాంటిబయాటిక్స్ వాడితే తగ్గిపోతాయి.

క్రానిక్ యాబ్సెస్ :- కొందరికి చీము గడ్డలు అక స్మాత్తుగా తయారవుతాయి. అలా అనుకోకుండా తయా రయ్యే చీముగడ్డలు చాలా సలపరం కలిగిస్తాయి. గడ్డలు పైన చర్మం నీటితో ఉబ్బుతుంది. గడ్డని నొక్కితే మెత్తగా అనిపిస్తుంది. కొందరిలో గడ్డలు అకస్మాత్తుగా కాకుండా నిదానంగా వచ్చి క్రానిక్ అవుతాయి. ఈ గడ్డలు చీము గడ్డలు కావచ్చు లేదా టి. బి. గడ్డలు కావచ్చు. ఈ గడ్డ- గట్టిగా వుంటుంది. చనుమొనల నుంచి చీము వస్తుంది.

ఫైబ్రో ఎడినోసిస్ :- ఈ గడ్డలు బహిష్టు సమ యంలో పెద్దవి అవుతాయి. అంతకుముందు ఉన్నప్పటికీ

స్త్రీలు వాటిగురించి పట్టించుకోరు. బహిష్టు స్రావం రోజు దగ్గర పడుతుందన్న వారం- పదిరోజులప్పుడు వక్షోజాలు బరువెక్కడం, సలపరం అనిపించడం, పరిమాణం పెరగడం వుంటాయి. సాధారణంగా ఈ పరిస్థితి రెండు వక్షోజాలలో వుంటుంది. ఫైబ్రో ఎడినోసిస్‌కి సంబంధించిన గడ్డలు ఒకటికి మించి ఎక్కువ వుంటాయి. పట్టుకుంటే చిన్న చిన్న గడ్డలు లాగా వుంటాయి. వక్షోజాలలో గడ్డలు పెరిగి సలపరం కలిగినప్పుడు చంకల్లోని లింఫ్‌గ్లాండ్లు కూడా కొన్ని పెద్దవి అవుతాయి. బహిష్టుకి ముందు పెద్దవి అయ్యే ఈ పరిస్థితిని ప్రొజస్టిరోన్ హార్మోను బిళ్ళలు ఇవ్వడంద్వారా కంట్రోలు చేయవచ్చు.

పైబ్రో ఎడినోమా :- ఫైబ్రో ఎడినోమాకి వక్షోజపు గడ్డలు గట్టిగా వుంటాయి. ఈ గడ్డలు గట్టిగా స్పష్టంగా వుంటాయి. చేతితో పట్టుకుని కదిపితే ఇటూ, అటూ తేలికగా కదులుతాయి. ఈ గడ్డలు చర్మానికిగాని, కండరాలకిగాని అంటుకుని పోవడం వుండదు. ఇందులో చంకలో వుండే లింఫ్‌గ్లాండ్లు ఉబ్బడం ఉండదు.

కేన్సర్ గడ్డలు :- వక్షోజాలలో వచ్చే కేన్సరు గడ్డలు నొప్పి వుండవు. ఈ గడ్డలు రాళ్ళలాగా గట్టిగా అని పిస్తాయి. ఇవి గుండ్రంగా వుండకుండా వంకర టింకరగా ఉంటాయి.

వక్షోజాలలో కేన్సర్ గడ్డలు ఉన్నప్పుడు వాటిస్థితి

బట్టి నాలుగు దశలుగా వర్గీకరించడమైంది. మొదటి దశ లోని గడ్డల విషయంలో కేన్సర్ కేవలం ఆ గడ్డల వరకే పరిమితం అవుతుంది. రెండవ దశకి చేరిన గడ్డలు ఛాతీ కండరాలకి అంటుకుని పోతాయి. అవి తేలికగా ఇటు, అటు కదలవు. ఈ గడ్డలకి సంబంధించిన కేన్సర్ వ్యాధి చంకల లోని లింఫ్‌గ్లాండులకికూడా వ్యాపిస్తుంది. అయితే ఆ గడ్డలు వేటికవి తేలికగా ఇటు-అటు కదులుతాయి. మూడవ దశకి చేరిన గడ్డలు పూర్తిగా ఛాతీ కండరాలకి అంటుకుపోవడమే కాకుండా వక్షోజాలకి సంబంధించిన చర్మంకూడా ఆ గడ్డలకి అంటుకు పోతుంది. ఆ గడ్డలమీద చర్మం వాటికి అంటుకు పోయి కదలకుండా అవుతుంది. నాలుగవ దశకి చెందిన కేన్సరు గడ్డలు పూర్తిగా కదలకుండా అవడమే కాకుండా చనుమొనలు కూడా లోపలకి గుంజబడతాయి. చంకల్లోని గడ్డలు కూడా పెద్దవి అవడమే కాకుండా ఒకటి కొకటి బిగుసుకుని పోతాయి. కాలర్ బోన్‌పైన ఉన్న లింఫ్‌గ్లాండ్లు కూడా బిగుసుకుంటాయి. శరీరంలోని ఇతర భాగాలకికూడా ఈ వ్యాధి వ్యాపిస్తుంది.

పై విధంగా వక్షోజాలలో వచ్చిన గడ్డలని కేన్సర్ గడ్డలు అయినదీ కానిదీ నిర్ధారణ చేసుకోవచ్చు. బయాప్సీ తీసికూడా ఆ గడ్డలు ఏ గడ్డలైనవీ నిర్ధారణ చేసుకోవచ్చు.

# 11. మూర్ఛవ్యాధి ఫిట్సా ? మనోవ్యాధి ఫిట్సా ?

కొందరికి వంపులు (ఫిట్సు) వచ్చి ఒళ్ళంతా బిగదీసుకు పోతుంది. మెదడు నరాలలో జబ్బు ఉండటంవల్ల మూర్ఛ వ్యాధి (ఎపిలెప్సీ) ఫిట్సు వస్తాయి. మానసికంగా బాధ ఉంటేకూడా ఫిట్సు వస్తాయి. వీటిని హిస్టీరికల్ ఫిట్సు అంటారు. మామూలు వాళ్ళకి ఈ రెండూ చూడటానికి ఒకలే విధంగా అనిపిస్తాయి. ఒక్కొక్కసారి డాక్టరునికూడా డైలమాలో పడేస్తాయి.

-: మూర్ఛవ్యాధి ఫిట్సు :-

మూర్ఛవ్యాధి [ఎపిలెప్సీ] ఫిట్సు సాధారణంగా ఒక నియమిత వ్యవధిలో వస్తాయి. కొందరికి ప్రతీవారం వస్తే, కొందరికి నెలకి ఒకసారి, మరికొందరికి ఆరు నెలలకి ఒకసారి వస్తాయి.

ఎపిలెప్సీ ఫిట్సు వచ్చినప్పుడు స్పృహ పూర్తిగా పోతుంది. చుట్టూ ఎవరున్నదీ, ఏమున్నదీ తెలియదు. అకస్మాత్తుగా ఫిట్సువచ్చి రోడ్డు మధ్యలో పడిపోవచ్చు, వంటచేస్తూ ఫిట్సువచ్చి పొయ్యిలో పడిపోవచ్చు. ఈత ఈదుతూ ఫిట్సువచ్చి నీటిలో మునిగిపోవచ్చు. మంచంమీద పడుకున్నవాడు ఫిట్సువచ్చి తన్నుకుని క్రిందపడిపోతాడు. కాలు, చెయ్యి విరగగొట్టుకోవచ్చు.

ఎపిలెప్సీ ఫిట్సు వచ్చినప్పుడు సాధారణంగా బట్టల్లోనే మూత్రం పోసుకోవడం ఉంటుంది. ఎపిలెప్సీ ఫిట్సు రావడానికి మొదడులోని వ్యాధే కారణంగాని మానసిక ఆందోళన, బాధ కారణం కాదు. ఎపిలెప్సీ ఫిట్సు ఎక్కడైనా రావచ్చు. జనం ఉన్నచోటే రావాలని లేదు.

ఎపిలెప్సీ ఫిట్సు వచ్చినవాళ్ళు సాధారణంగా నాలిక కరుచుకుంటారు. నోటివెంట చొంగ వస్తుంది. ఫిట్సు రాగానే కంటిగుడ్లు బొంగరంలాగా గిరగిర తిరుగుతాయి. కాలు, చెయ్యి, తల కంట్రోలు లేకుండా ఎగరేయడము ఉంటుంది.

ఎపిలెప్సీ ఫిట్సు సాధారణంగా కొద్ది నిమిషాలు ఉండి తరువాత నిద్రలోకి జారుకోవడం, నిదానంగా స్పృహలోకి రావడం ఉంటుంది.

## —: హిస్టీరికల్ ఫిట్సు :—

హిస్టీరికల్ ఫిట్సు సాధారణంగా ఒక ప్రయోజనాన్ని ఆశించి వస్తాయి. మనస్సులో ఏదైనా బాధ ఉంటే ఫిట్సు రూపంలో వ్యక్తమవుతాయి. భర్తగాని, తనవాళ్ళుగాని తాను ఆశించినంత ఆదరణ, ప్రేమ చూపడం లేదనుకుంటే వారి దృష్టిని, సానుభూతిని తనవైపు మళ్ళించుకోవడం కోసం ఫిట్సు రూపంలో వ్యక్తమవుతాయి.

హిస్టీరికల్ ఫిట్సుకి ఒక నియమిత వ్యవధి వుండదు. ఎప్పుడు పడితే అప్పుడు వస్తాయి. నెలల తరబడి ఫిట్సు

రాకపోవచ్చు. ఒక్కొక్కసారి ప్రతీరోజు ప్రతీ పూటా రావచ్చు.

హిస్టీరికల్ ఫిట్సు వచ్చినవారు తమ బట్టల్లో మూత్ర విసర్జన చేయరు.

జనం ఉన్నచోటే, తనవాళ్ళు ఉన్నచోటే హిస్టీరికల్ ఫిట్సు వస్తాయి. రోడ్డుమధ్యలో పిట్టువచ్చి పడిపోవడం పొయ్యిలో, నీటిలో పడిపోవడం వుండదు. క్రిందపడి దెబ్బలు తగిలించుకోవడం అసలే వుండదు. ఫిట్సువచ్చి మంచం మీదినుంచి పడిపోయినట్లు, ప్రవర్తించినా దెబ్బ తగలకుండా జాగ్రత్తపడి పడటం వుంటుంది.

నాలిక కరుచుకోవడం, కంటిగ్రుడ్లు బొంగరంలాగా గిరగిర తిరగటం ఉండదు. హిస్టీరికల్ ఫిట్సువస్తే కొందరిలో గంటల తరబడి వుంటాయి. గంటల తరబడి స్పృహాలేనట్లు బిగదీసుకుని పడి ఉంటారు. వీరికి నోటివెంట నురగరాదు. ఎపిలెప్సీ పిట్టు వచ్చిన తరువాత పూర్తిస్పృహ రావడానికి సమయం పట్టితే హిస్టీరికల్ పిట్టు వచ్చినవాళ్ళు పిట్టు అయిపోగానే వెంటనే మెలకువలోకి వచ్చేస్తారు.

## —: తెలివిగా హిస్టీరికల్ ఫిట్సు :—

ఎపిలెప్సీకి, హిస్టీరికల్ పిట్సుకి తేడా తెలుసుకున్న హిస్టీరికల్ పర్సనాలిటీ వ్యక్తులు తమకి పిట్సు వచ్చినప్పుడు నోటినుంచి నురగ తెప్పిస్తారు. ఒక్కొక్కసారి కావాలని చిన్న చిన్న దెబ్బలూ తగిలించుకుంటారు. కంటిగ్రుడ్లు పైకి

పోనిచ్చి తీక్షణంగా చూస్తారు. కాని ఎపిలెప్సీలోలాగా కంటి గ్రుడ్లు గిరగిర తిరగవు.

హిస్టీరికల్ పిట్సుకీ, ఎపిలెప్సీకీ తేడా లేనట్లు కనబడినా వాటి తేడాని తెలుసుకోవచ్చు. దూదిని సన్నగా చుట్టి నల్లగుడ్డుమీద పెట్టితే హిస్టీరికల్ పిట్సువాళ్ళు కంటి రెప్పలు ఒక్కసారిగా మూస్తారు. ఎపిలెప్సీ పిట్సు అయిన వాళ్ళు కంటిరెప్ప కదల్చడం ఉండదు. పాదంక్రింద సూదైన దానితో గీస్తే ఎపిలెప్సీ పిట్సులో బొటనవ్రేలు పైకి ముడుచుకుంటుంది. హిస్టీరికల్ పిట్టు మామూలుగానే ఉంటుంది.



## 12. రక్తం పడటం కడుపులో నుంచా ? లంగ్స్ నుంచా ?

కొందరు రక్తం వాంతి చేసుకుంటారు. మరి కొందరికి దగ్గితే రక్తం పడుతుంది. ఒక్కొక్కసారి ఈ రక్తం ఎక్కడినుంచి వచ్చిందో అంతు పట్టకుండా ఉంటుంది. సాధారణంగా నోట్లోనుంచి రక్తం పడటం ఉంటే నోరుని పరీక్షచేస్తే పళ్ళు, చిగుళ్ళు గొంతునుంచి రక్తం రావడము తెలుస్తుంది.

శ్వాస కోశాలనుంచి రక్తం వచ్చే సందర్భాలలో

కొద్దో గొప్పో దగ్గు ఉండకపోదు జాగ్రత్తగా అడిగి తెలుసు కుంటే రక్తం పడటానికి ముందు కొద్దిగా దగ్గు వచ్చిందని చెబుతారు. అయితే దగ్గిన తరువాతే అది వచ్చిందని గమ నించరు.

—: దగ్గితే పడే రక్తం :—

దగ్గితే పడిన రక్తం ఎర్రగా ఉంటుంది. ఆ రక్తంలో కొంత కళ్ళె, తెమడ కలిసి వుండవచ్చు. దగ్గడం ద్వారా రక్తం పడేవారికి అంతకు ముందు వారికి టి. బి, బ్రోంకై ఎక్టేసిస్ వ్యాధి వుండటం సహజం. బ్రోంఖయిటిస్ ఉన్న వారికి కూడా రక్తం పడుతుంది. కేన్సర్ వున్న వారిలో కూడా దగ్గితే రక్తం పడుతుంది దగ్గితే రక్తం పడినవారి విరోచనం పరీక్షచేస్తే మామూలు రంగులోనే వుంటుంది. దగ్గితే రక్తం పడటం ఒకేసారి కాకుండా చాలాసార్లు, చాలా రోజులు పాటుకూడా వుంటుంది.

—: వాంతిలో రక్తం :—

కొందరికి వాంతి ద్వారా రక్తం పడుతుంది. వీరిలో రక్తం ఎర్రగాకాకుండా ఊదారంగులో ఉంటుంది. వాంతితో రక్తం పడినప్పుడు అందులో కల్లెగాని, తెమడగాని, జిగురు గాని వుండదు. వాంతితో పడే రక్తంలో అన్నము కలిసి వుండవచ్చు.

వాంతిద్వారా రక్తం పడేవారికి అంతకు ముందువారికి

కడుపులో మంట, నొప్పి వుండవచ్చు. గాస్ట్రిక్ అల్సర్ లేదా గాస్ట్రయిటిస్ వున్నట్లు తెలిసి వుంటుంది. కొందరికి గాస్ట్రిక్ కేన్సర్ వుంటుంది.

వాంతిద్వారా రక్తం పడినవారిని ప్రశ్నిస్తే వారి విరోచనం నల్లగా వుంటుంది. వాంతిద్వారా రక్తం పడటం రోజులు తరబడి వుండదు.

నోటిద్వారా రక్తము పడుతున్నప్పుడు వ్యక్తిని పూర్తిగా పరీక్ష చేయడం, ఆరోగ్య పరిస్థితిని అడిగి తెలుసుకోవడం, ఎక్స్‌రే పరీక్ష, ఎండోస్కోపీ పరీక్ష చేస్తే రక్తం ఎక్కడనుంచి పడుతున్నదీ తేలుతుంది.



# 13. తలనొప్పిలో ఏ రకం తలనొప్పి ?

తలనొప్పి ఏమైనదీ ప్రేలక తికమక పడటం సహజం. తలనొప్పికి ప్రధానంగా నాలుగు కారణాలు.

1. మానసిక కారణాలు
2. మెదడులోపల కంతులు ఏర్పడటం
3. యురీమియా, డయబిటిస్ వంటి కారణాలు
4. మైగ్రేన్, టెన్షన్ తలనొప్పులు, ఇతర శారీరక బాధలవల్ల కలిగే తలనొప్పులు.

మానసికంగా తలనొప్పి ఉందని బాధపడే వ్యక్తి

రోజులు, వారాల తరబడి తలనొప్పితో బాధపడతాడు ఒక పెద్దగుడ్డ తీసుకుని తలచుట్టూ గట్టిగా బిగించి కట్టుకుంటాడు. ఇలా కట్టుకోవడానికి నొప్పికంటే ప్రెషర్ (ఒత్తిడి)కారణం. డిప్రషన్, ఆందోళన, ఆవేశం వల్ల వచ్చే తలనొప్పులు మామూలుగా వాడే తలనొప్పి బిళ్ళలతో తగ్గవు.

ఉదయం లేస్తూనే తలనొప్పి అనిపించి, రెండు చేతులతో తల పట్టుకుని కూర్చోగా వాంతి అయిపోయి ఆ రోజుకి తగ్గిపోయే నొప్పి సాధారణంగా మెదడులోపల ప్రెషరువల్ల అవుతుంది.

మెదడు లోపల ప్రెషరు అనిపించే వ్యక్తి తలనొప్పి వున్న సమయంలో చాలా తక్కువగా మాట్లాడతాడు. ఎక్కువ మాట్లాడితే తలనొప్పి కూడా ఎక్కువ అనిపిస్తుంది.

-: ప్రతీ తలనొప్పి ప్రమాదకరమైంది కాదు :-

మెదడులో ప్రెషరు, కంతివల్ల కొందరిలో తలనొప్పి రావడం వుంటే మరికొందరిలో జ్వరంవల్ల, అతిగా మద్యం సేవించడంవల్ల తలనొప్పి కలుగుతుంది. ముఖ్యంగా మద్యం మైకం వదిలే సమయంలో (హాంగ్ ఓవర్ లో) తలనొప్పి అనిపిస్తుంది.

తలకి దెబ్బ తగలడం, వడదెబ్బ తగలడం, మెదడుకి రక్తం సరఫరా తగ్గడంవంటి పరిస్థితుల్లో కూడా తలనొప్పి తీవ్రంగా వుంటుంది.

-: మైగ్రేన్ తలనొప్పిని తెలుసుకోవడమెలా ? :-

మైగ్రేన్ తలనొప్పి సాధారణంగా వంశ పారం పర్యంగా వస్తుంది. తలకి ఒకవైపే నొప్పి అనిపిస్తుంది. ఎండ చూచినకొద్దీ నొప్పి ఎక్కువ అవుతుంది. తలనొప్పి వచ్చే ముందు కంటిముందు రింగులు రింగులు లాగానో, మరో లాగానో కనబడతాయి. తలనొప్పి రావడానికి 10_15 నిమిషాలు ఇటువంటి చికాకు పరిస్థితి ఉండవచ్చు. ఆ తరు వాత ఒక చెంపన నొప్పి మొదలవుతుంది. నిదానంగా రెండవ వైపుకి కూడా నొప్పి అనిపించవచ్చు. ఈ నొప్పి చాలా తీవ్రంగా వుంటుంది నొప్పి ఎక్కువైన తరువాత వాంతి అవవచ్చు. కొందరు ఈ నొప్పికి తట్టుకోలేక స్పృహ తప్పి పడిపోతారు. మైగ్రేన్ తలనొప్పి 4 నుంచి 48 గంటల పాటు వుంటుంది.

-: కళ్ళజోడుతో తలనొప్పి పోవచ్చు ! :-

కొందరికి కళ్ళకి సంబంధించిన దోషంఉండి తలనొప్పి వస్తుంది. వీరికి కళ్ళు పరీక్ష చేసి కళ్ళజోడు పెట్టితే తల నొప్పి తగ్గిపోతుంది. గ్లాకోమా అనే కళ్ళవ్యాధి వల్ల కూడా తలనొప్పి వస్తుంది.

మెడ దగ్గర కండరాలు, లిగమెంట్లు బిగదీసుకోవడం వల్ల కూడా తలనొప్పి వస్తుంది. సైనుసైటిస్ వల్ల కూడా తలనొప్పి వస్తుంది.

## —: తలనొప్పిలో తేడాలు :—

తలనొప్పి రావడానికి ఎన్నో కారణాలు. మానసిక ఆందోళన, ఒత్తిడి, మానసిక వ్యాధుల వల్ల తలనొప్పి రావడం ఉంటే, మెదడు వ్యాధులు, మెదడులో కంతులవల్ల తలనొప్పి వస్తుంది. రక్తనాళాల వ్యాకోచ సంకోచనాలవల్ల తలనొప్పివస్తే, విషజ్వరాలు, యురీమియా, డయబిటిస్‌వంటి పరిస్థితుల్లో తలనొప్పి వస్తుంది.

## —: ఏ తలనొప్పో తేల్చుకోవడమెలా ? :—

తలనొప్పి ఎలా ప్రారంభ మవుతున్నదీ, ఎంతసేపు ఉంటున్నదీ, నొప్పి ఏ రకంగా వున్నదీ, ఏ చోట ఎక్కువ అనిపిస్తున్నదీ, వదలకుండా వుంటున్నదా, వచ్చి పోతూ ఉందా, తలనొప్పి ఎప్పుడు ఎలా ఎక్కువ అవుతున్నదీ, వంశంలో ఇంకెవ్వరికైనా ఉన్నదా అనే అంశాలని దృష్టిలో ఉంచుకుని పరిశీలించడం అవసరం.

తలనొప్పి సంగతి అంతుపట్టనప్పుడు తక్కిన సాధారణ పరీక్షలతోపాటు సి. టి స్కానింగ్, యం. ఆర్. ఐ. పరీక్షలు, రక్త పరీక్షలు జరపాలి.



# 14. నోటి దుర్వాసన ఎక్కడనుంచి ?

కొందరు మాట్లాడితే చాలు నోరు వాసన వేస్తుంది. పళ్ళు చూస్తే బాగానే ఉంటాయి. పాచి కనబడదు చిగుళ్లు కూడా పాచి వుండవు. నోట్లో ఎక్కడా పుండు కనబడదు. అయినా నోరు తెరిస్తే చాలు దుర్వాసన.

అది అలా వుండగా ఎంత పరీక్ష చేసినా, ఎక్కడ చూసినా ఏదీ కనబడదు అయినా తమ నోరు వాసన వేస్తోందని బాధపడిపోతూ ఉంటారు మరికొందరు. వాళ్ళకి ఎదుటి వాళ్ళముందు నోరు తెరవాలంటేనే భయం. ఎదుటి వాళ్ళు తమ గురించి చెడుగా అనుకుంటారేమోనని ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సుతో క్రుంగిపోతూ వుంటారు. చివరికి ప్రియురాలు ముందుకూడా నోరు విప్పడానికి భయపడతారు. ముద్దు పెట్టడానికి వణికిపోతారు. తమలో తామే కుళ్ళిపోతూ ఉంటారు. "మీ నోరు వాసన వేయడంలేదు. ఎందుకలా నోటికి గుడ్డ అడ్డం" అని అంటే "ఎందుకులేదూ, నాకు తెలుస్తోంది కదా, నోరు ఎంతో వాసనగా వుంది." అంటారు. చివరికి నోటి దుర్వాసన అంతుపట్టని విషయంగా మారుతుంది.

–: నోటి దుర్వాసన — కారణాలు :–

అశుభ్రమైన నోరు, పళ్ళ సందున చిక్కుకుని చీకిపోయిన ఆహారం, చీము పట్టిన చిగుళ్ళు, పిప్పిపళ్ళు నోటి దుర్వాసనకి ప్రధాన కారణాలు.

గొంతులో టాన్సిల్స్ చీముపట్టినా, ఇతర గొంతు వ్యాధుల వల్లకూడా నోటి దుర్వాసన కలుగుతుంది.

కొందరికి నోరు, గొంతు ఆరోగ్యంగానే వుంటాయి. కాని వారు మాట్లాడుతూ వుంటే ఎదుటివాళ్ళు ముఖం ప్రక్కకి త్రిప్పుకు తీరవలసిందే. ఇటువంటి వాళ్ళల్లో ఊపిరితిత్తుల్లో కాలిటీ (చీము చేరిన ప్రదేశం) వుంటుంది. లేదా బ్రోంకై ఎక్టేసిస్ ఉంటుంది. బ్రోంకై ఎక్టేసిస్‌లో శ్వాసనాళాలు వ్యాధి గ్రస్తమై బాగా వుబ్బుతాయి. అక్కడ చీము చేరుతుంది. దానివల్ల మాట్లాడుతుంటే వాసన వస్తుంది.

ఉల్లి, వెల్లుల్లి తింటే కూడా నోరు వాసన వస్తుంది. క్రొవ్వు పదార్థాలు ఎక్కువ తిన్నా అరుగుదల సక్రమంగా లేక నోటివాసన వెలువడుతుంది.

-: నోటి వాసన లేకపోయినా ఉన్నట్లు ఫీలింగ్! :-

కొందరిలో పైన చెప్పినవేవీ వుండవు. అయినా వారు తమ నోరు వాసన వేస్తోందని దిగులు పడిపోతూ ఉంటారు. అది కేవలం సైకలాజికల్ ఫీలింగు. ఎవరెంత చెప్పినా, వాసన రావడం లేదని చెప్పినా మనసులో వాసన వస్తోందనే భావం నాటుకు పోవడంతో ఆ ఫీలింగు నుంచి బయటపడ లేక తాము అనుకున్నదే నిజము అనుకుంటూ క్రుంగిపోతూ ఉంటారు.

నోటి దుర్వాసన చాలా మందిలో అంతుపట్టని రహ

స్యమే. అయినా తగిన పరీక్షలు జరిపితే నిజంగా ఉందా, ఉంటే ఎక్కడనుంచి, ఒకవేళ లేకపోతే ఒట్టి సైకలాజికల్ ఫీలింగా అనేది తేలుతుంది.



## 15. మ్రింగుడు పడని ముద్ద తెచ్చే గందరగోళం

కొందరికి అన్నం తినబోతే మ్రింగుడు సరిగ్గా మ్రింగుడు పడదు. గొంతులోనే అడ్డు పడ్డట్లు అవుతుంది. ఎందుకిలా అవుతోందో అర్థంకాకుండా అవుతుంది.

సాధారణంగా అన్నవాహికకి ఏదైనా అడ్డుపడటం, లేదా నరాలు సక్రమంగా పనిచేయకపోవడం లేదా అన్నవాహిక ఇరుకుగా మారి మింగలేక పోవడము ఇందుకు కారణము.

-: సాధారణ కారణాలు :-

అన్నవాహిక [ఈసోఫేగస్] లో మాంసం ముక్కో, పైసలో అడ్డంపడటం ఒక కారణం. ఇటువంటప్పుడు అంతకు ముందు వరకు సక్రమంగా మ్రింగుడు పడటం వుండి సక్రమంగా మ్రింగుడు పడకపోవటం వుంటుంది.

అన్నవాహిక ఇరుకుగా మారితే ముద్ద మ్రింగుడు పడటం కష్టం అవుతుంది. ముద్ద మ్రింగబోతే నొప్పి అనిపించి క్రిందకి దిగదు.

కొందరిలో అన్నవాహిక ఏదో ఒకచోట సన్నబడు తుంది. దానివల్ల ముద్ద క్రిందకి దిగక గొంతులోనే వుంటుంది.

అన్నవాహిక లోపల కంతిఏర్పడినా ముద్ద మింగుడు పడదు. ఒక్కొక్కసారి అన్నవాహికలో కాకుండా ఛాతీ లోపల ఏర్పడే కంతి అన్నవాహికలో నొక్కివేసి ముద్ద మింగడానికి మార్గం లేకుండా చేస్తుంది. అన్నవాహికకి కేన్సర్ వచ్చినా ముద్ద మింగుడు పడదు.

-: రక్తహీనత కలిగించే గందరగోళం :-

కొందరికి అన్నవాహికలో ఎటువంటి అడ్డం ఉండదు. అయినా ముద్ద మింగుడు పడదు. ఇటువంటి పరిస్థితి చాలా సాధారణంగా రక్తహీనత ఉన్నవారికి కనబడుతుంది. వీరికి గొంతులో ఏదో ఉండ అడ్డు పడినట్లు అనిపిస్తుంది. దానితో అన్నం తినబోయి తినలేకపోతారు.

-: పక్షవాతంలో మింగుడు పడని ముద్ద :-

పక్షవాతం వచ్చినప్పుడు నరాల అదుపులేక ముద్ద మింగుడు పడదు.

ముద్ద మింగుడు పడకపోవడం మొదట్లో ఘన పదార్థాలకి ఉండి తరువాత నీళ్లుకూడా క్రిందకి దిగని పరిస్థితి ఏర్పడుతుంది.

బేరియం స్వాలో ఎక్సరే, యం. ఆర్. ఐ. వంటి

పరీక్షల ద్వారా మ్రింగుడు పడకపోవడానికి కారణము స్పష్టంగా బయటపడుతుంది.

-: సైకలాజికల్ ఫీలింగు :-

హిస్టీరియా వంటి మానసిక రుగ్మతలు ఉన్నవారికి, న్యూరోసిస్ వున్నవారికి అన్నవాహికలో లోపం లేక పోయినా ముద్ద మ్రింగుడు పడకుండా వుంటుంది. నిజంగా అక్కడ లోపం ఉండదు. అయినా మానసికంగా మింగ్రుడు పడదని అనుకోవడంతో ముద్దని మ్రింగకుండా గొంతులోనే ఆపేసుకుంటారు. ఒకవేళ ముద్ద క్రిందికి దిగిపోయినా మన స్సులో ఫీలింగు అలాగే వుండిపోతుంది.

ముద్ద మింగుడు పడటం బాధాకరంగా ఉంటుందన్న పరిస్థితుల్లో శారీరక, మానసిక కారణాలని దృష్టిలో వుంచు కోవడం అవసరం.



# 16. మూత్రంలో రక్తం ఎక్కడ నుంచి ?

మూత్రంలో రక్తం పోవడాన్ని 'హిమట్యూరియా' అంటారు. మూత్రపిండాల దగ్గర నుంచి మూత్రనాళము వరకు ఎక్కడైనాసరే ఏదైనా వ్యాధి, కంతిఉంటే దీనివల్ల రక్తం పోవడం ఉంటుంది.

మూత్రనాళంలోగాని, ప్రోస్టేటు గ్రంధిలోగాని రక్త

వెంట రక్తం పోతుంది. మూత్రం ద్వారా రక్తం పోతోం దంటే మూత్రపిండాలు, మూత్రకోశంలోనే వ్యాధులు వుండనవసరం లేదు. అందుకని ఇతర శారీరక వ్యాధులని కూడా పరీక్ష చేయాలి.

మూత్రంలో రక్తం పోతున్న ప్రతి కేసులో మూత్రం ఎర్రగా వుండనవసరం లేదు. కొద్దిగానే పోతున్నప్పుడు మూత్రం మామూలు రంగులోనే వుంటుంది. మైక్రోస్కోప్ తో మూత్రం పరీక్ష చేసినప్పుడు ఎర్రకణాలు కనబడతాయి.

ఎటువంటి గాయం లేకుండా మూత్రంద్వారా ఎక్కువ రక్తం పోతూఉంటే మూత్రపిండాల్లో గాని, మూత్ర వాహికల్లోగాని ఏదైనా కంతి ఉన్నట్లు అనుమానించాలి.

మూత్రంలో ఆల్బుమిన్ అధికంగా వుంటే మూత్ర పిండాల వ్యాధివల్లే రక్తం పోతోందని భావించవచ్చు.

మూత్రంలో రక్తం పోతున్నప్పుడు ఎక్స రే, సిస్టో స్కోప్, ఇతర పరీక్షలు జరిపితే కారణం తెలుస్తుంది.



## 17. స్త్రీలలో మర్మావయాల దగ్గర దురద ఎందుకని ?

ఎక్కువమంది స్త్రీలలో ముట్లు ఎండిపోయే వయస్సులో మర్మావయాల దగ్గర దురద అనిపిస్తుంది.

సాధారణంగా స్త్రీలకి మర్మావయాల దగ్గర దురద

అనిపించడానికి మర్మావయవాల దగ్గర అశుభ్రతే కారణం. అక్కడ చమటపట్టి తామర, ఇతర బాక్టీరియల్ ఇన్‌ఫెక్షను కలుగుతుంది. మర్మావయవాల దగ్గర తెలుపు ఎక్కువై క్లీన్ చేసుకోకపోవడంవల్ల దురద అనిపిస్తుంది.

నైలాన్ డ్రాయర్లు వాడితే సరిపడక దురద అనిపించవచ్చు.

మధుమేహం ఉన్నవారికి మర్మావయవాల దగ్గర దురద సహజం.

ట్రైకోమొనియాసిస్, మొనిలియాసిస్ వ్యాధులు స్త్రీలలో ఎక్కువ. వాటివల్ల మర్మావయవాల దగ్గర దురద ఎక్కువ.

కొందరు స్త్రీలలో ఎటువంటి అనారోగ్య పరిస్థితి లేకపోయినా మర్మావయవాల దగ్గర దురద ఎక్కువ ఉంటుంది. దానికి కారణం వారి మానసిక పరిస్థితే కారణము. సెక్స్ పరంగా అసంతృప్తి, వైవాహిక జీవితంలో పొరపొచ్చాలు మర్మావయవాల దగ్గర దురద రూపంలో బయట పడతాయి.

మర్మావయవాల దగ్గర దురద ఉన్నప్పుడు వైట్ డిశ్చార్జిని మైక్రోస్కోప్‌తో పరీక్ష చేయాలి. బ్లడ్, సుగర్, మూత్రం పరీక్ష చేయాలి. మెనోపాజ్ వల్ల దురద అయితే ఈస్ట్రోజన్ మందులు వాడాలి. అన్నింటికి మించి మర్మావయవాల దగ్గర పరిశుభ్రత అతిముఖ్యం.



# 18. చలి ఉంటే మలేరియా జ్వరమేనా ?

జ్వరంతో పాటు చలి రావడం, వణుకు ఉండటము అతి సహజం. చలి వుంటే ఆ జ్వరం మలేరియా జ్వరం అనుకోవడం; మలేరియాకి మందులు మ్రింగేయడం మరీ సహజం.

-: చలి ఉన్నంత మాత్రాన్న మలేరియా కాదు :-

చాలా జ్వరాలు చలితో మొదలవుతాయి. లేదా జ్వరం వచ్చిన తరువాత చలి వస్తుంది. ఫ్లూ జ్వరం, మూత్ర సంబంధిత వ్యాధులు, మెదడువాపు జ్వరం, టాన్సిల్స్‌వార్ న్యుమోనియా వంటి జ్వరాల్లో కూడా చలి వుంటుంది. రక్తం ఎక్కించినప్పుడు ఎలర్జి అనిపించి చలిజ్వరం రావచ్చు. అంతేగాని ఎక్కించే రక్తంలో మలేరియా క్రిములు వుండి వెంటనే చలి, జ్వరం కలిగించడంకాదు. టైఫాయిడ్ రాకుండా ఇచ్చే వాక్సీనువల్ల కూడా చలిజ్వరం రావచ్చు. ఈ రకంగా తీసుకుంటే ఎన్నో జ్వరాలలో చలి ఉండవచ్చు.

-: చలి జ్వరాలలో రకాలు :-

మలేరియా కాకుండా మామూలుగా వచ్చే కొన్ని జ్వరాల్లో ఒకసారే చలి, వణుకు వచ్చి ఆ తరువాత వుండక పోవచ్చు.

మలేరియా, మరికొన్ని జ్వరాల్లో చలి, వణుకు మళ్ళీ మళ్ళీ వస్తాయి. అంతేగాని జ్వరం ప్రారంభంలో వచ్చి మళ్ళీ రాకపోవడం వుండదు. అలా మాటిమాటికీ చలి, వణుకువచ్చే జ్వరాల్లో మలేరియా, రిలాప్సింగ్ ఫీవర్, ల్యుకీమియా, సెప్టిసీమియా, సిస్టయిటిస్, శ్వాసకోశాల్లో క్షయవ్యాధి, చీముగడ్డ తయారవడం, కాలేయంలో ఎమిబిక్ యాబ్సెస్ వంటి వాటిని గుర్తు ఉంచుకోవాలి.

## -: మలేరియా జ్వరం ప్రత్యేకత :-

మలేరియా జ్వరం సాధారణంగా 24 లేదా 72 గంటలకి ఒకసారి కనబడుతుంది. ఈ జ్వరానికి ముందు సడన్‌గా చలి, వణుకు వస్తాయి. ఆ తరువాత కొద్ది సేపటికి జ్వరం ముంచుకువస్తుంది. జ్వరంతో ఒళ్ళు మండిపోతుంది. చలి, వణుకు తగ్గిపోతాయి గాని జ్వరం మండిపోతుంది. ఆ తరువాత కొద్ది సేపటికి విపరీతంగా చమటలుపోసి జ్వరం దిగిపోతుంది.

## -: తేడా తెలుసుకోవడం ఎలా ? :-

చలి జ్వరం వచ్చే వాటిని దృష్టిలో వుంచుకుని పూర్తి వైద్యపరీక్ష చేయాలి. వాటికి సంబంధించిన రక్త పరీక్షలు ఇతర పరీక్షలు చేసి వ్యాధిని నిర్ధారణ చేయాలి.



# 19. కలరా జబ్బా? విషాహార ఫలితమా?

కొందరికి ఉన్నట్లుండి విపరీతంగా వాంతులు, విరోచనాలు అయిపోయి కొలాప్స్ అయిపోయే పరిస్థితి ఏర్పడుతుంది. చూసేవారికి కలరావ్యాధి సోకిందా అన్నంతభయం కలుగుతుంది. విషాహారం భుజించినప్పుడు కూడా కలరా లాగానే వాంతులు అవడం, విరోచనాలు అవడం, రోగి పరిస్థితి విషమించడం వుంటుంది.

## -: కలరాలో ఎలా ఉంటుంది ? :-

కలరా సాధారణంగా వర్షాకాలం వంటి సీజన్స్‌లో వస్తుంది. అదీకాక కలరావ్యాధి ఒకేసారి ఎందరికో వస్తుంది. కలరా సోకినప్పుడు ముందు విరోచనాలు మొదలవుతాయి. బియ్యం కడిగిన నీళ్ళలాగా అదుపు—హద్దు లేకుండా అయిపోతూ వుంటాయి. నీళ్ళ విరోచనాలు మొదలైన కొద్ది సేపటికి వాంతులు పట్టుకుంటాయి. వాంతులు చెంబు గుమ్మరించినట్లు ఒక్కసారిగా బయటపడతాయి. విరోచనాలు లాగానే వాంతులుకూడా హద్దు, అదుపు లేకుండా అయిపోతాయి. వాంతులు, విరోచనాలతో కొద్దిసేపట్లో ఒంట్లో నుంచి నీరు ఎండిపోతుంది. చర్మం ముడతలు పడిపోతుంది. కళ్ళు గుంటలు అవుతాయి. బుగ్గలు లోతుకు పోతాయి. నాలిక ఎండిపోతుంది. ఒళ్ళు చల్లగా అయిపోతుంది.

-: విషాహార ఫలితం అయితే... :-

విషాహార ఫలితం అయితే వాంతులు, విరోచనాలు అవడం ఒకే కుటుంబంలోగాని, ఒకేచోట ఆహారం తీసుకున్న వారిలోగాని వుంటాయి. విషాహారం తీసుకున్న గంటనుంచి 24 గంటలలోనే వాంతులు, విరోచనాలు మొదలవుతాయి. కలరాలో వ్యాధి లక్షణాలు విరోచనాలతో ప్రారంభమైతే విషాహారంలో వాంతులతో బాధ లక్షణాలు మొదలవుతాయి. ఈ వాంతులలో మ్యూకస్, రక్తంకూడా వుండవచ్చు. విరోచనాలలో కూడా మ్యూకస్, రక్తం వుంటుంది. మాటిమాటికీ విరోచనాలు అవుతాయి. కలరాలో మలద్వారం దగ్గర కండరాలు బిగదీయడం వుండదు. కాని విషాహార ఫలితంగా అయ్యే విరోచనాలలో మలద్వారం దగ్గర కండరాలు బిగదీసుకుని నొప్పి అనిపిస్తుంది. కలరాలో డిహైడ్రేషన్ అతి తీవ్రంగా వుంటే ఇందులో అంత తీవ్రంగా వుండదు. కలరాలో ఒళ్ళు చల్లబడిపోతే ఇందులో జ్వరం 100-102 డిగ్రీల వరకు వుంటుంది. కలరాలో కడుపునొప్పి అంతగా అనిపించదు. ఇందులో కడుపు పుండులాగా బాధ అనిపిస్తుంది.

కలరాలో అయ్యే వాంతులు, విరోచనాలని మైక్రోస్కోప్‌తో పరీక్ష చేస్తే కలరా క్రిములు స్పష్టంగా కనబడతాయి.



## 20. తాగి పడి ఉన్నాడా ? తలకి దెబ్బ తగిలి పడి ఉన్నాడా ?

ఒక్కొక్కసారి రోడ్డు ప్రక్కన వ్యక్తి పడిఉండి అపస్మారక స్థితిలో కనబడతాడు. తాగి పడి ఉన్నాడా? ఏదైనా డామేజి స్తే తలకి దెబ్బ తగిలి పడిఉన్నాడా అన్న సందేహం కలుగుతుంది. అది తేలక తికమకలో పడటం జరుగుతుంది.

:- ప్రాగిన మైకంలో పడిఉంటే... :-

ఆ వ్యక్తికి మాటలు గందరగోళంగా ఉంటాయి. ముఖమంతా ఉబ్బి ఉంటుంది. నాడి వేగంగా కొట్టుకుంటుంది. నాడి గట్టిగా తగులుతుంది. కంటిపాప చిన్నదిగా వుంటుంది. ఆ సమయంలో అతన్ని పలకరిస్తే చాలా అసభ్యంగా మాట్లాడుతాడు. సహాయం అందించే వ్యక్తితో సహకరించడు. నోటివెంట, ముక్కువెంట మద్యం వాసన వెలువడుతుంది.

:- తలదెబ్బ అయితే... :-

జ్ఞాపకశక్తి చాలా తక్కువ ఉంటుంది. పూర్తి మతిమరుపు కనబడుతుంది. ముఖం పాలిపోయి వుంటుంది. ముఖంలో ఎటువంటి భావాలూ కనబడవు. నాడి చాలా నిదానంగా కొట్టుకుంటుంది. కంటిపాప చిన్నది అవుతుంది. అయితే రెండువైపు కంటిపాపలు ఒకేసైజులో ఉండవు... తల దెబ్బవల్ల పడి వున్నవ్యక్తి సహాయం అందించే వ్యక్తితో సహకరిస్తాడు. నోటివెంట అనవసరంగా మాటలు వుండవు. ఊపిరి చాలా తక్కువ తీయడం, రెగ్యులర్‌గా లేకపోవడం ఉంటుంది.



# 21. మెంటల్ - తెలుసుకోవలసిన సంగతులు

సాధారణంగా ఏ వ్యక్తి అయినా కాస్త అసాధారణంగా ప్రవర్తిస్తూ ఉంటే మెంటల్, పిచ్చి అనడం పరిపాటి. కాస్త కంగారు, గాభరాపడే వాళ్ళనికూడా 'వాడికి కాస్త పిచ్చి వుంది' అనడం పరిపాటి. కాని నిజంగా మెంటల్ (పిచ్చి) అయిన వ్యక్తిలో కొన్ని ప్రత్యేక లక్షణాలు కనబడతాయి. ఆ లక్షణాలు వున్న పిచ్చిని 'సైకోసిస్' అంటారు.

## —: సైకోసిస్ [పిచ్చి] లక్షణాలు :—

నిజంగా మెంటల్ ఉన్నవ్యక్తి పర్సనాలిటీ పూర్తిగా దెబ్బ తింటుంది. అతని ఆలోచనలు, ఉద్వేగాలు, ఉద్రేకాలు, ప్రవర్తనలో అసాధారణమైన తేడా కనబడుతుంది. అతని తెలివితేటలు పోతాయి. జ్ఞాపకశక్తి దెబ్బ తింటుంది. తాను ఎక్కడ వున్నదీ తెలియని పరిస్థితిలో వుంటాడు. ఒక విషయం మంచీ చెడూ ఆలోచించే శక్తి కోల్పోతాడు. వాస్తవ స్థితిని అర్థం చేసుకోలేడు. తన గురించి, తనవాళ్ళ గురించి, సమయం, కాలం సరిగ్గా చెప్పలేని స్థితిలో ఉంటాడు. ఊరికే ఏడవడం, కోపం తెచ్చుకోవడం, నవ్వడం వుంటాయి.

## —: స్కిజోఫ్రినియా :—

స్కిజోఫ్రినియా అనే మెంటల్ డిసీజ్ కూడా సైకోసిస్‌కి సంబంధించినదే. ఈ మెంటల్ వ్యాధి సాధారణంగా

వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. స్కిజాయిడ్ పర్స నాలిటీ ఉన్నవారికి కూడా స్కిజోఫ్రినియా వ్యాధి వస్తుంది.

స్కిజోఫ్రినియా సాధారణంగా చిన్న వయస్సుల్లోనే మొదలవుతుంది. వీళ్ళలో ఆలోచనలు గందరగోళంగా ఉంటాయి. ఏ ఆలోచనకీ స్పష్టమైన రూపం వుండదు. పైగా వీరిలో సరైన ఆలోచనా విధానం వుండదు. ఏ విష యాన్ని అయినా కొంతవరకే ఆలోచించగలుగుతారు. ఇక ఆపైన ఆలోచన ముందుకు సాగదు. అర్థం పర్థంలేని ఆలో చనలు వస్తాయి.

స్కిజోఫ్రినియా వున్నవారు ఏ విషయంమీదకూడా శ్రద్ధ పట్టలేరు. వీరి ప్రవర్తన అసహ్యకరంగా, అభ్యంతర కరంగా వుంటుంది. సెక్సుపరంగా విపరీత ధోరణులుకూడా వుంటాయి.

వీరిలో ఆత్మవిశ్వాసం వుండదు. శక్తి సామర్థ్యాలు తక్కువగా వుంటాయి. భ్రమలు–భ్రాంతులు కలుగుతూ వుంటాయి. పగటి కలలు ఎక్కువకంటూ వుంటారు. ఊరి కినే నవ్వడం, ఏడ్వడం చేస్తారు. చిన్న పిల్లలలాగా ప్రవర్తి స్తారు. చిన్నపిల్లలలాగా బట్టల్లో మలమూత్ర విసర్జన చేస్తారు. స్కిజోఫ్రినియా ఎక్కువ వున్నప్పుడు వారి మల మూత్రాలతో ఆడుకుంటారు.



ఎక్యూట్ కోలిసిస్టయిటిస్ :- పసరుతిత్తి (గాల్ బ్లాడర్) ఇన్ ఫెక్షను కోలిసిస్టయిటిస్ అంటారు. పసరుతిత్తికి ఇన్ ఫెక్షను రావడం 40 సంవత్సరాలు దాటిన స్థూలకాయం వున్న స్త్రీలకి ఎక్కువ. దీనికి సంబంధించిన నొప్పి పై కడుపులో కుడివైపు వస్తుంది. ఈ నొప్పి వచ్చినప్పుడు ఆకలి అనిపించదు. వికారం, వాంతులు వుంటాయి. త్రేపులు వస్తాయి. త్రేపులలో గ్యాస్ బాగా బయటకు వస్తుంది. జ్వరం వుంటుంది. పచ్చకామెర్లు కూడా కొందరిలో కన బడతాయి.

ఎక్యూట్ పాన్ క్రియాటైటిస్ :- ఈ నొప్పి సడన్ గా వస్తుంది. నొప్పి చాలా తీవ్రంగా వుంటుంది. ఈ నొప్పి పై కడుపులో ఉంటుంది. ఆ నొప్పి వీపు వెనకకి కూడా వెళ్ళుతుంది. వాంతులు ఎక్కువగా అవుతాయి.

పెప్టిక్ అల్సర్ పెర్ ఫొరేషన్ :- జీర్ణాశయంలో వుండే పుండు (గాస్ట్రిక్ లేదా డ్యూయోడనల్ అల్సర్స్) పగిలి పేగుకి కన్నం పడ్డప్పుడు సడనుగా బాగా మంట అనిపిస్తూ నొప్పి కలుగుతుంది. ఈ నొప్పి పై కడుపులో అనిపిస్తుంది. భుజాల దగ్గరకూడా అనిపిస్తుంది. పై కడుపు బాగా బిగదీస్తుంది. తరువాత మొత్తం కడుపు బిగదీస్తుంది. చెయ్యిపెట్టి నొక్కితే పొట్ట చాలా టైట్ గా అనిపిస్తుంది. నొక్కితే బాగా నొప్పి అనిపిస్తుంది. ముఖం ఎంతో ఆందోళనగా కనిపిస్తుంది. కళ్ళు లోపలికి పోతాయి. బుగ్గలు గుంట